

చక్రవాకరాగం

STUDIO Roopkala

ఎన్ టి రామారావు
రేలంగి
గుమ్మడి
రమణారెడ్డి
నాగయ్య
మిక్కిలినేని
కృష్ణకుమారి
గిరిజ
సూర్యకాంతం






ఆంధ్ర నైజాం...
సీడెడ్...భాస్కర్

దర్శకత్వం
వి మధుసూదనరావు

నిర్మాతలు
డి వి రెడ్డి
తమ్మారెడ్డి కృష్ణమూర్తి

# ఈ సంచికలో



ముఖచిత్రం : 'విజయ దుర్గ'

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య



నా అభిమాన పత్రిక యువలో మీరు ప్రచురించిన డి. హనుమంత రావుగారి "పరదా" కుమారి మంగు పద్మావతిగారి "మరుగుపడిన జీవన రాగాలు" చాలా బాగున్నవి. వారికి నా ధన్యవాదాలు మరియు కె. కౌసల్యా దేవిగారి సీరియల్ "చక్రనేమి" యువకు వన్నె తెచ్చినది. కథ చాలా రసవత్తరముగా నున్నది. వారికి నా వందనములు. పాఠకులకు ఎంతో హాయి నిస్తున్న దీ యువ.

వై. సుమతీమూర్తి

బిట్రగుంట

క్లాసికల్ తెలుగు కథల పత్రికలలో యువదే అగ్రస్థానమంటే ఎంత మాత్రం అతిశయోక్తి కాదేమో! మూర్తీభవించిన అందంతో అలరారే వడ్డాది వారి చిత్రలేఖనం అమందానం దాన్ని కలుగజేస్తున్నది. భావగర్భిత మైన చిత్రలేఖనంలోని, నిగూఢ భావ పరంపరలు, సామాన్యులకే కాక, ప్రాజ్ఞులకు కూడా అర్థం కావటము లేదంటే మీరు నమ్మరేమో! ఇంత గొప్పగా ఊహించి చిత్రాలు రాస్తున్న పాపయ్యగారు అభినందనీయులు

సెప్టెంబరు సంచికలో "చూపులో చూపు" నన్నెంతో ఆకర్షించింది. సీరియల్ కథ మంచి రసవత్తరంగా సాగుతున్నది. మోహనమూర్తి - తార - పరదా - కథలు బావున్నవి. కార్టూనులు ఇంకా ఎక్కువగా వేయవలసిందిగా హృదయపూర్వకముగా కోరుచున్నాను.

నల్లా దత్తాత్రేయులు

మోరి.

వడ్డాది పాపయ్యగారు చిత్రించిన 'స్త్రీ' చాలా మనోహరముగా ఉన్నది. 'మరుగుపడిన జీవనరాగాలు,' కుమారి కె కౌసల్యాదేవిగారి చక్రనేమి సీరియల్ చాలా రసవత్తరంగా ఉంది మధ్యమధ్య కార్టూనులు చాలా బాగుంటున్నవి. ఇలా ప్రచురిస్తున్నందుకుగాను సంపాదకులకు మా ధన్యవాదాలు అందచేస్తున్నాము.

బి. గీతాకుమారి
హైద్రాబాద్.

'మరుగుపడిన జీవనరాగాలు, పరదా, తార' కథలు చాల బావున్నాయి కోడూరి కౌసల్యాదేవిగారి సీరియల్ "చక్రనేమి" వాస్తవికతకు దగ్గరగా వుంది. మధ్య మధ్య కార్టూనులు, చూపులో చూపు, బొమ్మలను చూస్తే నవ్వొస్తోంది ప్రతి నెలా యువలో అందంగా, ఆనందంగా క్రొత్త శీర్షికలను అందిస్తూన్న సంపాదకులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.

కుమారి రావూరి స్వర్ణలత
కృష్ణాయపాలెం.

'యువ' నా అభిమాన మాసపత్రిక. కుమారి కోడూరి కౌసల్యాదేవిగారి చక్రనేమి చదువుతుంటే ఎంతో ఆనందోత్సాహాలు కల్గినాయి అందులోను డుంబు పిక్నిక్ హాస్యరసంతో నిండి నవ్వించింది శ్రీ వడ్డాదిగారి బొమ్మల్లో జీవకళ వుట్టిపడుతూ మన యువకి క్రొత్తదనం ఇస్తున్నాయి 'నిజానికీ అబద్ధానికి మధ్య' కథ చాలా బాగుంది. వినోదము, విజ్ఞానము కల్గిస్తూ రసవత్తరంగా పత్రికను ప్రచురించుచున్న యువ సంపాదకులకు నా అభినందనలు.

ఎం. రామకృష్ణ,
కళింగపట్నం.

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

101 పుష్పకుంజ్ ఎ రోడ్, చర్చిగేట్ బొంబాయి-1

# యువ

## దీపావళి సంచిక

ఇందులో

పాలగుమ్మి పద్మరాజు
అవసరాల రామకృష్ణారావు
ప్రతిమాదేవి
ముప్పాళ రంగనాయకమ్మ
కోడూరి కౌసల్యాదేవి
విజయలక్ష్మి
ఇసుకపల్లి దక్షిణామూర్తి
హితశ్రీ
అరుణ
సి. నారాయణరెడ్డి
తురగా జానకీరాణి

ఇంకా...

పెద్దకథ, వడ్డాది పాపయ్యగారి వర్ణ చిత్రాలు

కార్టూనులూ - బొమ్మలకథ

ఇంకా ఎన్నో ఆకర్షణలతో

అక్టోబరు నెలాఖరుకు వెలువడుతుంది

వెల రు 3-00

**యువ కార్యాలయం,**
పబ్లిక్ గార్డెన్ రోడ్,
హైదరాబాద్ - 1.

యువ

సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 8 అక్టోబరు 1963 సంచిక 4

కాంగ్రెసు పార్టీకి కాయకల్ప చికిత్స చెయ్యడానికి మదరాసు ముఖ్యమంత్రి కామరాజనాడార్ సూచించిన పథకాన్ని అమలు జరపడంలో ప్రథమచర్యలు ప్రారంభమైనవి. తత్ఫలితంగా, మంత్రిపదవులనుంచి కొందరు మహామహులు రాలిపోయారు. ఈ రాలిపోయిన తారలు కొన్ని, మళ్ళీ ఆకాశపథానికి ఎక్కడం కల్ల. వీరు ఇకముందు పార్టీకి చెయ్యగల సేవకూడా అంతంతమాత్రమే.

కామరాజు ప్లాను, నిజంగా చాలాగట్టిదే. దానివల్ల కాంగ్రెసు పార్టీకీ, దేశానికీ కలుగబోయే ప్రయోజనాలు ఎన్నో వున్నాయి. ఆ ప్రయోజనాలతో పాటు, కొన్ని ప్రమాదాలుగూడా వున్నాయి. ప్రయోజనాలను సాధించుకొని, ప్రమాదాలను అరికట్టగల ప్రవర్తనను కాంగ్రెసునాయకులు ఆచరణలో పెట్టినట్లయితే, దేశానికి, అంటే ప్రజలకు, మంచి మేలు కలుగుతుంది. కాని, ప్రయోజనాలనే కోరే మానవ ప్రకృతి, స్వప్రయోజనసిద్ధికి పాటుపడడంలో తక్కినవారికి కలిగే ప్రమాదాలను లెక్కచెయ్యదు. దీనివల్ల కొంతమంది వ్యక్తులు పొందిన ప్రయోజనాలే, దేశక్షేమానికి ప్రమాదాలుగా తయారవుతవి. అలాటి పరిస్థితిని నివారించడం, కాంగ్రెసు పార్టీకి సాధ్యమవుతుందా ?

కామరాజు ప్లాను, చాలా దూరాలోచనతో కూడినది. ఈనాడు కాంగ్రెసుపార్టీ అనేక అంతఃకలహాలతో కూడుకొనివున్నది. పార్టీలోని అంతఃకలహాల వల్లనూ

పార్టీ అవలంబించే విధానాలపట్ల ప్రజలలో నానాటికీ హెచ్చుతూ వున్న వైముఖ్యం వల్లనూ, క్రమ క్రమంగా కాంగ్రెసుపార్టీ పలుకుబడి తగ్గటం జరుగుతున్నది. ఇలాగే పరిస్థితులు వుంటే, కాంగ్రెసుపార్టీ బలహీనమైపోతుం దని నాయకులు గ్రహించారు. చాలా గట్టిపథకం ఏదో వేస్తేనేగాని పార్టీకి మళ్ళీ జీవం పొయ్యడం సాధ్యం కాదనుకున్నారు. అలాటి సందర్భంలో, యీ కామరాజు ప్లాను వచ్చింది.

కామరాజు ప్లాను, మంత్రిపదవులలో వున్నవారిని కొందరిని తొలగించి, కొత్త వారి కెవరికో కొందరికి మంత్రిపదవులను కట్టిపెట్టడం కాదు. మంత్రి పదవులలో వున్న అగ్రనాయకులు కొందరు, ఆ పదవుల నుంచి విరమించి, పార్టీ పునరుద్ధరణకు కృషిచేసేటట్టు చెయ్యడం యీ ప్లానులోని ప్రథమదశ. ఈ దశలో సాధించదలచినది ఏమంటే, మంత్రులుగా పదవులను నిర్వహించి అధికారం చెలాయించినవారు, తమ పదవులను త్యజించి పార్టీ సేవకోసం మళ్ళీ ప్రజలలోకి వస్తున్నా రంటే, ప్రజలకు పార్టీపట్ల అభిమానం మళ్ళీ ఏర్పడవచ్చును. అంతేకాక, ఇన్నాళ్ళూ మంత్రిపద వుల కోసం తహతహ లాడుతూ, పార్టీలో అనేక అంతఃకలహాలకు కారకు లవు తున్న కొంతమందికి మంత్రి పదవులు లభించి, వారికి గల అసంతృప్తి తొలగి యికముందు పార్టీని బలపరచడానికి వారుకూడా కృషి చెయ్యడానికి అవకాశం ఏర్పడుతుంది. ఒకవేళ, ఇలాంటివారికి కొందరికి మంత్రిపదవులు లభించక పోయినా, పార్టీ క్షేమంకోసం మంత్రిపదవులు వున్నవారే వదలుకొంటూ వుంటే లేనివారు అలాటి పదవులకు ఆశించడం మంచిది కాదనీ, పార్టీ శ్రేయస్సును మన స్సులో వుంచుకొని మంత్రిపదవులపట్ల వ్యామోహాన్ని వదలి, పార్టీని బలపరచ డానికే కృషి చెయ్యాలనే భావం వారికి కలుగవచ్చును. అలాంటి భావం కొందరికి కలుగకపోయినా, ఆ బాధ్యతను వారి తలమీద పార్టీ నాయకులు పెట్టవచ్చును. తమ బాధ్యతను గుర్తెరిగి ప్రవర్తించనివారికి పార్టీనుంచి ఉద్వాసన కలుగుతుం దనీ, తత్ఫలితంగా ఇకముందెప్పుడూకూడా మంత్రిపదవులు లభించే అవకాశం వుండ దనే భయంవల్ల ఇలాటివారు కిమ్మనకుండా పార్టీ సేవ చెయ్యవచ్చును. ఈ విధంగా, పార్టీలోని అంతఃకలహాలను అంతమొందించడానికి, కామరాజు ప్లాను ఉపకరిస్తుం దని నాయకుల ఊహ. ఈ ఊహ చాలావరకు ఫలించవచ్చునుకూడా.

ఏమయినా, యీ ప్లాను ప్రకారం జరిగిన మొదటి ఫలితం ఏమిటంటే, కేంద్ర మంత్రిమండలినుంచీ, రాష్ట్ర మంత్రిమండలులనుంచీ ప్రధానమంత్రికి అనుకూలురు కానివారిని పదవులనుంచి తొలగించడం జరిగింది. కాని, ప్రధానమంత్రికి అనుకూలురు కానివారిని మంత్రిపదవులనుంచి తొలిగించినంతమాత్రాన పరిస్థితులు చక్కబడవు

కదా ! వీరు పార్టీసేవ పేరుతో పార్టీలో తమ బలాన్ని పెంచుకొని ప్రధానమంత్రికి పార్టీద్వారా చికాకు కలిగించవచ్చునుకదా ? అంచేత, ప్రధానమంత్రికి అనుకూలు రైన వారుకూడా పార్టీలో బలమైన స్థితిలో వుండటం అవసరం. అంచేత, ప్రధానమంత్రికి అనుకూలు రైనవారినికూడా మంత్రిపదవులనుంచి, పార్టీ సేవకు పంపడం జరిగింది. కేంద్రప్రభుత్వ దృష్ట్యా ఇది ఎంతో, రాష్ట్రాల దృష్ట్యాకూడా అంతే. అంటే, మళ్ళీ దేశమంతటా ప్రతిరాష్ట్రంలోనూ కాంగ్రెసుపార్టీలో రెండు ముఠాలు ఏర్పడితీరుతవి. ఇప్పుడు ప్రభుత్వాన్ని సాగిస్తున్న నాయకుల నాయకత్వాన్నే చిరస్థాయిగా వుండేటట్లు చేసి, దానివల్ల కలిగే ప్రయోజనాలను అనుభవించడానికి ఆశించేముఠా ఒకటి; ఇప్పుడు ప్రభుత్వాన్ని సాగిస్తున్న నాయకులను పదవులనుంచి తొలగించి, తమ ప్రయోజనాలను తీర్చే నాయకులను పదవులలోకి వచ్చేటట్టు చెయ్యడానికి ప్రయత్నించే ముఠా మరొకటి. ఇలా రెండుముఠాలు శాశ్వతంగా ఉండక తప్పదు. వీటిని తొలగించడానికి ఎవరికీ సాధ్యంకాదు.

అయితే, ప్రస్తుతం పదవులలో వున్నవారే, అధికారం తమచేతిలో వుంటుంది కనుక, తమ అనుయాయుల ప్రయోజనాలను తీర్చగల స్థితిలో వుంటారు. తమకు ప్రతిస్పర్థు లైనవారిని అణగద్రొక్కడానికి తమ అధికారాన్ని వినియోగించగలరు. అంచేత, తమ స్థితిని భద్రంగా కాపాడుకోగల స్థితిలో వుంటారు.

ఇది కాంగ్రెసుపార్టీకి సంబంధించినంతవరకు జరిగే పరిస్థితి. ఇక, ఇతరపార్టీల విషయంలో ఏమవుతుందో చూదాం.

ప్రస్తుతం తమపార్టీ అధికారంలో వున్నందున, పార్టీసేవకు పదవులనుంచి విరమించిన నాయకులు తమ పార్టీని పటిష్టం చేసుకోడానికి చేసే కృషి బాగా ఫలవంతం కాగలదు. గ్రామ గ్రామంలోనూ పార్టీకేంద్రాలను స్థాపించి, ప్రజలలో నిర్విరామంగా ప్రచారం చేసి, ప్రజల అవసరాలేమిటో స్వయంగా తెల్సుకొని, అధికారంలో వున్న తమ పార్టీచేత ఆ అవసరాలను తీర్పించి, కాంగ్రెసు పార్టీవారు ప్రజాభిమానాన్ని పొందగలరు.

ఈ విధంగా ప్రజల అభిమానాన్ని పొంది, అధికారంలో స్థిరపడినపార్టీ, తన కిక ఎదురులేని పరిస్థితిలోకి వచ్చినట్లయితే, నిరంకుశాధికారాన్ని నిర్వహించడమూ, ఏ ప్రజల అభిమానాన్ని సంపాదించడం కోసం తాము నిరంతర కృషి చేశారో, ఆ ప్రజలనే అణగద్రొక్కి రాజ్య మేలడమూ జరుగుతుంది.

అలాటి దుర్భర పరిస్థితి ఏర్పడకుండా, విచ్చలవిడిగా తాము చేసే అయోగ్య మైన పనులను వ్రేలు పెట్టి చూపి, తమ అధికారాన్ని దుర్వినియోగం చెయ్యకుండా అదుపులో వుంచగల ప్రతిపక్షంకూడా ఒకటి దేశంలో వుండా లని గ్రహించి కాంగ్రెసు పార్టీవారు నడచుకుంటే మంచిది.

తాను బలవంతంగా వుండా లనీ, తాను శాశ్వతంగా పదవిలో వుండా లనీ ఏ పార్టీ అయినా కోరవచ్చును. తదనుగుణంగా కృషి చెయ్య వచ్చును. కాని, ప్రతిపక్షమే వుండకూడ దనీ, తన చర్యలను అధిక్షేపించేవారే వుండకూడ దనీ, ఏ పార్టీకూడా కోరకూడదు. ప్రతిపక్షమే లేక, ఒకేపార్టీ సంపూర్ణాధికారంతో పరిపాలన సాగించిం దంటే, అది అతి శీఘ్రకాలంలోనే నియంతృత్వరాజ్యంగా పరిణమిస్తుంది. అలాటి పరిస్థితిలో ప్రజల హక్కులు మన్నులో కలసిపోతాయి. పదమూడు సంవత్సరాలలో పదిహేడు సార్లు రాజ్యాంగ విధానాన్ని సవరించిన కాంగ్రెసు పార్టీ, నియంతృత్వ విధానంలోకి దిగిం దంటే, రాజ్యాంగవిధానం చెక్కుచెదరకుండా వుంటుం దని ఎవ రనుకోగలరు.

దేశ స్వాతంత్ర్యానికి కృషి చేసిన కాంగ్రెసుపార్టీ వేరు; అధికార వ్యామోహంలో పడిన కాంగ్రెసుపార్టీ వేరు. పోటీలేని పార్టీగా తయారైననాడు, కాంగ్రెసుపార్టీ ఇంకా మారిపోతుంది. అలా జరగ దని అనుకోడానికి ఆధారం ఏమీ లేదు. ఈ ప్రమాదం కలుగకుండా, తానే కట్టుదిట్టాలు చేసుకోవడం, ప్రజాహితాభిలాషి అయిన కాంగ్రెసుపార్టీ ధర్మము. మార్పులను గమనిస్తూ, కాంగ్రెసుపార్టీ నియంతృత్వ పార్టీ కాకుండా జాగ్రత్త వహించడం, ప్రజల కర్తవ్యం.





# చిత్ర వార్తలు

ఆంధ్రప్రదేశ్‌లోని ఒక హైయర్ సెకండరీ స్కూలు ఉపాధ్యాయుణ్ణి రాష్ట్రపతి బహూకరించుట.

★

క్రిందిచిత్రం : రాష్ట్రపతి రాధాకృష్ణన్ 75 వ జన్మదినమునాడు భారత సేనాధిపతులు జెనరల్ చౌదరి, ఎయిర్ మార్షల్ ఇంజినీర్, రియర్ అడ్మిరల్ నందాగార్లు రాష్ట్రపతిని దర్శించినప్పటి చిత్రం.





ఓక్లా ఇండస్ట్రియల్ ఎస్టేటులో రేడియో సెట్లను తయారు చేయుటను బల్గేరియా రిపబ్లిక్ డిప్యూటీ ప్రధాని మంత్రి శ్రీ జివ్‌కో జివ్‌కోవ్ సందర్శించుట

★

క్రింది చిత్రం హిమాలయ ప్రాంతములో గాయములు తగిలినవారిని సురక్షిత స్థానములకు చేర్చుటకు తేలిక మడతత్రోపుడు బండ్లను ఇండియాలోనే తయారుచేసి ఉపయోగిస్తున్నారు.





గురుదేవుని శాంతినికేతనంలో విద్యార్థులు శ్రద్ధతో ఆలించుట

క్రిందిచిత్రం ఇండియాలోనే తయారయ్యే పేరాచూట్లకు గుడ్డలో పేనల్స్ కత్తిరించుట



# సినిమా క్విజ్




పై మూడు బొమ్మలూ మూడు సినిమాల పేర్లు తెలియజేస్తవి...ఏమిటవి?

(జవాబులు 30 వ పేజీలో)





9. బొమ్మలకే ప్రాణాలొస్తే ...



# పనిలేని మంగలి

బ్రతుకుతెరువుకోసం ఎన్నయినా వేషాలు వేయవచ్చు ననుకోండి చూస్తున్నాం పశువుల సంతల్లోనూ, పెద్ద పెద్ద మార్కెట్లలోనూ పుసుకుడుగాళ్లు అనే వాళ్లనీ, పెద్ద పెద్ద కంపెనీలకూ సంస్థలకూ సహాయ పడే వాళ్ళనీ మర్యాదగా బ్రోకర్సు అని పిలుస్తారు. వారు తీసుకునే ద్రవ్యానికి బ్రోకరేజి అనే పదం పెట్టి దానికి ఒక గౌరవాన్ని ఆపాదించారు. ఇంక ప్రతీ అధికారికీ ఒక ఆప్తుడు అనేవాడు ఉంటుంటాడు వాడు ఇతరులకి ఈ అధికారి చేత పనులు చేయించిపెట్టి తను ఏదో లాభం పొందుతూంటాడు. దానిని ఏమనాలో మనకి ఏం తెలుసు? అయితే అధికారికి లభించే లాభం మాత్రం లంచం అని అనకూడదు, కాని బహుమతి అనో, సన్మానం అనో అంటే అది లంచంక్రింద రాదుగా ఇంక దొడ్డిగుమ్మంలోంచి అమ్మగారు అందుకునేవాటికికూడా ఇదే వర్తిస్తుందా? ఇంక ఈ బ్రోకర్ల తెగకు చెందకుండా ప్రజాప్రతినిధులుగా ఎన్నిక అయి ప్రజోపయోగంకోసం దారిఖర్చుల నిమిత్తమనో, ఇతరత్రా వ్యయాల కనో ప్రజలవద్దనే బ్రతిమాలించుకొని కొంత సొమ్ము తీసుకుని రాజధానీనగరాలలో ఆఫీసుల వెంటా, ఆఫీసర్ల వెంటా తిరిగే ప్రజాప్రతినిధులు ఎందరు లేరు? పాపం వాళ్లకి ప్రభుత్వం ఇచ్చే బత్యాలు ఏమాత్రం! ఒక రాత్రి ఖులాసాకు సరిపోనే సరిపోదుగదా! ఇంక అక్కడ మన ఎమ్. ఎల్. ఏ. గారో, ప్రెసిడెంటుగారో వెళ్లారు,

మంత్రులతోనే మాట్లాడి మన వ్యవహారం పరిష్కారం చేసేస్తారు అని అనుకుంటారు. దీని విషయమై ఆయా ప్రతినిధులు తీసుకునే ఉపకార వేతనాలు ఎన్ని తీసుకుంటే వాళ్ళు ఎలక్షనుకు ఖర్చు పెట్టిన సొమ్ము రికవర్ అవుతుంది? ఎవరు ఏమి అనుకున్నా ప్రజలకికూడా ఉపకారం జరుగుతూంటుంది గదా. ఎటొచ్చీ అటు పనీ గాక ఇటు డబ్బా ఖర్చయితేనే ప్రమాదం.

ఇంకొక రకం మనుషులు : ఏ మహామంత్రులకో, మహాకవులకో, మహాపురుషులకో జన్మదినోత్సవాలూ, జయంత్యుత్సవాలూ జరిపే టప్పుడు వాళ్ల సంప్రీతికోసం ప్రత్యేక సంచికలు వెలువరించడం జరుగుతూ ఉంటుంది. అందుకని ఏర్పాటు అయిన సంఘం ఆ సంచికలు వెలువరించడం సబబేగాని కొందరు నాబ్లోటి పని లేనివాళ్ళు ఏ ఆఫీసరునో ఆశ్రయించి ఒక చిన్న సిఫారసు ఉత్తరం సంపాదించి జిల్లాలలోని అధికార్ల చేత నయానో భయానో అడ్వర్టయిజుమెంట్లు సంపాదించి వేలకు వేలు సొమ్ము గుంజడం ఒక వ్యాపారం అయింది. పోనీ ఆ అచ్చు అయ్యే కాపీ లన్నా ఎన్ని ఉంటాయని? ఆ ఉత్సవంరోజున పంచిపెట్ట డానికి పదో, పాతికో—ఇంక అడ్వర్టయిజర్లకి వోచరు కాపీలు ప్రింటరు ఇవ్వకపోతే ప్రూఫులైనా పంపించవచ్చు గదా. ఎన్నో ప్రెస్‌లలో ఇలా అచ్చువేయించి అడ్వర్టయిజర్లకు వోచరు కాపీల మేరకు కాపీలు గుంజి అచ్చు ఖర్చులు ఎగవేసి కాపీలు తీసుకోకుండా ఉన్నవి ఎన్నో సందర్భాలు. అయితే ఇలాంటి మహావ్యక్తులు మంత్రులతో సహా వేదికల మీద పట్టుపరుపుల మీద అధివసించి తమ ప్రజ్ఞావిశేషాలు ప్రకటిస్తూ ఉంటారు. పాపం! తమ పేరు చెప్పి ఇలాంటి పనులు చేస్తున్నారని ఆ మంత్రులకో, ఆ అధికార్లకో ఏమి తెలుసు. అందుకే అన్నారు "Fools enter where angels fear to tread." అని.

# [illegible]

నిద్ర లేవగానే ఎప్పుడూ కామాక్షి ధుమధుమ లాడుతూనే వుంటుంది. వంటపనులు చూసుకోవటం, పిల్లల్ని స్కూళ్ళకి పంపటం, మొగుడికి కాఫీ అందివ్వటం — అన్నీ నుదుటి మీద ముడతలతోనే శుభ్రంగా స్నానం చేసి, వెడల్పాటి జరీఅంచు చీరా, ముఖాన గుండ్రని బొట్టూ, యిన్ని వున్నా, ఆ విసుగూ, కోపం, కామాక్షిలో అందాన్ని తుడిచేశాయా యన్నట్లుంటుంది. "వెధవ పని! ఎంతకీ తెమలదు," అని సణుగుతూనే వుంటుంది. అంత విసుగుకీ మరి వయ స్సేమయినా మించిపోయిందా అంటే అదీ లేదు. ముప్ఫయిఅయిదు యింకా దాటలేదు.

"అమ్మా! నాన్న యింకా రాలే!" పెద్దకూతురు లేస్తూనే వేసిన మొదటి ప్రశ్న. అసలే మరిది ఈ రోజు వస్తున్నాడని మండిపోతున్న కామాక్షి ఈ ప్రశ్నతో తారాజువ్వలా లేచింది.

"ఏం! ఆగలేకుండా వున్నావా? చిన్నాయన వేంచేసేవరకు? పళ్ళూ, బట్టలా! ఏం పట్టాగలడు కుంటివాడు?''

"అయితే అమ్మా? చిన్నాయనికి కాళ్ళు లేవా?"

"రెండూనా?''

కొడుకు లిద్దరూ ఒకరు విడిచి ఒకరు ప్రశ్నల వర్షం కురిపించారు.

ఆ పిసివాళ్ళు చిన్నాన్నని ఎరుగరు. అత్త లంటూ, మామ లంటూ చాలా మందిని చూశారుగానీ తండ్రి తాలూకు ఈ తమ్ముణ్ణి చూడలేదు. అందులో అతను కుంటివాడంటే వాళ్ళకి కుతూహలంగా వుంది. తండ్రి యీవేళ ఆఫీసుకి సెలవుపెట్టాడు. ఆ వచ్చేమనిషికి మంచం అదీ, ఒక ప్రత్యేకగదీ ఏర్పాటయింది. అమ్మేమో రోజూకంటే, మండి పడుతోంది. పాలగ్లాసులు వాళ్ళ నోటిదగ్గరే వున్నా యింకా బట్టలు అవీ తొడుక్కుని స్కూలికి వెళ్ళా లని లేదు. ఇంట్లోనే వుండి జరిగే దంతా చూడా లని వుంది.

రైలు గంట ఆలస్యం. రఘునాథం, స్నేహితుడు శ్రీహరీ ముందు టాక్సీ లోంచి దిగారు. చేరోచెయ్యి సాయం యిచ్చి రామాన్ని దింపారు. పల్చని లాల్చీ, జుబ్బా, ఒత్తయిన క్రాపూ, చామన

---

కొమ్మూరి ఉషారాణి

చాయ, ఆరడుగుల ఎత్తు; రామం అంగ విహీను డంటే నమ్మటం కష్టం. ముఖంలో వర్చస్సు వుందికానీ, ఆనంద రేఖలు లేవు. కళ్ళల్లో చురుకుదనం కనబడుతున్నా, బరువుగా చాలా జాలిగా వున్నాయి ఆ చూపులు. అతను వరండాలో కొచ్చేసరికి, పిల్లలంతా బైటికి వచ్చి చూస్తున్నారు. ఇరుగు పొరుగుకూడా, కిటికీల్లోంచీ, వరండాల్లోంచీ టాక్సీకేసి చూస్తున్నారు.

కామాక్షి కాఫీకప్పుతో గదిలోకి ప్రవేశించింది. రామం ఒక్కడూ కూర్చుని సిగరెట్ తాగుతున్నాడు. ఒదిన గార్ని చూసి గౌరవ పూర్వకంగా నమస్కరించా డతను. కాలుతున్న సిగరెట్ బల్లమీద పెట్టాడు, కామాక్షి గ్లాసు అతనిచేతి కందివ్వలేదు. బల్లమీద పెట్టి దూరంగా వెళ్ళి నిలడింది.

"ప్రయాణం కులాసాగా జరిగిందా?"

నవ్వుతూ తల వూపాడు రామం.

"భోజనానికి మామూలు వంటేనా, మరేదయినా పత్యం డాక్టరు పుచ్చుకో మన్నారా?"

ఒకటి తరువాత ఒకటి యిలాటి ప్రశ్నలు; క్రొత్తగా వున్నాయి రామంకి. అవిడకి తన్ని గురించి ఎలాటి ఊహ లున్నా, ఈ తన రాక అవిణ్ణి కలవర పెట్టిం దని మటుకు గ్రహించా డతను.

* * *

చిన్న చిన్న పనులే, రోజూ చేస్తున్నవే, కామాక్షికి ఎంతో బరువుగా వున్నాయి. యిప్పుడు విసుగు ఎక్కువయింది. పిల్లలమీద చెయికూడా చేసుకుంటూంది. భర్త పలకరిస్తే, అత నేదో తనని దెప్పిపొడుస్తున్నట్లు అనుమానంగా చూస్తుంది.

మరిది ఇంట్లో అడుగు పెట్టినప్పటి నుంచీ పని ఎక్కువైనమాట ఎలా వున్నా, మానసిక ఆందోళనతో మరింత కృంగిపోతోంది. కళ్ళ చుట్టూ నల్లని గీతలూ, తరుచు తలనొప్పి; ఆమె ఆరోగ్యం చెడుతోంది.

రఘునాధం ఏమనుకున్నాడో, ఓ రోజు రాత్రి కామాక్షి తల నిమురుతూ యిలా అన్నాడు.

"చూడు కాముడూ, వాడు రెండు రోజులుగా ఓ మాదిరిగా వుంటున్నాడు. లోపల ఏదో బెంగ పెంచుకుంటున్నాడు. నాన్నా, అమ్మా వుంటే వా డీరోజుయిలా వుండేవాడా? ఆ లోటు తీరుద్దామనే యిక్కడికి తెచ్చాను. కానీ లాభం లేకుండా పోతోంది. బి. ఎస్‌సి. దాకా చదివాడు. తెలివైనవాడు. ఆ కాలికి మరి కొన్నాళ్ళు కట్టు అలా వుంటే. బాగవుతా దని డాక్టర్లు అంటున్నారు. ఎవరిమీదా వాడు పూర్తి ఆధారపడ నక్కరలేదు; కానీ అదంతా మనం కొంచెం ఆదరంతో చూడాలి వాణ్ణి. నీకూ పనిభారం ఎక్కువైన మాట నిజమే. కానీ కొన్నాళ్ళ పాటు వాణ్ణి నీ అప్తుడుగా కాస్త కనిపెట్టి వుంచు."



"ఏవిటి అలా పారిపోతున్నావ్ ? మేం నీ దగ్గర కొస్తుంటే !"
"వీడి వాయిద్యం వినలేక ఊళ్ళోవాళ్ళంతా వెళ్ళగొడితే వీడొచ్చి నా చెట్టుకింద మొదలుబెట్టాడు. నే వినలేక, వాణ్ణి పంపలేక నేనే పారిపోతున్నాను."

---

కామాక్షి అమాంతం మంచంమీద లేచి కూర్చుంది. కళ్ళల్లో నీళ్ళు మెరుస్తున్నాయి.

"అయితే మీ రనే దేమిటి ? నేను గయ్యాళినా ? మీ తమ్ముణ్ణి మీ యింట్లో పెట్టుకు నేందుకు మధ్య నే నెవర్ని ? కొన్నాళ్ళేం, మీ యిష్టమొచ్చినన్నాళ్ళు పెట్టుకోండి. అయినా నా ఆరోగ్యం మటుకు బాగుండే ఏడిచిందా ? నా సంగతి ఆలోచించేవాళ్ళెవరూ లేరు !"

రఘునాధం పక్కకి తిరిగి ఆలోచిస్తున్నాడు.

"అన్నట్లు చెప్పటం మరిచా ! నాన్న ఉత్తరం రాశారు లలితని కాలేజీలో చేర్పించాలట. అదేమో యిక్కడికి వస్తానంటోందిట ! అయినా యిప్పు డెలా రాగలదులెండి !"

"ఏం ? ఏమయిం దిప్పుడు. రమ్మను, ప్రయత్నిద్దాము...అక్కడ సీటు దొరక లేదా ?"

రఘునాధం తల వొంచుకునే అడుగుతున్నాడు.

"మార్కులు తక్కువ వచ్చాయో ఏదో, ఆ గొడవ నాకు తెలీదు. నాన్న మీకు రాస్తారు. మీరే జవాబు రాయండి. కామాక్షి పక్కకి తిరిగిపడుకుంది అతను చాలా సేపు అలా మంచంమీద కూర్చునే వున్నాడు.

చెల్లెల్ని తీసుకువచ్చేందుకు స్వయంగా వెళ్ళింది స్టేషనుకి కామాక్షి. అత్యంత రూపవతి కాకపోయినా, చామనచాయగా సన్నగా, ఓ మాదిరిగా వుంటుంది లలిత. మెడమీదుగా ముడి, పువ్వుల పువ్వుల వాయిలుచీర, చేతిలో హ్యాండ్ బాగ్, నవ నాగరీకం అనవొచ్చు. రఘునాధంకి నమస్కరించి, పిల్లల్ని ముద్దాడుతూ, అక్కగదిలో సామాన్లు పెట్టించుకుంది లలిత. ఒచ్చినమనిషి తన తమ్ముడంటూ ఒకడు ఇంట్లో వున్నట్లు గుర్తించనన్నా లేకుండా, అక్కతో ఖబుర్లాడుతున్న లలిత వైఖరికి కించపడ్డాడు రఘునాధం. ఆరోజు రామం పనులన్నీ తనే చూడ వలసివచ్చింది. ఆదివారం కాబట్టి సరి పోయిందిగానీ, లేకపోతే ఏమయేది! ఆలోచనలో పడ్డాడతను.

సాయసంధ్యవేళ అప్పుడే స్నానం ముగించి జారుగా ముడేసుకుని వంటిం ట్లోకి ప్రవేశించింది లలిత. అక్క వొద్దని వాదిస్తున్నా, ఆమాట ఈమాట చెబుతూ సాయం చేస్తోంది.

"అమ్మా! నాన్నకి రెండు కప్పుల కాఫీ" గట్టిగా అరిచి వెళ్ళిపోయాడు కొడుకు. కాఫీ లలితే చేసింది. కప్పులు తీసుకుని, లేవబోయింది. "ఇలా తే తల్లీ! ఈ చాకిరీ నాకు తప్పదు కానీ మధ్య నీ కెందుకు! అసలే ప్రయాణం బడలిక."

లలిత ఆశ్చర్యపడినట్లు అక్కవంక చూసింది.

"ఆదివారంగా! స్నేహితులొచ్చి వుంటారు'' అన్నది సర్దుదామన్నట్లు

బైటవాళ్లెవరూ కారులే తల్లీ! ఒచ్చాడు ఒక రోగిష్ఠి, మొన్ననే. అన్నీ మంచానికందివ్వవలసిందే."

"ఎవరు?" అన్నట్లు చూసింది లలిత.

"ఆయనగారి ఒక్కగానొక్క తమ్ముడు" మాట పూర్తి చేయకుండానే వెళ్ళిపోయింది కామాక్షి.

లలిత ఆలోచిస్తూ అక్కని అనుస రించింది. రామం గదిగుమ్మం వరకూ వెళ్ళి ఓ క్షణం ఆగింది. మళ్ళీ ముందుకు అడుగేసింది. గదిలో గోడకి ఆనుకుని మంచం, చిందరవందరగా పుస్తకాలూ, పత్రికలూ పడేసి వున్నాయి దానిమీద గదిమధ్య టీపాయి, చుట్టూ కుర్చీలు రఘునాధం పత్రిక చదువుతున్నాడు రామం చేతిలో చిన్న గడియారం మరమ్మత్తు చేస్తున్నాడు. కామాక్షి కప్పులు బల్లమీద పెట్టి తిరిగివస్తూ, చెల్లెల్ని చూసి ఆగింది. రఘునాధం తమ్ముడూ కూడా గుమ్మం వైపు చూశారు. లలిత సిగ్గుపడింది కొంగు వేలికి చుట్టుకుంటూ అలాగే నిలిచి పోయింది. రోగిష్ఠి అంటే ముక్కుతూ మూలుగుతూ మంచానికి అంటుకుపోయి వుంటాడనుకుంది. అదీ పసివాడను

కుందేగాని యిలా చెట్టంత మనిషని ఎలా అనుకోగలదు? పొద్దున్ననగా వచ్చింది, యీ ఒక్కగా నొక్క తమ్ముణ్ణి చూడకుంటే బావ నొచ్చుకుంటా డని తలపోసిందిగానీ, యిలా అక్క కళ్లెర్ర చేస్తుం దనీ, బావ ఆశ్చర్యపోతా డనీ, ఆ తమ్ముడు తన వొంక కళ్లు యింతింత చేసుకు చూస్తా డనీ ఏంతెలుసు లలితకి?

"రా లలితా," రఘునాధం పిలిచాడు. "ఇతను నా తమ్ముడు రామం. బి. ఎస్‌సి. చదివాడు. మొన్ననే వచ్చాడు."

లలిత వెళ్ళి ఖాళీకుర్చీలో కూర్చుంది.

"నా మరదలు లలిత బి ఏ ప్యాసయింది. పైచదువుకి వచ్చింది"

ఇద్దరూ నమస్కరించుకున్నారు కామాక్షి అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది ఓ పదినిముషాల్లో 'అమ్మడూ' అంటూ లోపల్నుంచి కేకేసింది.

ఆ రాత్రి అక్కపక్కన పడుకు నదిగింది లలిత.

"ఇంతకీ అతనికి జబ్బు ఏమిటి?"

"కుంటివాడు. ఒక కాలు సగం కర్ర కాలు."

కామాక్షి ఆ ఒక్క వాక్యంలో తన మనసులో భారం అంత వెల్లడించింది



"అలాగా ?'' లలిత ఆశ్చర్య పోయింది. ఆ రాత్రి చాలాసేపు నిద్ర పోలేదు ఆమె.

*　　*　　*

లలిత వచ్చిన పనేమో కాలేజీలో సీటు కోరకైనా, యింట్లో అక్కకి తోడుగా పనులు చేయటం, షికార్లకి సినిమాలకి వెళ్ళడంతో సరిపోతోంది. పిల్లల్ని ఆడిస్తోంది. వాళ్ళకి పాఠాలు చెబుతోంది; మధ్య మధ్య రామాన్ని కనుక్కొంటోంది. ఇదంతా గమనిస్తున్న రఘునాధం ఓ రోజు అడిగాడు.

"ఏమ్మా లలితా! నువ్వు ధరఖాస్తు వెంటనే పెట్టకపోతే సీటు దొరకటం కష్టం.''

"నేను పెట్టను బావా."

"ఏం ?"

"ఉత్తినే. ఓ నాలుగు రోజు లుండి వెళ్ళిపోతాను"

"అదేం ? మరి మీ నాన్న...''

"ఉత్తరం రాశాను.''

"అక్కయ్యతో..."

"చెబుతా.''

"ఇంత త్వరగా మనసు మార్చుకున్నావేం ?"

లలిత బావను చూసి సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయింది.

*　　*　　*

"ఇంత కడుపులో పెట్టుకుని దాచావా? ఏం, ఆయన తరఫువాళ్ళుండొచ్చా ? నా తరఫువాళ్ళుండకూడదా ? ఏం న్యాయమిది. నే నుండగా నీకేం సంకోచం? ఏం గతిలేక వచ్చావా ?'' బ్రతిమాలింది కామాక్షి.

*　　*　　*

వంటింట్లో కూరలు తరుగుతూ ఆవేళ, అక్కచెల్లెళ్ళిద్దరూ మహజోరుగా కబు ర్లాడుతున్నారు. కామాక్షి చేతులు తిప్పుకుంటూ చెబుతోంది. లలిత వుండి వుండి నవ్వుతోంది. ఉన్నట్లుండి లలిత ప్రశ్నించింది.

"ఇంతకీ నీ మరిదికి ఈ ఉపద్రవం ఎలా జరిగింది."

"ఆ! పోనిద్దూ పాడుగోల. మోటారు సైకిలుమీద వెళుతూ పడ్డాడుట, స్నేహితుడూ ఇతనూ. అంత ఒళ్ళు తెలియకుండా ఎలా వెళ్ళారో! బహుశః తాగివుంటా రని నా అనుమానం"

కామాక్షి గొంతు తగ్గించింది ఆ విషయంగురించి యింకా వినా లనివుంది లలితకి. కానీ అడగా లనుకున్న దేదో మర్నాడు రామాన్నే అడిగి తెలుసుకుంది అతను చెప్పింది ఆశ్చర్యంతో వింది తర్వాత ఏన్నో మాట్లు తలచుకుంది స్నేహితుణ్ణి రక్షించబోయి, గాయపడ్డ ఇతను తాగాడా ? ఈ దుస్థితికి కారణం పూర్వజన్మ ఫలం, తల వ్రాత అనే సరి పెట్టుకోవాలా ? భగవంతుడు స్వయంగా ఇతనికి నేరం విధించాడా ? రామం




సిగ్గయినా లేకుండా బజార్న అట్టా గంతులేసుకుంటూ పరిగెడతావేం !''

ముఖంలోకి చూసినప్పుడల్లా ఈ సమాధానాలకోసం వెదికేది లలిత.

*　　*　　*

''బావా ! నీవల్ల ఓ సహాయం కావాలి''

ఆఫీసు కాయితాలు తిరగేస్తున్న రఘునాధం కళ్ళజోడు సరిచేసుకుంటూ మరదలువొంక చూశాడు.

"కూర్చోమ్మా— ఏమిటది ?"

"నీ సలహా కావాలి."

లలిత అటూ ఇటూ చూసి అతని దగ్గిరగా వచ్చింది.

"నాకు వుద్యోగం చేయాలనివుంది."

రఘునాధం తలమీద ఎవరో కొట్టినట్లు ఉలిక్కిపడ్డాడు.

"నువ్వా ?... ఎందుకు ?''

"నాకు యింక చదువుకోవాలనిలేదు. ఉద్యోగమేదైనా చేసుకుని స్వతంత్రంగా బ్రతకాలని వుంది.''

"నీకు మతేమైనా పోయిందా ? ఇప్పుడు నీ స్వతంత్రానికేమయింది ? మీ నాన్న ఈ మాట వింటే మండిపోతాడు. అసలు పై చదువుకే ఎంతో కష్టంమీద ఒప్పుకున్నాడు."

"ఉద్యోగం చేయటంలో తప్పేముంది

బావా? ఈ రోజుల్లో ఎంతోమంది అమ్మాయిలు ఉద్యోగాలు......''

"వాళ్ళమాట మన కెందుకు? నీకు అవసరం ఏమిటి చెప్పు? మీ కుటుంబంలో ఆడపిల్ల లిలా ఉద్యోగాలు చేసింది లేదు. నిక్షేపంలా మంచిచోట చూసుకుని స్థిరపడక నీకేం......''

రఘునాధం గొంతులో మందలింపు ధ్వనించింది. లలిత పలక్కుండా అలా నిలబడేవుండటం చూసి అతని మనసు చివుక్కుమంది.

''పోనీ ఏదో సరదాకోసం వుద్యోగం చెయ్యా లన్నా ఈ రోజుల్లో వుద్యోగాలు దొరకటం మహ కష్టంగావుంది. ట్రెయినింగూ అదీ లేకుండా వుత్త బి. ఏ. మటుకు ప్యాసయిన నీకు...''

"నువ్వేం సహాయం చెయ్యలేవా?" లలిత సూటిగా అతని ముఖంలోకి చూసింది.

"నేనా?..." అతని కీ ప్రశ్న చాలా చిత్రంగా వుంది.

ఆ సంభాషణ అంతటితో ముగిసిపోయినా, రఘునాధం ఆ విషయం భార్యకి చెప్పకుండా వుండలేకపోయాడు.

''నీ కేమయినా మతిపోయిందా ఏం? రోజు రోజుకీ మరీ యిలాటి బుద్ధులు పుడుతున్నాయేం? ఉద్యోగం చేస్తావ్? ఎవర్ని ఉద్ధరించేందుకు? నీమీద ఎంతమంది ఆధారపడివున్నారు?

అమ్మ కీ విషయం తెలిస్తే ఉరిపెట్టుకుంటుంది. పెళ్ళీ పెటాకులూ లేకుండా మిస్సమ్మలా వుండిపోతావా!''

లలితని పిలిచి నానా దులుపుడూ దులిపింది అక్క.

* * *

ఆవేళ కామాక్షి తలనొప్పిఅని పడుకోవటంవల్ల, రామంకి లలితే అన్నం వడ్డించింది.

"మిమ్మల్ని ఒక్క మాట అడగొచ్చా?"

ఏమి టన్నట్లు చూసింది లలిత.

''ఊరి కెళ్ళిపోతున్నారుటగా, అన్నయ్య చెప్పాడు."

లలిత తల వొంచుకుంది.

''ఈ నాలుగురోజులు నన్ను ఎంతో ఆదరించారు. కృతజ్ఞత ఎలాచెప్పాలో తెలీడంలేదు."

రామం మాటలకోసం తడబడ్డాడు.

అయినా చదువుకునేందుకు అవకాశం వుండీ ఇలా వెళ్ళిపోవటం బాగులేదు ఈ అవకాశాలు మళ్ళీ రావుకూడా?''

లలిత అతని మాటల్ని శ్రద్ధగా వింటూంది. రోజూ భోంచేశాక, కాసిని ఖబుర్లవీ చెప్పేమనిషి,ఆ రోజు త్వరగా గదిలోంచి వెళ్ళిపోయింది. కానీ ఆ మర్నాడు లలితకళ్ళు ఎర్రగా వున్నాయి మాటల్నీ, మనుష్యుల్నీ తప్పించుకుంటూ తిరిగింది రోజంతా.

మరో నాలుగు రోజులకి అనుకున్న ప్రకారం లలిత ప్రయాణం కట్టింది

బట్టలూ, పెట్టీ చాలా హుషారుగా సర్దింది. ఇరుగు పొరుగు దగ్గర శలవు తీసుకుంది. అక్కని కౌగలించుకుని, మళ్ళా వస్తా నంది, బావకి నమస్కరించింది.

టాక్సీ వాకిట్లో ఆగింది. కామాక్షీ, భర్తా సామాన్లు కారులో పెట్టే హడా వుడిలో వున్నారు. లలిత చెప్పులు తొడు క్కుంటూ వెనక్కి తిరిగి రామం గదివై పొకసారి చూసింది. గుమ్మం వరకూ వెళ్ళి, కాస్సేపు ఆలోచిస్తూ అలా నిలబడి, మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చేసింది. ఇవాళే కాదు, ఈ నాలుగు రోజులుగా ఆమె అలా చేస్తూనే వుంది.

లలిత వెళ్ళిపోయిన వెలితి ఆ యింటి నంతా ఆవరించింది ఆవేళ.

* * *

చెల్లెలు వెళ్లిపోయిన బెంగ యింకా పోలేదు కామాక్షికి. దాదాపు నెల కావస్తున్నా, లలిత యింట్లో తిరుగుతు న్నట్లే, పలవరిస్తున్నట్లే వుంది. అదీ కాక, ప్రస్తుతం పనిభారం, బెంగలు ఎక్కువైన తనకి, లలిత లేని లోటు కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

రఘునాధం ఆవేళ పొద్దున్నే వంటిం ట్లోకి వచ్చి, భార్యని తన గదిలోకి పిలిచాడు. చేతులు తుడుచుకుంటూ పరు గెత్తింది కామాక్షి.

"ఈ వారం నాకు బొంబాయి ప్రయాణం వుంది. వాడికి అక్కడ చిన్న ఉద్యోగం దొరికింది. అదే, రోజంతా కాదులే; కొన్ని గంటలు మాత్రం. జీతం ఎక్కువ లేకపోయినా, హాస్టలు అదీ ఏర్పాటు వుంది. నీకు తెలుసో లేదో, యిలాటి వాళ్ళకి ట్రైనింగ్ సెంటర్‌లూ అవీ వున్నాయి" కామాక్షి భర్త పక్కన కూర్చుని వింటోంది.

"ఏమో! అదృష్టం బాగుంటే మరో రెండు సంవత్సరాలకి వాడు పూర్తి మనిషి కాగలుగుతాడు. నాకు పంపాలని లేదు గానీ వాడే పట్టుదలగా వున్నాడు. వాడికీ యిలా వుండటం కష్టంగా వుంది కాబోలు. ఒప్పుకున్నాను."

కామాక్షికి తలమీంచి పెద్దభారం తీసిన ట్లయింది. గుండెలు వేగంగా కొట్టు కున్నాయి.

ఆ రోజు యింట్లో పను లన్నీ అతి తేలిగ్గా చకచక సాగిపోయాయి. కానీ ఆ మధ్యాహ్నం విశ్రాంతిగా పడుకున్న కామాక్షికి తండ్రి దగ్గర్నుంచి యిలా ఉత్తరం వచ్చింది.

చి. సౌ. కామాక్షికి,

ఆశీర్వాదాలు.

ఈ ఉత్తరం రాయటానికి ముఖ్య

కారణం, అమ్మడు భవిష్యత్తు గురించి జరిగిన నిర్ణయం. దాని పెళ్ళి విషయమై రెండు సంవత్సరాలుగా నేను చేస్తున్న ప్రయత్నం నీకు తెలిసిందే. మొన్నను అన్ని విధాలా మంచి సంబంధం ఒకటి వచ్చింది. కానీ అమ్మడు నిరాకరించింది. దాని మనసులో మరేదైనా వుందేమో మీ అమ్మని కనుక్కోమన్నాను. నీ మరిది రామలింగేశ్వరరావుని చేసుకోవాలని వుందనీ, మరొకరిని చేసుకోమనే పక్షంలో, తన వివాహ ప్రసక్తి యిక తేవద్దనీ మాకు స్పష్టం చేసింది.

ఈ విషయం గురించి, ఆదీ, అబ్బాయీ, వారివారి మనస్సుల్లో నిశ్చయించుకున్నారుట. దానికి భగవంతుడు ఎలా రాశాడో ఏమో: ఈ పరిస్థితిని గురించి యిక తర్జన భర్జనలు చేసి లాభం లేదు. నేను చెప్ప దలచుకుంది చెప్పి చూశాను. కానీ దాని మనసు యిక మార్చుకునే అవకాశం కనపడటం లేదు.

అమ్మడు ఏమంత చిన్నపిల్ల కాదు. చదువుకుంది. మంచీ చెడూ తెలుసు. తన భవిష్యత్తు తను నిర్ణయించుకో గల జ్ఞానము, వయస్సు వున్నాయి. ఈ కాలపు పిల్లల మనస్తత్వాలూ, ఆదర్శాలూ చాలా చిత్రంగా వుంటున్నాయి. వాటిని నిరోధించి మన భావాలు వాళ్ళమీద రుద్దటం అన్యాయమేమో! ఈ విషయం దాని అభీష్టానికి పూర్తి వదిలేశాను. అన్నిటి కంటే ముఖ్య విషయం. మీ అమ్మ ఈ విషయాన్ని ఎంతో సహృదయంతో, శాంతంగా తీసుకుంది. ఏ అభూయిత్యానికీ ఒడిగట్టక, అమ్మడు 'యిష్టమే' మనకి ముఖ్య మంది. ఇవాళే అల్లుడికి విడిగా ఒక ఉత్తరం రాస్తున్నాను.

వివాహం ఈ శ్రావణ మాసంలోనే చేయటం మంచిది. మంచి మహూర్తం ఇప్పట్లో మళ్ళీ లేదు. జవాబు రాయి

నాన్న"

కామాక్షి మెదడు పనిచేయటం ఆగిపోయింది. ఒక్క చెల్లెల్నే కాదు, తన తల్లి తండ్రుల్నీ అర్థం చేసుకోలేక పోయింది తను. సాయంత్రం భర్త ఆఫీసునుంచి వచ్చేవరకూ మరి లేవలేదు మంచంమీంచి.

---

సినిమాక్విజ్ జవాబులు

*1 మేలుకొలుపు  2 ద్రోహి  3 దీక్ష*

---

# నేనికోసం వేప్పలాటు?

మాలతిని మరువలేను అందమైన ఆమె ముఖం, మధురమైన ఆమె కంఠం, మెరిసే ఆకళ్లూ, నన్ను వెంటాడుతున్నాయి మైమరపించే ఆమె చిరునవ్వునీ, నవ్వుతూ ఉంటే బయల్పడే ముత్యాల పలువరుసనీ మరవడం నావల్ల కాదు సళాకులాంటి ఆమె శరీరం, ఆమె వయ్యారపు నడకా ఎప్పుడూ నా కళ్ళ ముందు మెదుల్తూ ఉంటాయి పెళ్ళయిన వాడినై ఉండి కూడా పరస్త్రీని ధ్యానిస్తూ ఉండడం ద్వారా నా భార్య అయిన శకుంతలకు అన్యాయం చేస్తున్నానేమో అనిపిస్తున్నది అయినా ఏమి చేయడం? ఎంత ప్రయత్నించినప్పటికీ మాలతి సౌందర్య చిత్రాన్ని నా మనః ఫలకం నుంచి తుడిచివేయ లేకుండా ఉన్నాను దానికి కారణం మాలతిని ప్రేమిస్తున్నాననే నా గట్టి నమ్మకం కావడమే అయి ఉంటుంది

భర్తగా నా విధులను నేను మరువలేదు ఆమెకు కావలసిన వస్తువు లన్నీ కొంటున్నాను, సినిమాలకూ, నాటకాలకూ తీసుకొని వెళ్ళుతున్నాను. ఏ మాత్రం తీరుబడి ఉన్నా ఆమె సమక్షంలో నే గడుపుతున్నాను నేను సరిగా చూడలేదని ఎవరూ అనలేరు, శకుంతలతో సహా కాని నా మట్టుకు నేను ఉన్న సంగతి చెప్పాలంటే — శకుంతల ఏమనుకున్నా సరే — నా సర్వస్వం ఆమెకు నేను ఇవ్వడం లేదు మాలతిని గురించిన మథన నన్ను చాలవరకు వేధిస్తోంది

ప్రస్తుతం నేను విశాఖపట్టణంలో ఒక కంపెనీలో సేల్సు మానేజరుగా పని చేస్తున్నాను నే నా కంపెనీలో ఒక గుమాస్తాగా చేరి వృద్ధిలోకి వచ్చాను నా సర్వీ సంతటిలోను మాలతి ఎక్కడుందో నని వెతుకుతూనే ఉన్నాను పదేళ్ళయినది ఆమెను చూసి కొద్ది రోజుల క్రితం మాలతి తన భర్తతో మదరాసులో ఉందని ఒక పాత నేస్తం చెప్పాడు చివరకు నా మాలతిని చూచే అవకాశం చిక్కింది! ఏమన్నానూ, 'నా మాలతి'

వి వి యస్ రామదాసు

అనా? అయితే పొరపాటే. వివాహితుడినై ఉండికూడా ఇంకొకరి భార్యను గురించి ఆవిధముగా అనకూడదు. ఏమయినా, పట్టినే ఒకసారి ఆమెను చూడడంలో హాని ఏమీ లేదనుకున్నాను.

మదరాసుకి మా కంపెనీ పనిమీద వెళ్ళే వీలుకోసం కాచుకు కూర్చున్నాను. వచ్చిన మొదటి అవకాశాన్ని వినియోగించుకున్నాను. పాపం, కేవలం ఉద్యోగధర్మం రీత్యానే మదరాసుకి వెళుతున్నా నని శకుంతల అనుకున్నట్లుంది. కాని ఇదిగో నేను మదరాసు మెయిలు ఎక్కుతున్నాను — ప్రధానంగా ఒక పర స్త్రీని చూడడానికి!

రైలు పెట్టెలో ఒక మూల స్థిమితంగా కూర్చున్నమీదట రాజమండ్రిలో మాలతితో నేను ప్రేమకలాపం సాగించిన కాలేజీ రోజులు నెమరు వేసుకున్నాను. నేను ఇంటరు జూనియరు చదువుతున్న రోజు లవి. అప్పుడే మాలతి మీదికి నా మనసు మళ్ళింది. ఫలానా అంశం నన్ను ఆకర్షించిన దని చెప్పి లాభంలేదు. కాని ఒకటి మాత్రం సత్యం. ఆమె అంగసౌష్టవం నా హృదయాన్ని వశపరచుకున్నది. నాకు తెలియకుండానే యీ ఆకర్షణ ప్రేమగా మారినట్లుంది. ఆమెతో స్నేహం చేశాను. పుస్తకాలను ఇచ్చి పుచ్చుకోవడాలలో ఆమె చేతి మునివ్రేళ్ళను తాకడానికి ప్రయత్నించి ధన్యుడ నయ్యాను. ఆమె కరస్పర్శవల్ల అనిర్వచనీయమైన సుఖానుభూతి పొందేవాడిని. ఆ సుఖం ఎప్పుడూ మరువలేను. ఆమె కూడా అదే విధముగా తన్మయత్వం చెందినదో లేదో చెప్పలేను. అట్లాంటి చిహ్నే లేవీ ఆమె ముఖంమీద కనపడలేదు.

బి. ఏ. పరీక్ష లయాయి. పరీక్షల చివర రోజున మాలతిని ఒక సినీమాకు తీసుకొని వెళ్ళాను. హాలులో కూర్చున్నా నన్నమాటేగాని నడుస్తున్న చిత్రం వైపు చూడనేలేదు. ఆట వుతున్నంత సేపూ మాలతి ప్రక్కనే కూర్చుని ఆమె సౌందర్య సుధను ఆస్వాదిస్తున్నాను, కండ్లతోనే. పాపం, ఆమె తదేక ధ్యానంతో తెరమీద బొమ్మలను చూస్తూ కూర్చుంది. జారిన పైటనైనా గమనించకుండా ఆటలో లీనమైపోయింది. ఇంతలో 'విశ్రాంతి' నిమిత్తం దీపాలు వెలిగాయి.

"చివరికి హీరో గతి ఏమవుతుందంటావు, శంకరం?" అంది మాలతి.

"చూస్తాంగా" అన్నాను.

"ఈ సినీమా కథంతా ఏదో నవలలో చదివినట్టు జ్ఞాపకం"

"బహుశా చదివే ఉంటావు.' అన్నాను పరధ్యానంగా.

"ఆ విలన్ నటన బొత్తిగా... ఏమోయ్ శంకరం వింటున్నావా లేదా?'

అన్నది మాలతి నా పరధ్యానాన్ని పసిగట్టి.

"లేదు — అవునవును" అని నసిగాను.

"అదేం శంకరం, ఇవ్వాళ అదోలా గున్నావు ?"

"మాలతీ, చాలానాళ్ళనుంచీ నీతో ఒక ముఖ్యమైన సంగతి చెబుదా మను కుంటున్నాను" అని కొంత సేపాగాను.

"ఊరుకున్నా వేం ? కాని య్యి శంకరం!"

"ఇక్కడ కాదు, మాలతీ. మళ్ళీ ఆట మొదలుపెడితే మన మాటలవల్ల ప్రక్క నున్నవాళ్ళకు యిబ్బంది కలుగు తుంది."

"అయితే అట్లా పార్కులోకి పోదాం పద" అంది మాలతి.

ప్రక్కనున్న పార్కులో కూర్చున్న తరువాత మాలతిమీద నాకున్న మధుర ప్రేమను తెలియ జేద్దా మనుకున్నాను. కాని నానోట మాట పెగలలేదు. మూగ వానిలా ఆమెప్రక్కన కూర్చున్నాను.

"చెప్పు శంకరం" అని ఆమే కదిల్చింది.

కృత్యాద్యవస్థలో పడ్డాను. కొంచెం దగ్గి, గొంతుక సవరించుకుని ఇలా అన్నాను; "మా అమ్మా నాన్నా నాపెళ్ళి విషయం చాలా తొందర చేస్తున్నారు, మాలతీ."

"అయితే అభ్యంతరం పెట్టకు" అన్నది మాలతి నవ్వుతూ.

"కొన్నాళ్లు అసలే పెళ్ళి వద్దన్నాను. వాళ్ళు పోరుపెడితే బి. ఎ. పాసయాక ఆలోచిద్దాం అన్నాను."



"చూడు శంకరం. నీకు పెళ్ళి అసలే యిష్టం లేకపోతే పరీక్ష పోవాలని ప్రార్థించు...'' అన్నది హాస్యధోరణిలో.

"ఇష్టం లేక కాదు."

"ఇకనేం. ఆ సంగతి మీఅమ్మగారితో చెప్పెయ్."

"నీకు హాస్యంగానే ఉంటుంది కాని అసలువిషయం విను. నేను ఏ అమ్మాయి నాన్నగారినైనా కలుసుకోమంటే కలుసుకోడానికి సిద్ధంగా ఉన్నారు మా నాన్నగారు."

"ఇకనేం ? చెప్పు."

''మీ నాన్నగారిని కలుసుకొమ్మని చెప్పనా, మాలతీ ?'' అని అతృతగా అడిగాను.

''ఇక డొంకతిరుగుడు చాలించు శంకరం. మా నాన్నగార్ని ఎందుకు కలుసుకోవాలి'' అన్నది కొంచెం తీవ్రంగా.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను కనుక. నన్ను కాదనకు, మాలతీ. నిన్ను సుఖపెట్టడమే నా జీవితలక్ష్యం. నువ్వు అవునంటే తక్కిన ఏర్పాట్లన్నీ చేయిస్తాను.''

''క్షమించు శంకరం. నేను నిన్ను ప్రేమించడంలేదు. అంటే పెండ్లికి సంబంధించిన అర్థంలో. నా అభిప్రాయం నీకు అర్థమయిం దనుకుంటాను.''

అంత తేలికగా విడిచిపెట్టేఘటాన్ని కాదు నేను. కాబట్టిఆమెను బ్రతిమాలుతూ అడిగాను, "పోనీ మాలతీ. నిన్ను నేను పెళ్ళి చేసుకున్న తరువాత ప్రేమించడానికి ప్రయత్నించుదువు గానిలే.''

''నీ దొక చాదస్తపు ధోరణి, శంకరం" అంది మాలతి తేలికగా.

''ప్రతి ప్రేమికుని ధోరణీ అంతే కదా !''

"నీ ధోరణే నీది కాని నేను వేరొకరిని ప్రేమించి ఉండవచ్చుననే ఊహే నీకు తట్టదేం ?''

"అట్లాగా?ఎవ రాఅదృష్టవంతుడు?''

"అతనిపేరుమల్లికార్జునరావు. మనం ఇంటరు జూనియరు చదువుతున్నప్పుడు అతడు ఫైనలియరులో ఉండేవాడు. మే మిద్దరం ఒకరి నొకరం ప్రేమించుకున్నాము. మా ఇద్దరి తలిదండ్రులూ మా పెండ్లికి సమ్మతించారు. అయితే ఉద్యోగం అయితేగాని చేసుకోనని ఆయనా, నా చదువు పూర్తయితేగాని చేసుకో నని నేనూ భీష్మించుకున్నాము. క్రిందటి సంవత్సరం ఆయనకు ఉద్యోగం దొరికింది. ఇప్పుడు నా చదువు పూర్తయింది. ఇక ఆటంకా లన్నీ తీరాయి కనుక యీ వేసంగిలో నా పెళ్ళి జరుగుతుంది అనుకుంటా. నిన్ను పిలవకుండా పెళ్ళి చేసుకోనులే."

ఇంక మాట్లాడ్డానికి ఏమీ లేక సినీమా హాలులోకి పోయి మా సీట్లలో కూర్చున్నాం. ఆటయిన తరువాత ఆమె యింటివరకూ దిగబెట్టాను.

''గుడ్ నైట్ శంకరం"అందిమాలతి.

"గుడ్ బై, మాలతీ" అన్నాను దిగులుగా.

ఇంక మాలతిని చూడకూడదని నిశ్చయించుకున్నాను. చూచినకొద్దీ ప్రేమ గాఢమైపోతుందేమో నని సాభయం. ఆమెను మరచిపోదామని విశ్వ ప్రయత్నం చేశాను. కాని మరువలేక పోయాను. అనేక ఊళ్ళల్లో ఉన్న బంధువులను చూడాలనే మిషమీద కొన్నాళ్ళు తిరిగాను.

ప్రయాణం చేస్తూ ఉంటే మాలతిపై నాకున్న గాఢవాంఛ సమసిపోతుందని భ్రమించాను. కాని ఆమె చక్కని ముఖం, కోమలమైన సౌందర్యం నా స్మృతిపధాన ముద్రితమైన విషయం మరచాను. రాజమండ్రికి తిరిగి వచ్చాక మాలతి ఇంటికి పరుగెత్తాను. గేటుకి వేసిన తాళంకప్ప నన్ను వెక్కిరించింది. నిరాశతో మొగం వేలవేశాను. పొరుగు వారి నడిగితే మాలతి తండ్రిగారికి బదిలీ అయినట్లు భోగట్టా తెలిసింది.

ఒక వారం రోజులు గడచాయి.

మాలతీ మల్లికార్జునరావుల వివాహం తెనాలిలో జరుగుతుందనీ నన్ను రమ్మనీ ఆహ్వానం వచ్చింది. ఆ పెళ్ళికి నేను వెళ్ళలేదు.

ఈలోగా నా బి. ఏ. పరీక్షా ఫలితాలు వచ్చాయి. నేను ప్రథమ శ్రేణిలో పాసయ్యాను. నెల రోజుల తరువాత శకుంతలతో నా పెండ్లి నిశ్చయమయింది.

"నువ్వు చాలా అదృష్టవంతుడవోయ్, శంకరం" అన్నాడు భూపతి వాడు ఇంటరులో నా సహపాఠి కాని తరచు పరీక్ష తప్పినందువల్ల ఇంకా కళాశాలలోనే చదువుతున్నాడు వాడు చాలా హుషారైన మనిషి. అందరికీ వాడంటే యిష్టం. వాడు ఒక్కొక్కప్పుడు ప్రమాదంలేని బాతాఖానీ వేస్తూఉంటాడు గౌతమీ గ్రంథాలయంలో వాడు తారసిల్లాడు.

"నువ్వు చాలా అదృష్టవంతుడవోయ్" అన్నాడు భూపతి పునరుక్తి దోషాన్ని పాటించకుండా.

"కొంచెం విడమరచి చెప్పవయ్యా" అన్నాను.

"శకుంతలను పెళ్ళాడడం అదృష్టమే. ఆమె ఆణిముత్యం లాంటిది నీకు జ్ఞాపకం ఉందా, మనం స్కూలు ఫైనలు చదువుతూన్నప్పుడు ఆమె మన సహాధ్యాయిని. తరువాత చదువు మానేసింది. ఆమె మా వీధిలోనే ఉండేది ఆమే, మా చెల్లెలూ స్నేహితురాళ్ళు ఆమె గురించి మా చెల్లి ఏం చెప్పిందంటే — నేను చెప్ప నబ్బాయ్."

సస్పెన్సుకోసం అతడు వేసే వేషాలకు నాకు వళ్ళు మండింది.

"చెప్పకపోతే దాచుకో" అన్నాను చిరాకుగా.

"బలేవాడివయ్యా నువ్వు! కాబోయే భార్య గురించి కబుర్లు వినడానికి ఎవరికి ఆతృత ఉండదు? చెప్పినందుకు నాకు బహుమతి ఇవ్వాలి.''

"అబ్బ. చంపక అసలు సంగతి చెబుదూ."

"అసలు సంగతి ఏమంటే నిన్ను శకుంతల ప్రేమిస్తున్నది. నిన్ను స్కూల్ ఫైనలు క్లాసులో చూసింది మొదలు నిన్ను ప్రేమించింది. ఆమె చదువు కొనసాగించాలనే ప్రయత్నించింది; కాని ఆమె వరుసగా స్కూలు ఫైనలు తప్పడం వల్ల యింక చదువు చాలించుకోవలసి వచ్చింది. ఆమె పరీక్షలు తప్పడానికి కారణం తెలుసునా? నువ్వే.

''నేనా? ఏమిటి నీ ఉద్దేశ్యం?"

''అవును, నువ్వే. నిరంతరం నీ గురించే తలపోస్తూ ఉండడంవల్ల చదువు మీద దృష్టి కుదరలేదు. వచ్చిన సంబంధాలను వద్దంటూ నిన్నే పెండ్లాడతా నని పట్టుపట్టుక్కూర్చుంది. మీ నాన్నగారితో ఆమె నాన్నగారు మాట్లాడి, నీ చదువు పూర్తయేవరకు ఆగి...''

"ఆపవయ్యా భూపతీ. ఇదేదో సరుకుల వ్యాపారంలా మాట్లాడతావేం? నేను ఒప్పుకోవలసిన అవసరం లేనట్టు చెప్పుకుపోతావేం?"

''నీ ఒప్పుదలా? నువ్వు ఎట్లానూ అంగీకరిస్తావు.''

''నీ కెట్లా తెలుసు?''

"శకుంతల లాంటి పుత్తడిబొమ్మను ఒల్లనివాడు వట్టి మూర్ఖుడై ఉండాలి. మరి నువ్వు మూర్ఖుడవు కావుకదా."

భూపతి చెప్పింది నిజం. నేను చూచిన సౌందర్యవతులలో శకుంతల ఒకర్తె. మాలతిని నేను ప్రేమించి ఉండకపోతే భూపతి చెప్పిన దానితో పూర్తిగా ఏకీభవించి ఉందును. ఆమె మాలతికంటే కూడా ఎక్కువ అందగత్తె కావచ్చు. అయినా శ్రీనాధుడన్నట్లు 'దప్పి కొన్నట్టివాని కా దప్పి దీర్ప, సలిలపూరంబుహితవా, యాజ్యంబుహితవా?' నా దాహానికి కావలసిన నీరు లభించ లేదు. మామూలు దాహతీవ్రత వల్ల ప్రాణం పోయి సమస్యా పరిష్కారం కావచ్చు. కాని యీ నాతృష్ణ నన్ను కల్లోల పరుస్తోంది.

ఏమయినా ఒక అమ్మాయి నన్ను ప్రేమించి పెళ్ళి చేసుకుంటానం దని విన్నప్పుడు నాకు గర్వకారణమే అయింది.

శకుంతలకు సంపూర్ణసౌఖ్యం యివ్వాలనే ప్రయత్నించాను. కాని మాలతిపై నా కున్నపిచ్చి తరచు నన్ను వేధిస్తోంది. ఎవరికీ తెలియకుండా నాలో నేనే కుమిలిపోయే పిచ్చి అది!

ఎంతో ఆశతో సెంట్రలు స్టేషను చేరాను. మొట్టమొదట హెడ్డాఫీసులో కంపెనీపని పూర్తిచేసుకుని ఆ తరువాత మాలతి ఆచూకీ కనిపెట్టడానికి మదరా సంతా గాలించా లని నిశ్చయించాను.




"ఏవిటి వాళ్ళిద్దరికీ ఉద్యోగం ఒక ఆఫీసులోనేనా ?
"అదే అనుకోవాలి. భార్యను పొద్దున ఆఫీసుకి పంపించి సాయింత్రం తీసుకొస్తాడు "

అప్పుడు నాకు తట్టింది నేను చేయబోయే పని ఎంత తెలివి మాలినదో. వీధి పేరు గాని ఇంటి నంబరుగాని తెలియకుండా మదరాసువంటి మహానగరంలో వెతక పూనడం గడ్డిమేటిలో సూదిని వెతికి నట్లుంటుంది. కాని మాలతి మదరాసులో ఉందని రూఢిగా తెలుసును కనుక ఆమెను వెతకడంకోసం ఎంతకష్టపడినా కష్టపడాల్సిందే. నష్టం లేదనుకున్నాను.

హెడ్డాఫీసుకి వెళ్ళాను. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. అక్కడ భూపతిని చూచి. వాడుకూడా నన్ను గుర్తించాడు.

"ఆరే ! నువ్వటయ్యా, శంకరం'' అన్నాడు.

''ఇక్కడికెల్లా వచ్చావయ్యా, భూపతీ ?''

"ఉన్నమాట చెప్పాలంటే దానికి కారణం బంధుప్రీతి అనాలి. మా నాన్నగారు ఈ కంపెనీ డైరెక్టర్లలో ఒకరికి మా చెల్లెలినిచ్చి పెండ్లిచేశారు. తరువాత మా బావగారు నా నిరుద్యోగ సమస్యను పరిష్కరించారు. ఇదే కంపెనీలో నువ్వూ కూడా పని చేస్తున్నావని కలలోకూడా అనుకోలేదు. లేకపోతే రెండేళ్ళ క్రితమే నిన్ను పట్టుకునేవాడిని.''

"అదీకాక హెడ్డాఫీసుకి వచ్చే అలవాటు నాకులేదు. ఎవర్నో ఒకరిని పంపేవాడిని" అన్నాను.

"బాగా కలిశాం శంకరం నాకు కొంచెం పనుంది నీ పనికూడా ముగించుకో తాపీగా తరువాత మాట్లాడుకుందాం

జనరలు మేనేజరుతో నా కున్నపని పూర్తిచేసుకున్నాను ఆయన దగ్గరున్న పర్సనల్ శక్రటరీని ఎక్కడో చూచినట్లు అనిపించింది కాని సరిగా గుర్తుకు రాలేదు

ఆ సాయంత్రం భూపతి నన్ను మెరీనా బీచికి తీసుకొని వెళ్ళాడు చాలా విషయాలు మాట్లాడుకున్నాము వా డుంటే కబుర్లకు లోటుండదు యధాలాపంగా 'పెళ్ళయిందా' అని భూపతిని అడిగాను

"ఇంకా నేను నిశ్చయించుకోలేదు. ఏం చెయ్యాలో తోచక తికమక పడుతున్నాను పెళ్ళయిన కొంతమందిని చూస్తూంటే పెళ్ళి చేసుకోవడం తెలివిగల పనేనా అని సందేహం కలుగుతూంది ' అన్నాడు భూపతి

"వివాహం అనే వ్యాపారానికి జమా ఖర్చులు బేరీజు వేసుకుంటే చివరకు లాభసాటి వ్యవహారమే నని తేలవచ్చు" అన్నాను కాని నా కున్న సందేహాలు నా కున్నాయి

"కాని నేను చెప్పబోయే దంతా విను జనరలు మేనేజరు దగ్గ రున్న పర్సనల్ శక్రటరీని తెలుసుగా నీకు '

"వ్యక్తిగతంగా నాకు తెలీదు కాని తెలిసిన మొగంలా గుంది ఎక్కడ చూచానో గుర్తుకు రావడంలేదు "

"అతనెవరో కాదు-మల్లికార్జునరావు. మన కాలేజీలో మనకంటె సీనియర్ గా ఉండేవాడు."

"ఓహో అతనా, మన సహాధ్యాయిని మాలతిని పెళ్ళి చేసుకున్నాడు ఆ మల్లికార్జునరావేనా యితను ?' అని ఆశతో అడిగాను

' అవునవును ఆ మల్లికార్జునరావే "

వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది ఆడబోయిన తీర్థం ఎదురయినట్లు అయింది చివరకు మాలతి ఆచూకీ తెలిసింది '

భూపతి చెప్పుకుపోతున్నాడు "ఈ మల్లికార్జునరావున్నాడే చాలపనినేర్పున్నవాడు కాని వా డింటికి వెళ్ళగానే పిల్లి పిల్లలా భార్యకు భయపడతా డని నువ్వు ఊహించనయినా ఊహించగలవా?"

"ఒక్క క్షణంకూడా అలా ఊహించలేను ఎందుకంటే మాలతిలాంటి చదువుకున్న స్త్రీవిషయంలో అది అసంభవం

' నువ్వలాగే అనుకుంటూ కూర్చో మనలో చాలామందితో వచ్చిన చిక్కేమిటంటే మన ఆదర్శాల రంగుటద్దాల కళ్ళజోళ్ళను తీసేసి నిజాన్ని చూడలేము కాని నేను చెప్పే నిజం విను "

' కానియ్యి కానియ్యి

' మా బావగారింట్లో వీధిపై పుగదిలో

నా మకాం. ఆయనకీ నగరంలో చాలా పను లున్నాయి. వాటిమీద తిరుగుతూ ఉంటారు. నాకు తీరికగా ఉన్నప్పుడల్లా మా చెల్లెలుతో బాతాఖానీ వేస్తూ ఉంటాను. ఇరుగు పొరుగు కుటుంబాలవారి లోగుట్లు కనిపెట్టడంలో ఆమె నాకు చెల్లెలే. ఒక్కొక్కప్పుడు ఆమెపసికట్టే భోగట్టా షెర్లాకు హోమ్సుని కూడా చకితుణ్ణి చేస్తుంది."

"బాబూ, ఆ ఉపోద్ఘాతం కట్టిపెట్టి అసలు సంగతి చెబుదూ నీకు పుణ్యం ఉంటుంది.''

"వస్తున్నా. మల్లికార్జునరావు మా ప్రక్కసందులోనే కాపుర ముంటున్నాడు. మా చెల్లెలు అప్పుడప్పుడు పొరుగిండ్లకు పోతూంటుంది. ఆమె చెప్పిన దానినిబట్టి ముగ్గురు పిల్లలు పుట్టినతరువాత విసుగు, కోపం కలిసిన స్వభావం వచ్చేసింది మాలతిలో. భర్త నెప్పుడూ సాధించుకు తింటుంది. చాల రభస పెడుతుంది. ఈ పెళ్ళి అనేది ఎంతటి సౌందర్య వతుల నైనా ఎట్లా నాశనం చేస్తుందో తలంచు కుంటే నాకు దిగ్భ్రమ కలుగుతోంది. మన కాలేజీ రోజులలో మాలతిని మన మందరం ఎరుగుదుము. ఇప్పు డామెను చూస్తూ ఉంటే బలిసి లావెక్కిన ఆ స్త్రీలో, ఎప్పుడు దెబ్బలాడుతుందో నని భయపెట్టే ఆమె ముఖంలో పాతమాలతి మచ్చుకైనా కనబడదు. ఆమె ఆకర్షణ అంతా—"

"ఆపవయ్యా బాబూ, ఆపు" అని ఎలుగెత్తి కేక వేశాను.

నేను కట్టిన గాలిమేడలు కూలి నందుకు విస్తుపోయాను. మాలతి భౌతిక సౌందర్యం మీద పిచ్చి ఆకర్షణలో పడి కాలచక్రం దానిని రూపుమాపడం కూడా సంభవమేనన్న సంగతి మరచిపోయాను.

"ఏమయింది నీకు, శంకరం? మారిన మాలతిని నేను స్వయముగా చూచాను. ఆమె వికృత రూపాన్ని కళ్ళారా చూచాను. ఆమె క్రూరస్వభావం గురించి వీథంతా చెప్పుకుంటారు."

భూపతి నిజం చెబుతున్నాడని పించింది. వాడా విధముగా వర్ణించిన తరువాత మాలతిని చూడడానికి ధైర్యం చాలడం లేదు. స్మృతి పథంలో ఉన్న ఒక్క సౌందర్యమూర్తి కూడా దానితో తుత్తునియలై పోతుందని నా భయం.

అయితే, ఇన్నాళ్ళూ నేను దేనికోసం దేవులాడుతున్నాను?






"ఏవిటీ, ఈ మధ్య కాఫీ బాగా తగ్గించివేసినట్టున్నావ్ ?"
"కాఫీ తాగా లని మనసు పీకుతోనే ఉంది, కాని ఇంటి దగ్గర మా ఆవిడ లెఖ్ఖలు వ్రాస్తూంది "




"చూడు బాబూ! రిక్షా కావాల్నా ?"
"రిక్షా! నా కెందుకూ ? నా కేవన్నా తొక్కటం వచ్చునా ఏవన్నానా !"




రావుబహద్దరు వంశలోచన ముఖర్జీ — జమీందార్ అండ్ ఆనరరీ మేజస్ట్రేటు ఆఫ్ బలియఘాటా బెంచ్ — ప్రతిరోజూ సాయంత్రం కాలువగట్టుకు షికారు వెళ్తూవుంటాడు. నలభై దాటినాక వీరిదేహం కొంచెం స్థూలం అయింది. డాక్టర్ల సలహా ననుసరించి రోజూ కొంతదూరం నడిచి ఎక్సరసైజ్ చేస్తూ, పప్పూ అన్నం వొదిలి, పూరీ కూరా తిన మొదలుపెట్టాడు.

కొంచెంసేపు పచారు చేసేవరకు వంశలోచనబాబు అలసిపోయి కాలవగట్టున వున్న బండమీద జేబురుమాలు పరిచి కూర్చున్నాడు. గడియారం చూస్తే ఆరున్నర అయింది. జేష్ఠమాసం వెళ్ళిపోవచ్చింది. సిలోన్‌కు అప్పుడే మాన్‌సూన్ వచ్చేసింది. ఇక్కడకూడా ఏదో ఒకరోజున హఠాత్తుగా వొచ్చిపడిందంటే ఆశ్చర్యంలేదు. వంశలోచనుడు లేవటానికి ఉపక్రమించి చేతిలో వున్న బర్మాచుట్ట బాగా పీల్చాడు. ఇంతలో వెనుకవైపున ఎవరో అతని చొక్కా పట్టుకు లాగుతూ సన్నని గొంతుతో, "ఉఁ, హుఁ, హుఁ," అన్నట్టు వినిపించింది.

తిరిగిచూశాడు — మేకపోతు !

మేకపోతు బాగా బలిసివుంది. మృదువుగా నల్లగా వున్న దేహం, పుట్టగొడుగుల

---

ప ర శు రా మ్

వలె పొడుచుకొచ్చిన రెండు కొమ్ములు, పొడుగ్గా వేలాడుతున్న చెవులు, మేకపోతు లేతదిగానే వుంది. ఇంకా అజాత శ్మశృవు.

"అరె! ఇది ఎక్కడనుంచి వొచ్చిందీ! ఎవరిదీ? ఎవరూ కనబడటం లేదే?" అని వంశలోచనబాబు గొణుక్కున్నాడు.

మేకపోతు జవా బివ్వలేదు. ముందుకువచ్చి ఆశగొన్న కళ్ళతోచూస్తూ వీరిచుట్టూ తిరగసాగింది. వంశలోచనబాబు దాని ముఖాన చెయ్యివేసి, వెనుకకు నెట్టుతూ, "పోబే! పో — ఇక్కణ్ణుంచి" అన్నాడు.

మేకపోతు వెనుక రెండు కాళ్ళమీదా నిలబడి, ముందు రెండుకాళ్ళూ వొంచి, తల పక్కపెట్టి, రావు బహద్దర్‌ను టాకింది. రావుబహద్దర్‌కు కుతూహలం కలిగి మళ్ళీ వెనక్కునెట్టాడు. మేకపోతు తిరిగి వెనకకాళ్ళమీద నిలబడి రావుబహద్దర్ చేతులోని చుట్ట లాక్కొని, భోంచేసి "హి...,హి...హీఁ" అంది. అంటే ఇంకా 'ఏవన్నా ఉన్నయ్యా?' అని. సిగార్ కేస్‌లో ఇంకో చుట్టమాత్రం వుంది. రావుబహద్దర్ దాన్ని తీసి ఇచ్చాడు. మేకపోతుకు తలా తిరగలేదు; వాంతీ కాలేదు ఇంకా దీనికి సంబంధమైన లక్షణాలు ఏవీ కనిపించలేదు. రెండోచుట్టకూడా పూర్తి చేసి "హిఁ . హీఁ...హీఁ..." అంది.

"ఇక లేవు...ను వ్విక పో...నేను పోతున్నాను" అన్నాడు వంశలోచనబాబు.

మేకపోతు నమ్మలేదు. జేబులు వెతక నారభించింది. వంశలోచనబాబు విధిలేక సిగార్ కేసు తీసి మేకపోతుకు చూపుతూ, "అంతగా నమ్మకం లేకపోతే, ఇదుగో చూసుకోవే!" అన్నాడు.

మేకపోతు ఒక్క వడుపున సిగార్ కేసు గుంజుకొని నమలసాగింది. రావు బహద్దర్‌కు నవ్వాలో కోప్పడాలో తోచలేదు. "సాలా?" అనేశాడు చప్పున.

పొద్దుకూకవొచ్చింది. ఇక ఆలస్యం చెయ్యటం మంచిదికాదు. వంశలోచనబాబు ఇంటిముఖం పట్టాడు. కాని మేకపోతుమాత్రం ఈయన్ను వదలలేదు. వంశలోచన బాబు ఆదుర్దాపడసాగాడు.

మేకపోతు ఎవరి దైందీకూడా తెలియదు. అడుగుదామన్నా దగ్గర్లో ఎవ్వరూ లేరు, పోతును చూద్దామా జిడ్డులాగా అంటుకుంది. మభ్యపెట్టాలన్నా వీలు కావటం లేదు. ఇంటికి తీసుకువెళ్ళటం తప్ప వీరికి గత్యంతరం కనిపించటం లేదు. తోవలో మేకపోతువాళ్ళు కనిపిస్తే మరీ మంచిది. లేకపోతే రేపు ఉదయం ఏదో వొక ఏర్పాటు చెయ్యవచ్చు నని అనుకున్నాడు.

ఇంటికి వచ్చే తోవలో వంశలోచనబాబు అనేకవిధాల జాడలు తీశాడు. క్రియ మాత్రం శూన్యం. మేకపోతు ఎవరిదైందీ మాత్రం ఆచోకి చిక్కలేదు. చివరకు విధిలేక తానే పెంచటానికి నిశ్చయించుకున్నాడు

అకస్మాత్తుగా వంశలోచనుడి మనస్సులో ఒక సందేహం శూలంవలె వొచ్చి గుచ్చుకుంది. తనకూ, తనభార్యకూ ఇప్పుడు ఏమాత్రం పొత్తు కుదరటంలేదు. నేటికి ఆరురోజుల్నుంచీ మాటలుకూడా లేవు. వీరి దాంపత్య కలహాలు చాలాభాగం తేలికగానే తీరిపోతూ వుంటయ్. మామూలు ఒక ఎత్తిపొడుపు, రెండుమూడు నాతి తీక్ష్ణ వాక్యబాణాలూ, తదుపరి అహింసాత్మక సత్యాగ్రహం, మాటలు బిగింపు! చివర కొకరోజు హఠాత్తుగా సంధి! తిరిగి కలయిక! ఇలా తరుచుగా జరుగు తూనేఉంటుంది. కాని, అలా గని అంత నిర్లక్ష్యంగా వదిలేందుకూ్కా వీల్లేదు. భార్యకు జంతుజాలం అంటే బొత్తిగా సరిపడదు. వంశలోచనబాబుకు ఒకసారి కుక్కల్ని పెంచాలని సరదా కలిగింది. కాని అతని భార్య గట్టిగా ఎదిరించడంవల్ల సరదా సరదాగానే వుండిపోయింది. ఇప్పు డొకపోట్లాట జరుగుతూండగా, ఇంకో మేకనుకూడా తీసుకపోతే – ఏడవాలనుకునే ఆమెకు కన్నతండ్రి కనిపించినట్టు! రావుబహద్దర్ నడుస్తూనే భార్యతో కాల్పనిక వాగ్యుద్ధం చేయసాగాడు.

ఈ మేకపోతును నేను పెంచే తీరుతాను. అడ్డుచెప్పటానికి ఎవరి కధికారం వుంది? స్వతంత్రంగా ఒక సరదా తీర్చుకోవటానికి తనకు హక్కు లేదా? తాను పరువు మర్యాదలూ, గౌరవ ప్రతిష్ఠలూ గల వ్యక్తి. బేల్‌ఘాటారోడ్డులో తన కొక పెద్దమేడ వుంది. బోలెడు భూమి వుంది. తా నొక బిరుదుగల ఆనరరీ మేజస్ట్రేటు! యాభై రూపాయల వరకూ జరిమానా, మాసంరోజులవరకూ శిక్ష వెయ్యగలడు– ఐతే యీ దిగు లెందుకూ? సిగ్గెందుకూ? నర్వస్‌నెస్ దేనికీ? వంశలోచనబాబు తన మనస్సును మాటిమాటికీ ప్రబోధించుకోసాగాడు. తా నిక ఎవర్నీ లక్ష్య పెట్టడు!

*   *   *

వంశలోచనబాబు డ్రాయింగ్ రూంలో ప్రతిరోజూ ఇష్టాగోష్ఠి సాగుతూ వుంటుంది. అందులో చాలామంది రాజాలూ, మహారాజాలూ నిత్యం వధింపబడుతూ ఉంటారు: గవర్నరూ, సురేన్ బెనర్జీ, మోహన్‌బాగాన్ ఫుట్‌బాల్ టీమ్, పర మార్థతత్వం, పొరుగింటి మసలిఠాకూర్ శ్రాద్ధం, ఆలీపూర్ మ్యూజియంకు కొత్తగా వొచ్చిన మొసలి – ఒకటేమిటి – ఏ ప్రసంగమూ వొదిలి పెట్టరు. ప్రస్తుతం వారంరోజులనించీ పులినిగూర్చి చర్చిస్తున్నారు. ఈ సందర్భంలోనే నిన్న వంశ

లోచనుని బావమరిది నగేన్‌కూ మేనల్లుడు ఉదయునికీ చేతులు కలవటం వరకూ వచ్చింది. కాని ఇతర సభ్యులు చాలాకష్టంమీద వాళ్ళు కలబడకుండా ఆపగలిగారు.

వంశలోచనుని డ్రాయింగ్ రూం చాలా పెద్దది. బాగా అలంకరింప బడింది కూడా - అంటే, ఎన్నో పటాలూ, అద్దాలూ, అలమరలూ, కుర్చీలూ, ఇత్యాదులతో భర్తీ! మొదట ప్రవేశించగానే మనదృష్టి కార్పెట్ మీది పిల్లిపైన పడుతుంది. నల్ల బ్యాక్ గ్రౌండ్ మీద మబ్బురంగు పిల్లి. యుద్ధంమూలాన బజారులో తెల్ల వూలు దొరక లేదు. కాబట్టే పిల్లికి యీ దుర్దశ పట్టింది. సర్వసాధారణులకు తెలియు నిమిత్తమై బొమ్మకింద పెద్ద పెద్ద ఇంగ్లీషు అక్షరాలలో C A T అని రాసివుంది. దానిక్రింద రచయిత్రి పేరు - "మానినీదేవి" - యీమె ఇల్లాలు.

ఎదురుగా వున్న గోడమీద రాధాకృష్ణుల తైలచిత్రం వొకటి వుంది. కృష్ణుడు రాధాసమేతంగా కదంబవృక్షం క్రింద నిలబడివున్నాడు. గొప్ప సర్ప మొకటి వారిని నలిపి వెయ్యటానికి ప్రయత్నిస్తూవుంది. కాని రాధాకృష్ణులకు మాత్రం వీసంకూడా భయంలేదు. కారణం సర్పం నిజమైంది కాదు. ఓంకారం మాత్రమే! ఇంతేకాక శ్వేతస్త్రీల చిత్రాలుకూడా వున్నాయి. వాటి ఒంటిమీద సిల్కుచీరెలూ, వాటి తలమీద నల్ల పట్టుదారంతో చెయ్యబడ్డ వెంట్రుకలూ మైదాతో అంటించి వున్నాయి. ఇన్ని చేసినా అవి తమ ముఖాలింకా తెల్లముఖాలని కేకలువేసి చెప్పు తున్నాయి. వాటి తిక్క అణచటానికై బలవంతంగా వాటి ముక్కులకు బులాకులు కుట్టివేశారు! గోడలో వున్న రెండు అల్మారాలలో పింగాణీ బొమ్మలూ, గాజు సామానులూ కుక్కి కుక్కి వున్నాయి. పైన పడకగదిలోవున్న నాలుగు అల్మారాలలో వీటికి చోటు దొరకనందున యివి క్రిందకు వొచ్చి ఆశ్రయించాల్సివొచ్చింది. ఇంతే గాక యింకా నానావిధాలైన వస్తువులూ వున్నాయి - రాజారాణీ పటం, రావు బహద్దర్‌కు తెలిసిన, తెలియని, చిన్నా పెద్దా దొరల ఫొటోలు, గిల్టు ఫ్రేములో వున్న అద్దము, గడియారమూ - రావుబహద్దర్ పట్టా - చాలా సన్మానపత్రాలూ - ఇత్యాదులు చాలా, చాలా -

ఇవాళకూడా సకాలానికే సభ కూడింది. వంశలోచనబాబు షికారుకు వెళ్ళి యింకా తిరిగిరాలేదు. వీరి అంతరంగిక మిత్రుడు వినోదబాబు చంకక్రిందకు దిళ్ళు లాక్కొని, మోచేతి ఆధారంతో తివాసీమీద పడుకొని న్యూస్‌పేపరు చదువుకుంటున్నాడు. వృద్ధ కేదారచటర్జీ చేత్తో హుక్కా పట్టుకొని కునికిపాట్లు పడుతున్నాడు. నగేన్ ఉదయులు అతికష్టంతో కోపం ఆపుకొని మోకాళ్ళమీద కూర్చొని ఉన్నారు - ఎప్పుడు వీలు చిక్కుతుందా కలియబడేందు కన్నట్టు!

ఎక్కువసేపు ఊరుకోలేక ఉదయు డన్నాడు. "నీ వేమైనాచెప్పు....పులి కొలత తోకతోసహా ఎప్పుడూ ఉండదు. అలాగైతే స్త్రీలకొలత జుట్టుతోసహా ఎందుకు వుండకూడదూ ? మా ఆడంగులజుట్టు మూడు అడుగులకు తక్కువ ఉండదు. అప్పుడు నువ్వు చెప్పేలెక్కన — మావాళ్ళ కొలత ఎనిమిది అడుగులా ?''.

''చూడు ఉదయ్ ! నీ భార్యవర్ణన నేను వినకూర్చోలా ! పులి సంగతి ఏమైనా చెప్పేది ఉంటే చెప్పు'' — అన్నాడు నగేన్.

చటర్జీ మహాశయునకు మత్తువొదిలింది ''హుం. మీ కిక పులి తప్పితే రెండో జంతు వేదీ దొరకలే ?'' అన్నాడు.

ఇంతలో వంశలోచనుడు మేకపోతును తీసుకొనివచ్చాడు.

''వవ్వా ! భలే మేకపోతు ! ఎంతకు కొన్నావోయ్ ?'' అన్నాడు వినోదబాబు.



*"దివ్యంగా వుంది........"*

వంశలోచనుడు సంగతంతా చెప్పాడు.

''బేవార్సు సొత్తు ఎక్కువరోజులు వుంచటం మంచిదికాదు. త్వరగాకానీ — రేపే ఆదివారం, సఫాచేసివేదాము'' అన్నాడు వినోదుడు.

''దివ్యంగా వుంది. కొవ్వుకూడా తన్నుకొస్తోంది.'' అన్నాడు చటర్జీ మహాశయుడు మేకపోతు పొట్ట వొత్తుతూ.

నగేనుడు మేకపోతు తొడ పట్టుకొని — "ఊహుం. ఒక దేకిసా కూరకంటే ఎక్కువకాదు. ఉల్లిపాయలూ, పసుపూ కాస్త ఎక్కువగా పడవలసివుంటుంది" అన్నాడు.

ఉదయు డన్నాడు– "అబ్బ ! మావాళ్ళు కూరచేస్తారూ – చెప్పటానికి......."

నగేసుడు గుడ్లు ఉరుముతూ – "ఉదయ్ ? మళ్ళీ –" అన్నాడు.

వంశ : "మీ కిక జంతువులను చూసినప్పటినుంచీ తినా లనేనా? ఒక అసహాయ ప్రాణి మనల్ని ఆశ్రయిస్తే కూర చేద్దామా కబాబు చేద్దామా అని మీరు కొట్టుకు చస్తున్నారు."

మేక సంగతి విని వంశలోచనుని సప్తవర్షీయకన్య టెంపీ, సర్వకనిష్ఠ పుత్రుడు ఘంటూ పరుగెత్తుకొచ్చారు.

"నాన్నా, నే మేకను తింతా, మేక మ–మ–మాం" ఘంటూ అన్నాడు.

"ఛో...ఛో...వినీ వినీ తింటం నేర్చుకున్నావు" అన్నాడు వంశలోచనుడు.

"నాన్నా, నేను మేకను పెంచుతా. నా కొక ఎఱ్రతా డివ్వు" అని టెంపీ అడిగింది.

వంశ : "సరే ముందు దీనికి మేతా గీతా చూడండి. తర్వాత దీనితో మీ ఇష్టం వొచ్చినట్టు ఆడుకోవచ్చు."

టెంపీ : "మేక పేలేంటి నాన్నా ?"

"పేరుకేం భాగ్యం – చాలా పేర్లున్నాయి. భాసురక, దధిముఖ, మసీపుచ్ఛ, లంబకర్ణ" వినోదుడు చెప్పుతున్నాడు.

"లంబకర్ణ బాగుంది" అన్నాడు, చటర్జీ.

వంశలోచనుడు కుమార్తెను చాటుకు తీసుకుపోయి "టెంపీ ! మీ అమ్మ ఏం చేస్తోందీ ?" అని అడిగాడు.

టెంపీ : "ఇప్పుడే స్నానాలగదిలోకి పోయింది."

వంశ : "సరిగ్గా చూశా ? అలాగైతే ఒక ఘంటవరకూ ఫరవాలేదు ? చూడు – త్వరగా పోయి గుఱ్ఱపుదాణాలోంచి రెండు దోసిళ్ళు శనగలు తీసుకువొచ్చి మేకపోతుకు పెట్టమని దాసీతో చెప్పు."

* * *

ఉత్సాహాతిశయంలో టెంపీ తండ్రిగారి ఆదేశం మరిచిపోయింది. మేకపోతు మెళ్ళో ఎఱ్రతాడు కట్టి లాక్కుంటూ ఇంట్లోకి తీసుకుపోయి "అమ్మోయ్! త్వరగా రా లంబకర్ణను చూద్దుకాని" అని కేక వేసింది –

మానిని స్నానాల గదిలోంచి ముఖం తుడుచుకుంటూ బైటికి వొచ్చింది– "చావు దాంతో – ఎవరు తీసుకొచ్చారూ దాన్ని ? తీసుకుపో – ఓ దాసీ – ఓ వాతాసీ త్వరగా, యీ మేకను బైటికొక్కట్టు, చీపురు తీసుకొని –"

ఘంటూ : "గుల్లం గుల్లం అని ఆడుకుంటా."

మానిని : "జాగర్త ! మీ ఆటలూ గీటలూ వొదిలిస్తా, ఘరానా మనుషులూ — మేకల్ని పెంచటమూనూ ! బైటికి కొట్టండి, బయటికి ! ఓ దర్వాన్ — ఓ చుకందర సింగ్ ?"

"హుజూర్" అని కేక వేసి చుకందరసింగ్ హాజరయ్యాడు. శీర్ణ ఖర్వాకృతి వృద్ధుడు. భయంకర మైన గొంతూ, అంతకంటే భయంకర మైన పేరూ — వీటి బలంతోనే యితను, దొంగలనుంచీ, దోపిడిగాండ్రనుంచీ, యీ దేవిడీని రక్షిస్తోవున్నాడు.



"బహుత్ అచ్ఛా"

ఇంటి లోపలి ఘోల విని ఇక యుద్ధం తప్ప దని రావుబహద్దర్ నిశ్చయించు కొని, మనస్సును పురికొల్పుకుంటూ లోపలికి వచ్చాడు. ఇల్లాలు అతనివంక చూడ కుండానే దర్వాన్‌తో అంది ; "ఏయ్ ! చుకందర్ సింగ్ ! ఈ మేకను బయటికి కొట్టు. ఇది మళ్ళీ నాకు కనపడిందా నీ వీపు పగలగొట్టిస్తా."

"బహుత్ అచ్ఛా !" అన్నాడు చుకందరసింగ్.

వంశలోచనుడు దీనికి విరుద్ధంగా ఆజ్ఞాపించాడు : "చూడూ చుకందర్ సింగ్ ! యీ మేక బయటికి పోయిందంటే నీ ఉద్యోగంకూడా దానితోపాటే పోతుంది.''

"బహుత్ అచ్ఛా !" అన్నాడు చుకందర్ సింగ్.

మానిని భర్తపైపు ఒక అగ్నిబాణం వొదిలి "ఆఁ, బెంపీ ! దౌర్భాగ్యురాలా ! పొద్దుపోయింది—అన్నం అఘోరించవూ ? సరే, మేకపిల్లతో నువ్విక్కడ ఊరేగు. నేను రేపే పోతున్నా హాట్ఖోలా — ''

హాట్ఖోలాలో గృహిణి పిత్రాలయం.

వంశలోచనుడు : "బెంపీ, డ్రాయింగ్ రూంలో పక్క వేయమని దాసీదానితో చెప్పు — నేను ఈ మెట్లు ఎక్కా దిగా లేకుండా ఉన్నాను. ఠాకూరుతో మాంసం కూడా తిననని చెప్పు. కాసిని పూరీలూ, కాస్త పప్పూ, కొద్దిగా కూరా చాలు —" అన్నాడు.

* * *

పూర్వం గొప్పవారి అంతఃపురాల్లో ఒక్కొక్క కోపగృహం వుంటూ ఉండేది. కుపిత ఆర్య నారీమణులు పనిపడ్డప్పుడు దాన్ని ఆశ్రయిస్తూవుండేవారు. కాని ఆర్య పుత్రులకుమాత్రం అలాంటి పక్కా బందోబస్తు ఏమీలేదు, అందువలననే వారు ఒక భార్యతో కలహిస్తే రెండో భార్య గుమ్మం తొక్కుతూఉండేవారు. ప్రస్తుతం ఖర్చులు పెరిగి డబ్బు తరగటంవల్ల — యీ చక్కని పూర్వాచారం లోపించి పోయింది. ఇప్పుడు స్త్రీలకు శరణ్యం పడకగదిలో నేలమీద చాప — యింకా కొంచెం వ్యవహారం ముదిరితే కన్నవారి యిల్లూ — ఇక భర్తలకు ఏకైక ఆశ్రయం డ్రాయింగు రూము.

భోంచేసిన తర్వాత వంశలోచనుడు డ్రాయింగు రూంలో వొంటరిగా శయనించాడు. చీకటిగా ఉండుటవల్ల వీరికి నిద్రపట్టలేదు. గదిలో ఒక మూలను సెమ్మా మీద ఆముదపుదీపం కునారిల్లుతూ వెలుగుతోంది. కొంచెంసేపు అటూ ఇటూ పొర్లి వంశలోచనుడు లేచి, లైటు వేసి భగవద్గీత తీసి చదవసాగాడు. ఇలాటి దుస్సమయాలలో వీరికి యీ గీతే సహాయం. భార్యతో అసహయోగం కలిగి నప్పుడు వీరు దీనిని తీసుకొని కాగితాలు తిరగవేస్తో, ప్రపంచంయొక్క అనిత్యతను మననం చేసుకోవటానికి ప్రయత్నిస్తోంటారు. కర్మయోగం చదువుతూ వంశ లోచనుడు ఆలోచించసాగాడు : మానిని ఈ విధంగా ప్రవర్తించటానికి తనేమి అన్యాయంచేశాడు ? తండ్రిగారింటికి వెళ్ళుతుందట ! అబ్బ, ఎంత తలబిరుసు ! పోయిందా ? తా నిక తీసుకురానే రాడు — గర్జుపడితే ఆవిడే తిరిగివస్తుంది. ఇల్లాలు

తన కిష్టమైన వస్తువులు కొంటూవుంటే తనకు యిష్టం లేకపోయినా నోరెత్తలేదు. మొన్న యీ మధ్యనేగా పదిహేను రాచ్చిప్పలూ, ఇరవైమూడు జాడీలూ, రెండు వందల యాభై రూపాయల దేకిశాలూ, పళ్ళేలూ, తుక్కూ దుమారమూ అంతా కొనుక్కొచ్చింది. ఇక తను మేకను పెంచేదగ్గరే తప్పువచ్చి కూర్చుంది ! ఉహు, సహించినకొద్దీ –

లంబకర్ణ వరండాలో పడుకొని వొళ్ళు రుద్దుకొంటూవుంది. బర్మాచుట్టలు రెండు తింటంవల్ల నిద్రకూడా పట్టలేదు. రాత్రి ఒంటిఘంట ఆ ప్రాంతాన గాలి తీవ్రంగా వీచింది. చలిచలిగా వుండటంవల్ల లేచి నిలబడ్డది. డ్రాయింగ్ రూంలో మినుకు మినుకు మని వెలుగుతున్న దీపం దానికి కనిపించింది. లంబకర్ణ తనను కట్టిన త్రాటిని కొరికివేసి, వాకిలి తెరిచివుంటం చూచి డ్రాయింగ్ రూంలో ప్రవేశించింది.

ఆకలి వేస్తోంది దానికి. గది నాలుగువైపులా తిరిగి సూపర్వైజ్ చేసింది. తివాసీమీద న్యూసుపేపరు పడివుంది. నమిలిచూస్తే చప్పగా వుంది. ఇహ గీతలోని మూడధ్యాయాలు పొట్టను పెట్టుకొంది. గీత తింటంవల్ల నాలుకకూడా ఎండిపోయింది. ఎత్తుగా వున్న ముక్కాలిపీటమీద కూజా పెట్టివుంది. చూస్తే మెడ అంత ఎత్తు పోలేదు. లంబకర్ణ దీపంవద్దకు వెళ్ళి నాకి చూసింది. చాలా రుచిగావుంది. చప్పున ఆముద మంతా నాకేసింది. దీపం కొండెక్కింది.

* * *

వంశలోచనుడు సంధి కుదిరినట్టుగా కలగంటున్నాడు...పక్కకు పొర్లాడు – వేడిగా, మృదువుగా, స్పందనశక్తి వున్న స్పర్శ తగిలింది. నిద్రమత్తులోనే – "నీ వెప్పుడొచ్చావూ ?" అన్నాడు.

"హు, హు హు," – అని జవాబు,

ఇహ ఒకటే కేకలూ బొబ్బలూ ! ''దొంగలు ! దొంగలు ! పులి పులి ! – ఏయ్ చుకందర్ సింగ్ ! త్వరగా రా–నగేన్ – వూదో శీఘ్రంగా రండి – చంపేస్తోంది !"

చుకందరసింగ్ తన ముంగేరీ తుపాకీలో మందు కూరసాగాడు. నగేనుడూ ఉదయుడూ గొడుగూ, లాఠీ, టెన్నిసు బ్యాటూ – చేతికి చిక్కిందల్లా తీసుకొని పరుగెత్తుకొచ్చారు. మానిని గాభరాగా – రొప్పుతూ రోస్తూ, క్రిందికి దిగివచ్చింది,

వంశలోచనునికి నింపాదిగా అంతా అర్థమైంది. లంబకర్ణ రెండుమూడు చేతిపోట్లు తిని – "బే బే – " అని అరవ సాగింది !

'పులి అయినా బాగుండే'దని వంశలోచనుడు అనుకొన్నాడు ! 'బాగా శాస్తి జరిగిం'దని మానిని అనుకొంది !

ఎవరయినా పెద్దమనిషి మేకను పెంచుతాడేమో కనుక్కురమ్మని వంశలోచనుడు ఉదయాన్నే చుకందర్‌సింగును బయటకు పంపించాడు, డబ్బు కక్కుర్తికి అమ్మని వాడూ, మాంసానికి ఆశపడి కోయనివాడూ, సరదాగా పెంచేవాడూ - ఈయనకు కావాలి. వాళ్ళకూ వీళ్ళకూ మేకను యివ్వడు!

ఎనిమిది ఘంట లయింది. వంశలోచనుడు వరండాలో కుర్చీమీద కూర్చుని మంగలిచేత గడ్డం చేయించుకొంటున్నాడు. వినోదబాబూ, నగేనుడూ అమృత బజారు పత్రికలో డల్‌హౌసీ వర్సెస్ మోహన్‌బాగాన్ (ఫుట్‌బాల్ మ్యాచ్) చూస్తున్నారు. ఉదయుడు జీడిమామిడికాయలు బేరం చేస్తున్నాడు. ఇంతలో చుకందర్‌సింగ్ వచ్చి సలాము చేసి – "లాటూ బాబూ ఆయే హైఁ" అన్నాడు.

ముగ్గురు అనుచరులతో సహా లాటూబాబు వరండాలోకి వచ్చి నమస్కారం చేశాడు. వచ్చినవా రందరి వేషాలూ దాదాపు ఒకే రకంగా వున్నాయి. మెడమీది వెంట్రుకలు అంటకత్తిరించీ – నెత్తిమీదిజుట్టు క్రిందకు వాలీ వుంది. ముందువైపున నాలుగు వెంట్రుకలు మాత్రం పాము పడగమాదిరిగా ఎత్తుకొని వున్నాయి. చేతికి పాకెట్‌వాచీ, మెడదగ్గరనుంచీ మోకాళ్ళవరకూ పంజాబీ లాల్చీ - దానిలోగుండా గులాబీరంగు బనీను బయటికి కనబడుతూ వుంది. కాళ్ళకు ఫుల్ స్లిప్పర్లూ – చెవిలో సిగరెట్టుపీకా.

"మీ రాక ఎక్కడనుంచి ?" - వంశలోచనుడు అడిగాడు.

"మాది బేల్‌ఘాటా కిరోసిన్ బ్యాండ్. బ్యాండ్ మాస్టరు నటవరనందిని నేనే. అందరూ నన్ను లాటూబాబూ అంటూ వుంటారు. మీ రొక మేకను ధర్మం చేస్తారని తెలిసి, విచారించి పోదా మని వచ్చాము" అన్నాడు లాటూబాబు.

"మీరు డబ్బా వాయిస్తోవుంటారా ?" అని వంశలోచనబాబు అడిగాడు.

లాటూ : "డబ్బా ఏమిటిసార్ ! శాస్త్రరీత్యా కన్సర్టు వాయిస్తాము. ఇదిగో యీాయన నవీన నియోగి – క్లారియనెట్; యీాయన నవకుమార నందన్ – ఫ్లూట్, యీాయన నరహరినాగ్ - వయొలిన్ ; వీరుకాక యింకా హార్మోనియం, డోలు తాళాలు – అందరం కలిసి పందొమ్మిదిమంది వున్నాము. బర్మాఆయిల్ కంపెనీలో మేము పనిచేస్తో వుంటాము. మా చిన్నదొరగారి పెళ్ళికి మాకు సెలవిచ్చారు. బ్యాండు వాయించాము. దొరగారు వుబ్బిపోయి టైటిల్ యిచ్చారు - 'కిరొసిన్ బ్యాండ్ ? అని.

వంశ : "చూడూ, మాదగ్గర ఒక మేక వో తుంది, దాన్ని మీ కిస్తాను. కాని –."

లాటూ : "మేము పందొమ్మిదిమంది వున్నాము. ఒక్క మేకపోతు ఏమవుతుంది సార్!...ఏమంటావోయి నరహరీ ?

వంశ : "మీరు దాన్ని అమ్మకుండా, కోయకుండా, శ్రద్ధగా పెంచే షరతుమీద నైతేనే యిస్తాను."

లాటూ : "మీరన్నీ విచిత్రమైన సంగతులు సెలవిస్తున్నారండీ! ఘరానా మనుష్యులు ఎక్కడన్నా మేకను పెంచుతారా ?"

నరహరి : "మరకకూడా కాదు పాలివ్వటానికి !''

నవీన : "చిలకకూడా కాదు పలకటానికి !"

నవకుమార్ : ''గొర్రెకూడా కాదు బొచ్చుకన్నా ఆశపడటానికి !"

వంశ : ''అదేదైనా కానీండి. నాకు మీతో అధికప్రసంగం చేయటానికి తీరికలేదు. కావాలో అక్కరలేదో తేల్చివేసెయ్యండి."

లాటూబాబూ మెడ గోక్కోసాగాడు : నరహరి అన్నాడు — "తీసుకు పదవోయ్ లాటూబాబూ, తీసుకుపద. పెద్దమనుష్యులు అంతగా చెప్తున్నప్పుడు !"

వంశ : "దాన్ని అమ్మకూడ దనీ, కోయగూడ దనీ మాత్రం జ్ఞాపకం వుంచు కోండి.''

లాటూ : "ఆవిషయమై మీరు భయపడనక్కర్లేదు. లాటూనందీ వాతప్పుడు కాడు.''

లంబకర్ణను తీసికొని బేల్‌ఘాట్ కిరోసిన్ బ్యాండ్ వెళ్ళిపోయింది.

''ముంజాకొడుకులు తీసుకుపోతున్నారు గాని నాకు నమ్మకంలేదు'' — అన్నాడు వంశలోచనుడు విచారంతో.

"నీ వేమీ దిగులుపడబోకు. నీ మేక గంధర్వలోకంలో నివసిస్తుంది" అని వినోదుడు ధైర్యం చెప్పాడు.

* * *

సాయంత్రం మామూలుగా సభ కూడింది. ఇవ్వాళకూడ పులినిగురించే చర్చ జరుగుతోంది. చటర్జీగారు చెప్తున్నారు — "అది మీ పొరబాటు. పులి అనే జంతువు వేరేలేదు. అదొక అవస్థాభేదం — గొంగళిపురుగునుంచి సీతాకోకచిలుక అయినట్లు. నిన్నగాక మొన్న మీరు డార్విన్ అఘోరించారు. మా కిది గోచీపెట్టి నప్పటినుంచీ తెల్సిందే : మన రావుబహద్దరు మేకపోతును వెళ్ళగొట్టి చాలా తెలివి గలపని చేసాడు. కోసుకుతింటే చిక్కులేదుకాని — ఇంట్లో వుంచి పెంచటంమాత్రం, ఉహుఁ —"

వంశలోచనుడు కొత్తగీత కొని చాలా తన్మయుడై చదువుతున్నాడు — 'నాయం భూత్వా భవితావా నభూయః' — అంటే ఆత్మ ఒకసారి వుంటే మరల నశించేదికాదు. 'అజోనిత్యం' — అజో అంటే మేక. కాని, మేక పోయిన తర్వాత ఇవ్వాళ సంధి కుదిరినా కుదరవచ్చు.

"హే కౌంతేయ ! తమ రొకమాటు గీత ఆవల పెట్టి చటర్జీగారి మాటలు వినండి. మనోబలం కలుగుతుంది !" అన్నాడు వినోదుడు.

ఉదయుడు : "నేనిప్పుడు సిమ్లా పోలా —"

నగేన్ : "కోతలు కోయబోకు వూదో - నీపరుగు ఎంతవరకో నాకుతెల్సు ! మనపక్క స్టేషనేగా హద్దు :"

ఉదయ : "మా మామ తండ్రి సిమ్లాలోనే వుండేవాడు. మా ఆవిడకూడా అక్కడే పెరిగింది. అందుకనే రంగంత —"

నగేన్ : "ఖబర్దార్, వూదో !"

చటర్జీ : "నే చెప్పేది వినండీ - మఝలిపూరులో వుండే చరణఘోషను ఎరుగుదురు కదూ ?...అతని దగ్గర ఒకే మేకపోతు వుండేది. దాని పేరు భూటే. ముండాది తిని తెగబలిసి ఏ మాదేది ! యింతింత...కొమ్ములూ, ఇంత...గడ్డము! ఒక రోజు ఘోషు ఇంట్లో భోజనాలు, పూరీ, పులావు. మాంసమూ - అన్నీ ! చేతులు కడిగేటప్పుడు చూస్తిమికదా — భూటే మాంసం తింటోంది. చెప్పాను. "చూచావా ఘోష్ ! ఇప్పుడే యీ మేకను కొట్టేసేయి. పిల్లా జల్లతో కాపురం వెలిగిస్తున్నావు, భయం లేదూ?" ఘోషు నామాట వినలేదు. బీదవాడిమాట అనుభవం మీదగాని తెలిసిరాదు. ఆ మరునాదే భూటే మాయమైంది. ఊరంతా వెదికాము. ఎక్కడా కనపడలేదు ; ఒక యేడాది గడిచాక బాబూ, అదే మేక సుందరవనంలో కనిపించింది ! కొమ్ములు లేవనే చెప్పాలి, గడ్డం దాదాపు అంతా రాలిపోయింది. నోరు రాచిప్పవలె తెరుచుకొనివుంది. రంగు పచ్చి పసుపు. దానిమీద మిస్టర్ ! మచ్చలు మచ్చలూ ! చారలు చారలూ ! కేక వేశాము — "భూటే !" అని. భూటే గాండ్రు మంది. దూరాన్నుంచే సలాము పెట్టి తిరిగి వచ్చాము.

"లాటూబాబూ అయే హైఁ,"

అనుచరులతో సహా లాటూబాబు ప్రవేశించాడు, లంబకర్ణకూడా వెంటవుంది. వినోదు దడిగాడు — "ఏం బ్యాండ్ మాస్టర్. మళ్ళీ ఏం పనిమీద ?"

లాటూబాబులో ఆ పూర్వపు కళ లేదు. క్రాపు అంతా చెరిగిపోయింది. కళ్ళు

గుంటలుపడ్డయ్. చొక్కా చిరిగిపోయింది. కళ్ళవెంట నీరు కారుస్తో అన్నాడు — "నాశనమైనాను సార్ ! సొమ్ము పోయి చస్తున్నాను. హో—హో—హో."

"ఎందు కలా ఏడుస్తావు లాటూబాబూ ! కొంచెం ధైర్యం తెచ్చుకో. అయ్యగా రేదో ఒకదోవ చూపకపోరులే" అని నరహరి ఓదార్చాడు.

"ఏమయిందేం ?...సంగ తేమిటి ?" వంశలోచనుడు భయంతో అడిగాడు.

లాటూ : "సార్ : ఆ మేక — "

"హుం, నేను చెప్పలా ?" అన్నాడు చటర్జీ.



*"దూరాన్నుంచే సలాం పెట్టి తిరిగివచ్చాము"*

లాటూ : "డోలు చర్మం కొరికింది. ఫిడేలు నరా లన్నీ తింది. హార్మోనియం బెల్లోస్ చప్పరించివేసింది. ఇంకా — ఇంకా . ఈ పంజాబీలాల్చీ కొరికి తొంభై రూపాయల నోట్లు — హో—హో—హో — "

నరహరి : "తినేసింది సార్, మేక కా దిది సైతాను : అంతా పోయింది. ఇక లాటూ ప్రాణాలే మీకోసం గుటగుట లాడుతున్నై."

వంశ : "మాంచి చిక్కులో పడవేసిందే.''

నరహరి : "సలామ్ హుజూర్ ! లాటూ స్థితి కాస్త చూడండి. ఏదో ఏర్పాటు చేయకపోతే పాపం చచ్చిపోతాడు."

వంశలోచనుడు కొంచెం ఆలోచించి – "భేది కిస్తే ?'' అని అన్నాడు.

"ఏమి సార్, యిదేనా మీ తీర్పు ! డబ్బుపోయి మే మేడుస్తుంటే మీరు భేదికి తీసుకోమంటారా !" అన్నాడు లాటూ శోక గద్గదస్వరంతో.

వంశ : "నీవు కాదు తీసుకోవటం – మేకకు యివ్వమని చెప్పాను."



"నాశన మైపోయాను సార్"

నరహరి : "అయ్యయ్యో, తమకు ఆ మేకసంగతి తెలియదు బాబూ ! ఎప్పుడో జీర్ణించుకొనివుంటుంది. ఫిడేలు నరాలూ, డోలు చర్మమూ, హార్మోనియం బెల్లోస్ – అన్నీ హరించి వుంటై – యిక నో ట్లేమిలెక్క !"

వినోద : "లాటూబాబు పుర్రెమాత్రం అట్టేపెట్టింది – చర్మం తిని.''

వంశ : "వినోద్ ! జరిగిం దేమో జరిగింది. ఇహ నీవే డామేజస్ (నష్టపరిహారం) నిర్ణయించు – పాపం వాళ్ళు నష్టపడకుండా, నాకు అన్యాయం జరగకుండా ! ఇవ్వాళటికి మేక యింట్లోనే వుంటుంది. రేపు ఏదో ఒక ఏర్పాటు చేస్తాను."

అనేక రేట్లు వేసి — కమీషన్లు కొట్టివేసి, వందరూపాయలకు తేల్చాడు వినోదుడు వంశలోచనుడు బేరం చేయలేదు.

లాటూబాబు మూతా డబ్బు తీసుకు వెళ్ళిపోయింది.

లంబకర్ణ మళ్ళీ వచ్చిం దని వి౦ ఉంపీ పరుగెత్తుకొచ్చింది. వినోదుడు అన్నాడు — "ఉంపీరాణీ! శీఘ్రంగా పోయి మీఅమ్మతో చెప్పూ — రేపు మే మిక్కడ భోంచేస్తా మని. పూరీ పులావు, మాంసం —"

ఉంపీ: "నాన్నగారు యిహ మాంసం తినరు."

వినోదు: "ఏమిటీ నిజమేనంటోయి వంశూ? ప్రేమ ఒక మేక మీద నుంచి విశ్వంలో వుండే మేక లన్నిటిమీదికీ ప్రాకిందా ఏం? — సరే నీవు తినవద్దులే, మేమే తింటాము. పో ఉంపీ, అన్నీ సమకూర్చ మని మీ అమ్మతో చెప్పు."

ఉంపీ: "ఇప్పుడు కుదరదు. అమ్మా నాన్నా పోట్లాడుకున్నారు. మాట్లాడు కోవటంకూడా లేదు."

వంశలోచనుడు కసరుతో అన్నాడు — "ఆఁ ఆఁ! మాటలు కూడా లేవూ? నీ కంతా తెలుసు! పోపో, పెద్ద పెత్తనగత్తె వయ్యావు!"

ఉంపీ: "బలే బాగా వుంది. నా కేమీ తెలియదనుకుంటున్నా వేం? — అలాఅయితే అమ్మ అన్నీ నా కెందుకు చెప్పుతుంది! ఉంపీ, పంఖా మరమ్మతు చేయించాలి, ఉంపీ, ఈనెల్లో యింకో రెండువందలు కావాలి — అని, మరి నీ కెందుకు చెప్పదూ?"

వంశ: "ఇహ చాలించు వాగుడు."

వినోద: "రావుబహద్దర్! అమ్మాయిని ఎక్కువగా కసరబోకు — ఇంకా చాల సంగతులు కక్కేస్తుంది. వ్యవహారం బాగా బెడిసిందా ఏం?"

వంశ: "ఇప్పటి కంతా తేలిపోయేదేనోయి. ఈ మేక ఒకటి వచ్చి మళ్ళీ మొదటికి తెచ్చింది."

వినోద: "ముండాది విభీషణుడి మాదిరిగా లంకకు చేటు తెచ్చింది. నీకూ డా అంత మమకార మెందుకోయ్ దానిమీద? నీటిలో వుంటూ మొసలితో విరోధం తెచ్చుకోవటం అంత తెలివిగలపని కాదు!"

వంశలోచనుడు దీర్ఘ నిశ్వాసం విడిచి — చూద్దాం రేపు ఏదో ఒహటి" అన్నాడు

ఆ రాత్రి వంశలోచనుడు డ్రాయింగురూంలో విరహశయ్యమీదే కాలం గడిపాడు మేకను గుర్రపుశాలలో కట్టివేశారు. ఉపద్రవం చేయటాని కేమీ వీలుచిక్కలేదు.

* * *

మర్నాడు సాయంత్రం అయిదున్నర ఘంటలకు, వంశలోచనుడు షికారుకు

బయలుదేరబోతూ, తన నెవరన్నా చూస్తూన్నారేమో నని యింటి నాలుగువైపులా చూశాడు. భార్యాపిల్లలు పైన వున్నారు. చుకందరసింగు తన గదిలో కూర్చొని భంగు కలుపుకొంటున్నాడు. లంబకర్ణ గుర్రపుశాలలో కట్టివేసివుంది. ఆ కట్టుత్రాటి హద్దులోనే అది ఎగిరి, గంతు లేస్తోంది. వంశలోచనుడు చప్పుడు చేయకుండా త్రాడు విప్పి మేకతో సహా బయటపడ్డాడు.

దోవలో ఎరిగినవా రెవరయినా కనబడతారేమో నని వంశలోచనుడు రాజమార్గం వదలి సందులు గొందులగుండా పోసాగాడు. పోతూపోతూ ఒక అంగట్లో జిలేబి పొట్లంకూడా కట్టించాడు. క్రమంగా జనసమ్మర్దం వదిలి జనశూన్యంగా వున్న కాలువగట్టుకు చేరాడు.

ఇవ్వాళ యీయన తన చేతులమీదుగా లంబకర్ణను విసర్జిస్తాడు. ఎక్కడ దొరికిందో అక్కడే వదిలేస్తాడు. తర్వాత దాని నొష్ట నేది రాసివుంటే అది జరుగుతుంది. మామూలుచోటుకు వచ్చాక వంశలోచనుడు జిలేబీపొట్లం తీసి లంబకర్ణ ముందు పెట్టాడు. తర్వాత జేబులోంచి కాగితంముక్క తీసి యిలా వ్రాశాడు.

"ఈ మేక బేల్‌ఘాటా కాలువ వొడ్డున దొరికింది. పోషించలేక మరల దీన్ని యిక్కడే వదిలేస్తున్నాను. అల్లా, కాళీ, ఏసుక్రీస్తూ సాక్షి – దీ న్నెవరూ చంప కూడదు."

వ్రాయటం పూర్తి అయాక కాయితం మడిచి ఒక చిన్న రేకుడబ్బీలో పెట్టి, లంబకర్ణ మెడలో చాలా జాగ్రత్తగా కట్టాడు. తర్వాత వంశలోచనుడు లంబకర్ణ వొంటిమీద ఆఖరుసారి చేయివేశి నిమిరి నెమ్మదిగా తప్పుకుపోయాడు. లంబకర్ణ అప్పుడు ఆహారంలో మగ్నమైవుంది.

దూరం వచ్చి కూడా వంశలోచనుడు మాటిమాటికి వెనక్కు తిరిగి చూడ సాగాడు. లంబకర్ణ అప్పటికి ఆహారం పూర్తిచేసి అటూ ఇటూ చూస్తోవుంది. తన్ను చూసిందా వెంటబడుతుంది – ఇటు ఆకాశంవంక చూద్దామా సరిగా లేదు. వంశలోచనుడు త్వరత్వరగా నడువసాగాడు.

ఉహుం. ఇహ నడవలేడు. ఆయాసం వచ్చేసింది. రోడ్డు ప్రక్కన ఒక మర్రి చెట్టువుంది. వంశలోచనుడు దానిక్రింద కూర్చోబడ్డాడు. లంబకర్ణ ఇహ కన బడటంలేదు; తన కిక ముక్తి ! – ఇంకా కొన్నాళ్ళున్నట్టయితే జడభరతుని గతి పట్టేది. ఈ దరిద్రపు నల్లజీవానికి ఆశ్రయం యివ్వబోయి తాను చాలా కష్టాలు పడ్డాడు. గృహిణికి దానిమీద గొంతువరకు వుంది. స్నేహితులూ, చుట్టాలూ, దాన్ని తింటానికి నోరు తెరుచుకొని కూర్చున్నారు. తా నొక్కడూ ఎంతవరకని

సరుకు వస్తాడు ? అయ్యారే ! సత్యయుగం ఎంత బాగుండేది ? శరణాగత కపోతం కోసం శిబిచక్రవర్తి తన దేహం యివ్వబోతే పట్టమహిషి పట్టుగానీ – సభాసదుల సతాయింపుగానీ, ఏదీకూడా అడ్డురాలేదు '

ఢం ఢం ఢం ఢాం ! ఆకాశంలో ఎవరూ దండోరా వేసేది ? వంశలోచనుడు చకితుడై పైవంక చూశాడు. ఆకాశం మధ్య సీసపురంగు పట్టీ వేసినట్టుగా వుంది. దూరాన ఒక గుంపు తెల్లకొంగలు రెక్కలు బాగా విసరుతూ పారిపోతున్నాయి. అంతా నిశ్శబ్దం – ఆకు కూడా అల్లాడటంలేదు. రానున్న ప్రళయానికి భయపడి స్థావర జంగమాలు చలనం లేకుండా స్థంభించిపోయినై. వంశలోచనుడు లేచాడు. కాని మళ్ళీ కూర్చున్నాడు. త్వరగా నడవడంవల్ల గుండె దడదడా కొట్టుకొంటోంది.

అకస్మాత్తుగా ఆకాశం కత్తితో నరికినట్టు రెండుగా చీలింది. ఒక్కటే మెరుపు. పెళపెళ పెళా – పగిలిన ఆకాశం తిరిగి అతుకు లేకుండా కలిసిపోయింది. ఈశాన్యపు దిక్కునుంచి పల్చని తెర ఒకటి కమ్ముకొస్తూంది. ఆ వెనకభాగ మంతా దానితో కప్పివేయబడింది. ముందుకూడా యిక ఆలస్యం వుండదు. ఇదిగో వచ్చేస్తుంది...వచ్చేసిందికూడా ! చెట్లూ చేమలూ నేలను ముద్దుపెట్టుకోటానికి వస్తున్నవి. ఎత్తుగా వున్న తాళవృక్షాలు తల లూపుతో తమ ఆక్షేపణ తెలియజేస్తున్నవి. కాకులు ఆర్తనాదం చేస్తూ ఎగరటానికి ప్రయత్నించి గాలితాకుడుకు ఆగలేక మళ్లీ చెట్టు కొమ్మనే పట్టుకొని కూర్చున్నవి. ప్రచండ మైన గాలి, ప్రచండతర మైన వృష్టి ! ఈ చిన్నితోటనూ ఈ క్షుద్ర కలకత్తానూ, ముంచివేయటానికి స్వర్గంలో వుండే ముప్ఫయిమూడుకోట్ల దేవతలూ బారులు తీరి పెద్దపెద్ద కుంభాలతో నీరు క్రుమ్మరించినట్లు మూసల ధారా, ధారల మధ్య మధ్య తుంపరలూ...భూమి అంతా జలమయం అయింది.

పరువు మర్యాదలూ, దుస్తులు గిస్తులూ అన్నీ పోయినై. ఇక ప్రాణాలు దక్కితే చాలు, దరిద్రపు మేక. ఏక్షణంలో...

వంశలోచనుని కళ్ళముందర వంగపండు రంగు ప్రకాశం ఆడిన ట్లయింది. దానితోపాటు ఆకాశంలో సంచితమైయున్న యిరవైకోట్ల వోల్టుల ఎలక్ట్రిసిటీ సమీపంలో వున్న నారికేళవృక్షపు బ్రహ్మరంధ్రాన్ని భేదించుకొని భూగర్భంలో ప్రవేశించింది.

రాసులకు రాసులు ఆవహూలు. జగత్తు లుప్తం. నీవూ లేవు – నేనూ లేను ! వంశలోచనుని స్మృతి పోయింది.

వర్షం వెలిసింది కానీ ఇంకా బంయి బంయిమని గాలి వీస్తోంది. వెలిమబ్బు తెరను భేదించుకొని దేవతలు, మినుకుమినుకు మను చుక్కలనే లాంతర్లు తీసుకొని క్రిందిస్థితి సూపర్‌వైజు చేస్తున్నారు.

వంశలోచనుడు కర్దమ శయ్యమీద పండుకొని నెమ్మదిగా స్మృతి తెచ్చుకొంటున్నాడు. తాను ఎవరు? — రావుబహద్దరు. ఎక్కడ? — కాలువదగ్గర. ఆ శబ్దం దేనిది? — గోదురుకప్పది. వంశలోచనునికి పోయిన స్మృతి తిరిగివచ్చింది — మరి మేక?

మనుష్యశబ్దం చెవిని బడుతోంది. ఎవరూ తనను పిల్చేది? — "మామా — అల్లుడూ — వంశూ ఎక్కడోయి! హుజూర్ —"



"ఈ వేడిపూరీలు నాలుగూ మీరు తినవలసిందే"

సమీపంలో ఒక గుర్రపుబండి ఆగివుంది. కొందరు లాంతర్లు తీసుకొని అటు యిటూ తిరుగుతూ తనను కేకలు వేస్తున్నారు — ఒక పరిచిత నారీకంఠమునుండి క్రందనధ్వనికూడా వినబడసాగింది.

* * *

మానిని అంటోంది — "ఇవ్వాళ మీరు పైకిపోవలసిన అవసరం లేదు.... ఓ వాతాపీ! ఈ డ్రాయింగురూములోనే ప్రక్క కొంచెం పెద్దదిగా వేయి. ఇటుచూడూ! నా బాలీసులుకూడా ఇచ్చిపో...ఆఁ. చటర్జీ — పాడు, ఇక్కడ నుంచి వదలదేం!...అదేమిటి? అలా నే నూరుకోను. ఈ వేడి వేడి పూరీలు నాలుగూ మీరు

తినవలసిందే. నాతోడు ?...ఆ సీసాలోది ఏమిటీ — అది కాస్త టీలో వేసి యివ్వమంటారా ?"

"హూఁ. హుఁ, హూఁ—"

వంశలోచనుడు స్ప్రింగువలె లేచి "ఆఁ, ఆఁ. అది మళ్ళీ వచ్చిందీ ? కర్ర తీసుకురా, దీన్ని —" అన్నాడు.

"మీ రేమిటీ చేసేదీ ?— కొట్టమాకండి ! పాపం అది వాన వెలవంగానే వచ్చి మీ కబురు చెప్పింది — కాబట్టే మీరు తిరిగి దక్కారు. ఓహరీ మధుసూధన్ !" అని మానిని భగవంతుణ్ణి ప్రార్థించింది.

లంబకర్ణ ఇంట్లోనే వుండిపోయింది. శశికళవలె దినదినాభివృద్ధికూడా పొందసాగింది. క్రమేణా దానికి జానెడు గడ్డం వచ్చింది. రావుబహద్దర్ దానివిషయమై అసలు శ్రద్ధే తీసుకోవడంలేదు. ఎలక్షనులో నిమగ్నుడై వున్నాడు. మానిని లంబకర్ణ కొమ్ములకు కెమికల్ బంగారం పొదిగించింది. దానికి సబ్బూ ఫినాయిలుకూడా శాంక్షన్ చేయించింది. ఎన్ని చేసినా ఎక్కువలాభం కనిపించలేదు. లోకులు దూరంగా వుండేదాన్ని వెటకారం చేస్తోవుంటారు. లంబకర్ణ గంభీరంగా అంతా వింటోవుంటుంది. మరీ సహించలేనప్పుడు మాత్రం "వ, వ, వా" అంటుంది. అంటే మీ ఇష్టం వచ్చినట్టు మీరు వాగండి - నా కేమీ లెక్కలే దని !



# డుంబు

## మేజిక్ ల్యాంప్

రచన
బొమ్మలు

బుజ్జాయి
















ఢ్రాం---మ్!
పిల్లాడా! భయపడకు!
నాకేం భయంలేదు. నువ్వే భయపడకు!


అయితే సరే! నువ్వు ఈ మెట్లు దిగి లోపలికెడితే.....
అక్కడొక మాజిక్ ల్యాంప్ ఉంటుంది, అది తెచ్చి నాకు ఇవ్వాలి, అంతేనా?


హరి! పిడుగా!
సరే! నేవచ్చేదాకా నువ్విక్కడే వుండు! భయంవేస్తే ఈ విజిల్ వూదు, మామా!


కొన్ని మెట్లు దిగి లోపలికి వెళ్ళాడు, అంతా చీకటి——
నే టార్చిలైట్ తెచ్చుకున్నాగా, నాకేం భయం!


అదిగో మాజిక్ ల్యాంప్!


మరికొంత సేపయాక——
ఆఁ! తీసుకొచ్చావా ల్యాంప్, ఏదీ ఇలా పడేయ్! ఊఁ!
ఊఁహూ! ఆ పప్పులుడకవ్ మామా! ముందు నన్ను పైకిరానివ్వాలి!


అలాగేలా! ఎందుకు నీవని చెప్పా!
నాకు తెలుసునోయ్ ఈ కథ. రాస్కెల్! తలుపేసి- పోదాం అనుకుంటున్నావ్!


డుంబు ఆ మూతికి లాంప్ మీద గట్టిగా రాసేసరికి——.
ఝూయ్!


మాస్టర్! ఏం ఆర్డర్స్! ఏం చెయ్యాలి!
పైనవున్న ఆ మూతి పక్షిని చిలకగా మార్చి పారేయ్!


మాంత్రికుడు చిలగ్గా మారిపోయాడు——
డుంబూ! డుంబూ! ప్లీజ్! నన్ను రక్షించు!
నన్ను మోసం చేద్దామనుకున్నావ్ కూంత్!


మాస్టర్! ఏం శెలవు!
ఆకలిగా ఉంది ఏవైనా స్వీట్లు తెప్పించు!


బాగున్నాయా? మాస్టర్!
యెస్! పకోడీలు లాంటి దొన్నాయ్!


ఇంక నేను వెళ్ళనా మాస్టర్!
వద్దు! ఇంకా నువ్వు అర్జెంటుగా చెయ్యవలసిన పనులున్నాయి!


వెంటనే వెళ్ళి మా స్కూలు మూయించి పారేయ్!
చిత్తం!


మా లెక్కల మాస్టరు బెత్తం బొమ్మని ఇంక ఒడికి రాకుండా భయపెట్టు. తరవాత మా పక్కింటి రామయ్యగారి పెరట్లో మామిడికాయలన్నీ కోసి తెచ్చెయ్!
చిత్తం!


ఇంకొక్క పని మా తాతకి ఓ పెద్ద పొడుండబ్బా నిండా పొడుం వేసి పట్రా!
చిత్తం!


ఎంత పెద్ద పొడుండబ్బారో! హాచ్!
హాంఫాం హాంఫాం


హాంఫాం హాంఫాం,
ఒరేయ్ డుంబూ! మేలుకోరా లేవవ్వు. నీ స్కూలుకి వేళవుతుంది

# తెరచిరాజు

"ఆ బంటును అలాగే వుండనివ్వండి. తెరుస్తే రాజు" వినయంగా చెప్పాడు సత్యం.

"అవునోయ్. మరచేపోయాను. యెంత ప్రావీణ్యం వున్నా ఒక్కోసారి పప్పులో కాలు వేస్తాం." యింకో యెత్తు వేస్తూ ఆలోచనల్లో పడిపోయారు శేఖరంగారు.

"రాజు" తిరిగి హెచ్చరించాడు: వినయోద్రేకాల్ని మిళితం చేస్తూ.

"చూడు సత్యం యివాళ యింక ఆట యెలాగూ సాగదు. ఒకవేళ సాగినా యిది వరకు నే నెంత నేర్పరినో, ఆ సంగతి యివాల్టితో నామరూపాలు లేకుండా పోతుంది. నాపేరు అలా చెరిగిపోక ముందే జాగ్రపడడం వుచితం. యేమంటావ్?"

ఒకపక్కన ఓటమి నంగీకరిస్తూనే మరోవంక దాన్నే పదిలపరచుకొంటున్నారు. యెలాగైనా పెద్దకుటుంబాల తీరే వేరు. ఇది సత్యం అంతర్వాహిని పలుకుల తళుకు.

"చిత్తం, అలాగే కానివ్వండి. నాకూ కాలేజీకి పొద్దుపోతోంది." మెల్లగా లేచాడు.

"కూర్చోవోయ్. అప్పుడే వెళ్ళి చేసేదేం ముంది గనుక. యింకా గంటా, గంటన్నర టైముంది."

ముందుకు సాగబోయే కాలు మరి సాగలేదు. సాగలేకపోవడం కాదు. యెంతటి మహత్తర శక్తులనైనా ఆలా ఆకట్టగలశక్తి దండనతో అబ్బదు. ఒకేమాట – అదైనా శేఖరంగారివంటి వారి మాటే మాట.

కూర్చోబోతూ సంశయంగా చూచాడు సత్యం. తెలుసుకున్నాడు అదే. అదే విచారరేఖలు. ముసురుకొన్న వార్ధక్యంలో అలుముకొన్న చీకటి రహదార్లు, అప్పుడప్పుడో దరహాసరేఖ మ్లానవదనాన్ని ఛేదిస్తూ మిణుక్కున మెరసి అంతలోనే తటిల్లున మాయ మౌతుంది. అది వుపోద్ఘాతానికి పునరుద్ఘాటం. అది మామూలే; తగిలినగాయం మీద తిరిగి తిరిగి తగుల్తూంటే సహజంగా 'బొప్పి' కట్టి అలవాటుగా మారిపోతుంది. నిజమే కానీ....

"కానీ?"

అప్పుడప్పుడోసారి అద్దంలో చూచుకుంటే యీబొప్పి చెరిగిపోకూడదా భగవంతుడా? ఇదివరకటి అందం తిరిగి

గంటి వెంకటరమణ

రాకూడదూ ? అనేకోర్కె 'గాయం'కన్న యెక్కువగా దహించివేస్తుంది. ఆలో చనలతో సంఘర్షణ ప్రారంభించాడు సత్యం.

"చూడు సత్యం, మా రమణలేదూ. అ దెంత మంచిదనుకొన్నావు. బి య్యే పాసయింది. ఉద్యోగం చేస్తానంటుంది; పూర్వంనుంచీ వస్తున్న ఘోషాను యెలా కాదంటాను. వీధుల్లో మగవారికంట బడుతుం దనేగా హాస్టల్లోవుంచి చది వించాను. సంగీతంలో కూడా సరస్వతి కటాక్షించింది. ఇక చిత్రకళ. దాని పుట్టిల్లే. నువ్వు చూడలేదుగాని రతీదేవే అనుకో" వృద్ధుడి కనుకొలుకుల్లో రెండు కన్నీటి బిందువులు అల్లల్లాడాయి.

గాలికి టప్పున కిందపడేవే. అంతెం దుకు; ముడుతలుపడ్డ కనుదోయిలో అవి యెంత సేపు నిలువగలవు ?

"అరె ! మీరు విచారిస్తూంటే నేను యిక్కడే వుండడంవల్ల మీ బాధను మరింత ద్విగుణీకృతం చేస్తున్నవాడి నౌతున్నాను "

సత్యంగొంతు ఆవేదనాపూరితమైంది.

కొద్దిక్షణాల తరువాత తేరు కొన్నారు. "నిజమేనోయ్. నాకు తెలియ కుండానే నేను ఊహాలోకంలో చాలా దూరమే పోతూంటాను. తత్ఫలితమే యిది." కన్నీరు చేత్తోతుడుచుకుంటూ పరోక్షంగా చూపించారు.

"పెద్దవారు. మీరే యిలా డీలాపడి పోతే యెలా చెప్పండి. ఈ వృద్ధాప్యంలో కన్నీటితో బ్రతుకును భగ్నం చేసుకో వచ్చా." తనకు చేతనైన విధంగా వోదార్పు వచనాలు పలికాడు.

"నీ కీ సామెత తెలుసా?" హఠాత్తుగా అడిగారు.

"ఏసామెతండీ ? ", కుతూహలం చూపకుండా యెలా వుండగలడు.



"అన్నీ వున్నాయిగాని అంచుకు తొగరు లేదట. యిది విన్నావా."

"ఆఁ విన్నానండి — మా అమ్మే యెప్పుడూ అంటూండేదట. అలాగని మా నాన్నగారు అన్నారు."

"అంటే మీ నాన్న యింకా సజీవులే నన్నమాట. యెవరో అన్నారని నమ్మి యింతకాలం నీకు తండ్రి లేరనే అనుకొన్నాను బాబూ."

"ఈసారి సత్యంముఖం నల్లబడింది. ఇదీ నిజమేనండి—ఇదిపదేళ్ళనాటి మాట. యింకా కొద్దిగా జ్ఞాపకం వుంది.

"అలాగా బాబూ. ఇంతకూ ఆ సామెత యెందుకొచ్చిందంటే మా రమణలేదూ, అది లక్ష్మీ సరస్వతుల కలయిక. అటువంటి పిల్ల సాధారణ కుటుంబాల్లో వుండవలసినదికాదు. అందుకే మా నాన్నగారు అంటూండేవారు. 'ఒరేయ్ శేఖరం, యీ పిల్ల మనపాలిట దేవతరా. దీన్నిమాత్రం కష్టపెట్టకు. అన్ని విషయాల్లో యెలా వున్నా జీవిత భాగస్వామ్యంలో మాత్రం జాగ్రత్త. ఇటు దీన్ని నొప్పించకూడదు; అటు సమాజాన్ని వొప్పించేట్లు యెలా చేస్తావో' అని: అటువంటి రమణకు..."

సంభాషణ తెగిపోయింది. మధ్యలో దగ్గుతెర వుక్కిరి బిక్కిరి చేస్తోంది. పెద్దవాళ్ళ తీరే అంత. సంభాషణలో విచిత్రంగా సందిగ్ధాన్ని మిళాయిస్తారు. కానిపక్షంలో వుండనే వుంది యీ"దగ్గు" అనబడే అస్త్రం.

మళ్ళా ప్రారంభించారు.

"మా రమణవ్రాసే కథల సంఖ్య లెఖ్ఖల్లో తేలదు. అందరూ దాన్ని చూసి మెచ్చుకునేవారే. కానీ అదేం చిత్రమో ఒకటీ అచ్చు అయ్యేదికాదు. తిరిగివచ్చిన తన కథల్ని చూసుకొని పెళ్ళిసంబంధం వద్దన్న మగపెళ్ళివారిమీద వుండే అక్కసు యెలా తీర్చుకొంటామో అదే విధంగా తిట్టుకొనేది. 'వెధవచెత్త కథలు వేస్తారు, నాది వేసుకోరే విఁటో?' అని యేడ్చేది. అందుబాటులో వున్నదీ, నాకు చేతనైంది చేయగలను కానీ ఇటువంటివాటికి నేనేం చెయ్యగలను? 'కథ' వ్రాసి దాని డబ్బుకోసం ఆశించే దైతే యేమైనా అనుకోవచ్చు. కానీ...ఖ్యాతే కావా లనుకునేదానికి యీ ఎడిటర్లు చేసే నిరాశ అంతా యింతా కాదు."

వాచీవంక చూసుకుంటున్న సత్యం ముఖకవళికల్ని గమనించి "యిక రెండు నిమిషాలు. ఇవాళ యేవిఁటో పూర్తిగా నీ కీ కథచెప్పాలి. అందుకే మనసు చేసే గందరగోళానికి తట్టుకోలేకపోయాను చిటికెలో చెప్పేస్తాను; కూర్చోవోయ్."

అభ్యర్ధన తిరస్కరించలేకపోయాడు.

"ఒకసంగతి మనసులోనే దాచుకో నాయనా..." విచారంగామారిపోయింది, అంతటి శేఖరంగారి ముఖం. తెల్లటి ముఖంలో నెత్తురు క్షణం మాయమైంది. పాలిపోయిన ముఖంలో జీవంలేదు; కళ లేదు.



"యేమిటంటే, నేనూ మీ రమణతో సమానమే. పోగా ఆవిడ స్త్రీ, నేను పురుషుణ్ణి.

వృద్ధుని హృదయం తటిల్లున ఆగిపోయేదే. పిడుగుపాటు తిన్న వృక్షాగ్రం నేలకూలిన ట్లయింది. కాలం స్తంభించిన ట్లయింది. పృథ్వే మాయమైందా అని అనిపించింది క్షణం. వణికే స్వరంతో పరీక్షగా చూస్తూ "యేమిటి బాబూ అంటున్నావు" అడిగారు. సాన పట్టి పదును పెట్టిన కత్తికి తుప్పుండడం సహజమనిపించదు. అందుకే అలా నిలబడగల్గింది అతని హృదయం.

చెప్పాడు సత్యం. "నేనూ మీ రమణా సమానమే."

ఇదేమాటకు యిదే జవాబుగా యెప్పుడో యిచ్చిన ట్లయింది. ఇదే వాతావరణం. గతజన్మ తాలూకు ప్రశ్నా? యేమో మరి.

"యేవండి, యేవన్నా తప్పుగా అన్నానా?" కలవరపాటుతో అడిగాడు సత్యం.

ఏ తండ్రీ తనకూతురు, అందునా అన్నిటిలో అందెవేసిన, ప్రాణంగా ప్రేమించిన కూతుర్ని గురించి అడగడం యిష్టపడడు. తనంత తాను చెప్పగలడు. రెట్టించి అడిగితే అతని క్రోధంకూడా అంతకు రెట్టింపు ఔతుంది. బహుశః తను పురుషుడు. వారాలు చేసుకునే తను, ఆ చెప్పేవ్యక్తి చెప్పింది వినకుండా యిలా అడ్డుప్రశ్నలు వేస్తే యెంత ప్రమాదం.

వృద్ధుడు నిలువెల్లా వణికిపోతున్నాడు. క్రోధంతో కాబోలు.

శేఖరంగారి వదనంలో చివరి సందేశం మిగిలింది.

"కాదు. నువ్వడగడంలో తప్పేమీ లేదు. కానీ ఒకటి – ఆ సామెత ప్రకారం

నా కూతురు అన్నీ వుండీ ఐదవతనానికి దూర మైంది. అదో బాల వితంతువు" అంటూ ఆగారు.

ఐతే అది క్రోధంకాదు. పుత్రిక దురదృష్టాన్ని మననం చేసుకొంటూంటే వెల్లడి అయ్యీ కాలేని ఆక్రందన. "నీలాగేచాలామంది యీయింటికివారాలు వెతుక్కుంటూవచ్చేవారు" అంటూ ఆగి, "ఇక నీకు కాలేజీకి టైమయిందికాబోలు" అన్నారు.

అంటే 'వెళ్ళు' అని చెప్పలేక 'దయ చేయ్' అని చెప్పేతంతు. పుస్తకాలు. చేత్తోపట్టుకొన్నాడు. ముందుకుపోబోతూ,

"బాబూ...! సత్యం, ఒకమాట"

కొద్దిగా విసుగే అనిపించింది. అయినా తప్పదు.

"ఈ చదరంగం నీదగ్గరే వుంచుకో, యేకాలానికి యే మౌంతుందో". ఆశ్చర్య పోయాడుఒకక్షణం.ప్రాణంకంటేమిన్న. ఇకతను ఆ యింటికి వెళ్ళకూడదు. బహుశః అతని పుత్రికమీదే అనుమా నించి వుండవచ్చు. ఉహుఁ; అతనికి తనమీద అనుమానం కావచ్చు.

మౌనంగా నిష్క్రమించాడు తను.

ఆ సాయంత్రమే తనకు విషాదవార్త అందింది. ఈ వృద్ధాప్యంలో విషం తాగవలసిన అవసరం యేంకల్గిందో. చేతిలో వున్న కవరు చిరిగింది. శేఖరం గారు వ్రాసిన వుత్తరం ముందుకు వచ్చి చదవ మని వేధిస్తోంది.

"సత్యం! కథ అసంపూర్తిగా ఆగి పోయింది. నువ్వు సత్యానివి.నాసత్యానివి. నా ప్రాణానివి. చిన్నప్పుడు రమణ అనేది "నాన్నా! ఆరాజును నాకిచ్చెయ్ ఆడుకుంటాను" అని. కానీ యివ్వలేదు. బాల్యంలో యిచ్చిన రాజును భగవంతుడు కూడా ఆడుకోనివ్వలేదు. ఇక పోగా మిగిలింది "రాజు". ఆ రాజు వర్ణం "నాది" కాదనే అహంకారంతో యింట్లోంచి వెళ్ళగొట్టాను. పర్యవ సానం. మర్నాడు నా రమణ బాల వితంతువు. ఏదో అనుకొని రాజుతో లేచిపోయింది. (ఇది లోకం అనుకొనే మాట). అయినా నాముఖం చూడలేక నువ్వు పుట్టాక చనిపోయింది. యే యువకుడైతే వారాలకోసం వచ్చి నా ప్రాణాన్ని (రమణను) తీసుకపోయాడో ఆరమణకొడుకే నువ్వని యివాళ తెలుసు కొన్నాను. యెలాగో తెలుసా? నేనూ, మీ రమణా సమానమే అన్నావు. ఒక ప్పుడు మీ నాన్నఅలాగే అన్నాడు. అదే మాట, అదేక్రాపు. అదే రూపు, ఆ రాజు. ఈ సత్యం అంటే హృదయం ఛెళ్ళు మంది. సందిగాయిపెట్టె తెరిచాను. నీ ఫొటో. నువ్వుఅడిగినప్పుడు యివ్వలేదు 'రాజు'ను. మీ అమ్మ అడుగుతే యివ్వలేదు. ఇక కాదనను నాన్నా. నీదే చదరంగం. నీ రూపు వెంటనే పోల్చు కున్నాను. ముఖకవళికల్లో మార్పు కనబరచలేదు. నీరాజును నీ



"మీ కోడిని దొంగిలించిన మనిషి అతడే నని మీరు చెప్పగలరా ?"
"మీరు క్రాస్‌పరీక్ష మొదలుపెట్టిన తరువాత నాకు అసలు కోడంటూ ఉండేదా అని అనుమానమొస్తోంది."

కిచ్చేశాను. అడిగింది యివ్వకపోతే వచ్చే నష్టం యిన్నేళ్ళ అనుభవంలో జీర్ణించుకొన్నాను. నాన్నా తెరుస్తే రాజు అనేది రమణ. అన్నటుగానే జరిగింది. ఒకేసారి తెరచిన ఘోషలోంచి బయట పడింది రాజు. కాదు రాజ్ఞి. నువ్వే నా సత్యానివి. ఇంక రాయలేను. నువ్వొక కుల హీనుడవు. రేపు మళ్ళీ భోజనానికి వస్తావు. తెలిసి యెలా పెట్టగలను. అమ్మ బ్రాహ్మణి ఐతే పుత్రుడు కాలేదు. నీకీ నగ్నసత్యం యెలా తెలుస్తుంది. నేను చెప్పలేను. అందుకే యింత కఠోరమైన జీవిత పరిధిలోం, నిష్క్రిమిస్తున్నాను. ఈ సమాజం తాకిడికి యీ వయసులో తట్టుకోలేను. 'నీ కొడుకుకు అన్నం పెట్ట లేని నికృష్ణుణ్ణని' మీ అమ్మను క్షమాభిక్ష కోరాలి''

"మీ తాత, శేఖరం"

గిర్రున తిరిగి పోతున్నయ్ అక్షరాలు. భూమి బ్రద్దలైందా ? అనిపిస్తోంది. కర్తవ్యతా విమూఢుడే అయ్యాడు సత్యం. "ప్రతీకారమా !'' మనసు హెచ్చరిక చేస్తోంది. "కాదు, యెన్నటికీ కాదు. కొందరు అన్నీ వుండి అదృష్టహీనులౌతారు. కారణం యీ సమాజం. కట్టుబాట్లకు లొంగితీరాలి. తన కర్తవ్యం చాలా వుంది. ఏకాకిఅయిన తాతగారి కర్మకాండ పూర్తి చేయాలి.

"రమణ..."

ఆశ్చర్యంగా తల పంకించాడు. అపోహల పొరలు కరిగిపోయాయి. పాదాలు ముందుకు సాగాయి. తనకు యెవ్వరూ లేరంటే యేమీ అనుపించదు. క్షణం క్రితం వుండి అంతరిక్షాన మాయమైతే ఆ హృదయగతస్థితి వూహ కందనిది - వర్ణనాతీతమే - మరి.




కోర్టుహాలు కిటకిట లాడిపోతోంది. సినిమా చూడబోతున్నంత ఉత్సాహంతో జరగబోయే తతంగానికి ఎదురుచూస్తున్నారు.

పోలీసులు — వెంటబెట్టుకొచ్చిన ముద్దాయిని బోనులోకి ఎక్కించి రెండు ప్రక్కలా నిలబడ్డారు. అందరిదృష్టి అతనివైపుకి మళ్ళింది.

కాని ఆనందరావుగారికి మాత్రం ఈ తతంగం అంతా చాలా చిరాగ్గా వుంది. అసలాయనకి కోర్టుకి హాజరవడమంటేనే చెడ్డ తలనొప్పి. జీవితంలో ఆయన ఇంతవరకు కోర్టు కెక్కలేదు - జ్యూరీ మెంబరుగాతప్ప. "కోర్టు కెక్కినవాడు, గాడిదనెక్కినవాడుఒకటే"నన్న నమ్మకం ఆయనకి వంశపారంపర్యంగా వచ్చినది.

అసలు ఊళ్ళో పెద్దమనిషి అయ్యుండడం కూడా పెద్ద బాధగానే ఉంది. 'తమరిని ఫలానా తారీఖుల్లో జ్యూరీ మెంబరుగా ఉండగోరుతున్నాము' అని ఫర్మానాలు జారీ చేస్తారు. మొదట తెలియక రానన్నాడు. కాని తరువాత జస్టిస్ రాజశేఖరం చెప్పాడు "మేం పిలిస్తే రాననకూడదు బ్రదర్! దేముడి కార్యంలాంటిది జ్యూరీ సభ్యత్వం. అయినా మిస్టర్ ఆనందరావు, ఏదో కొద్దిరోజుల జ్యూరీమెంబరుగా ఉండి వాళ్ళగోల వినవయ్యా అంటేనే మీ కింత బాధగాఉందే, మరి రోజూ పడే వాళ్ళం మే మేంకావాలి? ఒక్కకేసు

పూర్తయేసరికి తలలో పది వెంట్రుకలు నెరిసిపోతాయి" అని.

అడపా తడపా తనికీ స్వచ్ఛంద సేవ తప్పడంలేదు. అంతా విని "ముద్దాయి దోషి" అని నమ్మకం కలిగినా ఆమాట చెప్పటానికి జాలి వగయిరా అడ్డు వస్తుంటాయి.

తనీ తోటిజూరర్లవంక చూశారు ఆనందరావుగారు. అందరూ కబుర్లలో పడి చాలా బిజీగా కనబడుతున్నారు. అందరూ ఆయనకి పరిచయస్తులూ, మంచి స్నేహితులూను.

"ఇదంతా మన ఖర్మ" అన్నాడు డాక్టర్ సదానంద—ఆనందరావు తనవంక చూడంగానే నవ్వుతూ;

సదానంద ప్రొఫెసర్.

ఆయన కూడా నవ్వేశారు. అంతలోనే జడ్జీగారు రావడంతో అందరూ మళ్ళీ స్థానాల్లో కూర్చోవడం జరిగాయి.

గడియారంతోబాటు ముద్దాయి నేరం కూడా గబగబ ముందుకు సాగుతోంది. ముద్దాయి వైపుప్లీడరు బొత్తిగా పేరులేనివా డవడంవలన గవర్నమెంటు లాయరు గారు చకచక సాక్షుల్ని పిలిచి కోర్టుని ఏలేస్తున్నారు!

ఆనందరావుగారికి కేసు నడుస్తున్న కొద్దీ అందులో కుతూహలం కూడా పుట్టి జాగ్రత్తగా వినసాగారు. ఉభయుల వాదనలు వింటూ ఆయన గ్రహించినది—

ఆ కుర్రాడు — అంటే ముద్దాయి — కాలేజీలో చదువుకుంటున్నాడు. అతనితో పాటు సావిత్రి అనే అమ్మాయికూడా చదువుకుంటోంది. ఆ అమ్మాయితో ఇతని పరిచయం స్నేహంగా మారి ప్రేమగా స్థిరపడింది. ఆ అమ్మాయి కూడా అతన్ని ప్రేమించింది. ఫలితంగా ఇద్దరూ వివాహం చేసుకుందా మనుకున్నారు. ముద్దాయి గోపాలరావుకి ఆస్తి లేకపోయినా మంచి తెలివితేట లున్నాయి. అంద ముంది. వాటినే అడ్డం వేసుకుని సావిత్రి ఇంటికివెళ్ళి ఆ అమ్మాయి తాతగారితో తమ విషయం చెప్పాడు. అంగీకరించి ఆశీర్వదించ మన్నాడు.

కాని ఆయనగారు వీళ్ళ నిర్ణయాన్ని హర్షించలేదు. అందుకు ఒక కారణం ఆయన్న ధనవంతు డవడం. మరొకటి — ఆయన గోపాలరావుని తండ్రి పేరేమి టన్నాడు. ఇతను ఆ మాటకి సమాధానం చెప్పలేకపోయాడు. ఆయనగారు అదే ఒక అవకాశంగా తీసుకుని తండ్రి ఎవరో తెలియని అనామకుడికి తన కూతుర్ని ఇవ్వలే నన్నాడు. పైగా "నీతల్లిగురించి కూడా కొంత విచారించాను. అటువంటి చరిత్రగల ఇంటిలో నా మనుమరాలిని అప్పజెప్పలేను" అన్నారు.

గోపాలరావుకి సహజంగానే కోపం వచ్చింది. తన కోర్కెని కాదన్నా భరించ గలనుగాని తల్లిని అంటే మాత్రం సహించేదిలే దని హెచ్చరించాడు.

కాని ఆయన అతనిమాట లక్ష్యపెట్ట కుండా ఇష్టంవచ్చినట్టు మాట్లాడేశాడు. "నీ తల్లి, ఆవిడ తల్లికూడా నీతితప్పిన వాళ్లే" నన్నాడు. చివరికి "నువ్వు కేవలం నా ఆస్తినిచూసి మా అమ్మాయిని వలలో వేసుకున్నావు'' అన్నాడు.

దాంతో గోపాళ్లరావుకి కోపం హద్దు మీరిపోయి ఆయన్ని పట్టుకు కొట్టేశాడు. సావిత్రి అడ్డంపడి విడతీసింది. అసలే పెద్దతనం, జబ్బు మనిషి అందులో దెబ్బలు కొంచెం గట్టిగా తగలడంతో ఆయన మంచంపట్టి నెల్లాళ్ళకి స్వర్గస్తు డయాడు.

ఇతని మీద నేరం మోపబడింది.

అంతావింటూ ఆనందరావుగారు అతని వంక చూశారు. చాలా అందంగా బలంగా ఉన్నాడు. ముఖంలో ఈ లోకం అంటే ఉన్న తృణీకారభావం మాత్రం కొట్టవచ్చినట్లు కనబడుతోంది. ఎవ్వరి వంకా చూడకుండా కూర్చున్నాడు.

గవర్నమెంటు లాయరు – కేవలం డబ్బు దృష్టితోనే అతను ఆ అమ్మాయిని ప్రేమించినట్లు, ఎప్పుడయితే తన ప్లానుకి అంతరాయం కలిగిందో అప్పుడు కోపం పట్టలేక ఆయన్ని కొట్టేసినట్లు ఋజువు చేసేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ముద్దాయి తరుపు లాయరు – తల్లిని నానా మాటలు అని అతన్ని డబ్బుకోసమే తన మనవరాలిని ప్రేమించాడని అన డంతో ఆత్మాభిమానం కలవాడు కాబట్టి అలా కొట్టాడని, పూర్తిగా అతన్ని ఆ స్తితికి రెచ్చగొట్టింది ఆయనే కనుక అతని తప్పు లేదని చూపించేందుకు ప్రయత్నిస్తున్నాడు.

వాదనలు కేసు వివరాల్లోకి పోవ డంతో ఆనందరావుగారికి విసుగు పుట్టి ప్రేక్షకులవైపు దృష్టి మరల్చి ఆశ్చర్య పోయారు. నిజమా భ్రాంతా అని మళ్ళీ ఒకసారి పరిశీలనగా చూశారు:

"సందేహం లేదు సుభద్రే!" అను కున్నారు సాలోచనగా......

*　　*　　*

గదిలో అటూ ఇటూ తిరుగుతున్నారు ఆనందరావుగారు. తోచక గాదు – ఆలో చనలు ఎక్కువయి. ఆయన మనస్సులో తన గత జీవితం కదలసాగింది.

—సుభద్రకి తను అన్యాయం చేశాడు. అంతక్రితం తను చేయగలనని కలలో నయినా అనుకోనంతగా ద్రోహం చేశా డామెకి. అంతకన్నా విచిత్రం ఏమిటంటే ఆమెని పూర్తిగా మరిచిపోయేందుకు ప్రయత్నించాడు.

సుభద్ర, ఆ అమ్మాయి తల్లి మాత్రం ఉండేవాళ్ళు ఇంట్లో. వాళ్ళకున్న ఆస్తి ఆ ఇల్లు ఒక్కటే. అందులోనే రెండు గదులు అద్దెకిచ్చి దానిమీది ఆదాయంతో బ్రతుకుతుండేవారు. దీనికి తోడుగా ఆవిడ ఎవరో ప్లీడరుగారింట్లో వంటచేసి మరి కొంత సంపాయిస్తుండేది.

తను వాళ్ళ ఇంట్లో ఒక గదిలో అద్దె కున్నాడు చదువుకునే రోజుల్లో. సుభద్ర తల్లిని గురించి తను కొన్ని మాటలు వింటుండేవాడు. మొదట వాటిని గురించి పెద్దగా పట్టించుకొనేవాడు కాదు. కాని తరువాత్తరువాత కొంత కుతూహలం కలిగి ఆమెను జాగ్రత్తగా పరిశీలించాడు.

మనిషి లోగడ అందంగా ఉన్న ఛాయలు ఇంకా పోలేదు. కాని వేలెత్తి చూపదగ్గ లోపం ఏనాడూ కనబడలేదు ఆమె ప్రవర్తనలో తనకి. చాలా మర్యాదగా మాట్లాడేది. బహుశ గతంలో కాలు జారిన మనిషేమోనని నవ్వుకునేవాడు.

సుభద్ర రూపంలో అంతా తల్లి పోలికే! చాలా అందమయినది. స్కూలు ఫైనలు చదువుతుండేది. ఎంతగా లేక పోయినా కూతురికి మాత్రం సాధ్యమయినంతవరకు ఏ లోపం రానిచ్చేదికాదు ఆవిడ. సుభద్ర ఎప్పుడూ మంచిబట్టలే కట్టుకునేది. బహుశ అదే వాళ్ళ అమ్మని గురించి ఊహాగానాలకి తావిచ్చి ఉంటుందనుకునేవాడు తను. నిజమే మరి, అంత ఖరీదయిన బట్టలు కొనేందుకు డబ్బు ఎలా వచ్చిందని ఎవరికయినా సందేహం కలగవచ్చుగా!

ఆ వయస్సుకి సహజమయిన చాపల్యంకొద్దీ సాధ్యమయినన్ని సారులు సుభద్రని చూసేందుకు ప్రయత్నించేవాడు కాని సాధారణంగా బయట కనబడేది కాదు. స్కూలుకి పోవడం, తిరిగి రావడం—తల్లి ఇంట్లో ఉండదు కాబట్టి తరువాత వంట ప్రయత్నంలో మునిగి పోవడం ఆమె కార్యక్రమం. ఏ భావి దగ్గరనో దర్శన మిచ్చేది. తను చూడగానే సిగ్గుపడి తల వంచుకుని పారి పోయేది.

మనకు దగ్గరకాని వస్తువుమీద కుతూహలం, ఆకర్షణా పెరగడం సహజం. అలాగే తనకి కూడా సుభద్రమీదికి ఆలోచనలు మాటి మాటికీ పోతుండేవి. అరికట్టుకుందా మని వ్యర్థ ప్రయత్నం చేసేవాడు.

"తనే పెద్ద పతివ్రతయినట్టు, ఇవతల వారంతా రౌడీలయినట్టు — అలా పారి పోతుందేం" అనిపించేది ఒకొక్కసారి వళ్ళు మండి.

మొదటి ఏడా దంతా ఈ విధంగానే గడిచిపోయింది. వేసవి శలవలకి ఇంటికి బయలుదేరుతుంటే ఏదో పెన్నిధిని వదలిపోతున్నట్లుగా బాధపడ్డాడు. అప్పుడే తన మనస్సుకి హత్తుకుపోయిన సంఘటన ఒకటి జరిగింది. ఇక మర్నాడు వెళ్ళిపోతా డనగా పంపుదగ్గర స్నానం చేసి గదిలోకి వెళ్ళబోతుంటే సుభద్ర ఎదురయింది—బియ్యం గిన్నెలో పోసుకుని.

ఆదే అదు నని "పరీక్షలు బాగా వ్రాశావా?" అనేశాడు తాను.

తల వంచుకుని "ఊఁ" అంది.

ఇక అంతకన్న ఏం మాట్లాడాలో




"ఒరే బాబూ దూరంగా ఉండు, మీనాన్నారిని పలకరించకు, గొప్ప డిటెక్టివ్ కథ రాయబోతున్నారు."

తెలియక తాను కదులుతుంటే "రేపు వెళ్ళిపోతారుటగా" అంది మెల్లిగా.

ఆమాటలో ఏదో స్ఫురించి "అవును" అన్నాడు తాను వెనక్కి తిరిగి.

"పై ఏడాది మా రూములో నే ఉంటారా ?... హాస్టలుకి పోతారు కాబోలు."

"నువ్వు మాట్లాడుతూ ఉంటానంటే ఇక్కడికే వస్తాను" అన్నాడు తాను ధైర్యం చేసి.

ఒక్కసారి నవ్వి తలవెనక్కి విసిరి పంపుదగ్గరకు వెళ్ళిపోయింది సుభద్ర. అప్పటి ఆమె అందాన్ని నెమరవేసుకుంటూ గదిలోకి పోయాడు తాను.

తరువాత శలవు లిచ్చేసినందుకు బాధపడిపోయాడు.

ఆ మరుసటి ఏడాది హాస్టల్లో సీటు వచ్చినా వదిలేశాడు. "బయట గదిలో ఉంటే చదువు బాగా సాగుతుంది నాన్నగారూ, హాస్టల్లో గోల ఎక్కువ. చదువుకునేవాళ్ళని ఏడిపిస్తారు" అని సాకు చెప్పి మళ్ళీ పాతగదికే చేరుకున్నాడు. ఈ సారి తన అదృష్టంకూడా బావుంది !

సుభద్ర స్కూల్ ఫైనలు పాసయి కాలేజీలో చేరతానని పట్టుపట్టింది. వాళ్ళమ్మ ఎన్ని విధాల నచ్చచెప్పినా వినలేదు అమ్మాయి. తాను అంతక్రితం ఏడు ఉండి మంచివాడనిపించుకున్నందు వలన నేరుగా ఆవిడ తన దగ్గరకే వచ్చి "చూడు నాయనా మా పిల్లది, కాలేజీలో చదువుతుందిట. పిల్లకాకి కేం తెలుసు ననీ నా బాధ ? మీలాంటి ఉన్న మహారాజుల కయితే ఫరవాలేదు కాని, ఆడముండని నే నేం పోయగలను అంతేసి డబ్బు !'' అంది.

వెనక తలుపుచాటున నిలబడే ఉంది సుభద్ర పమిట చెరుగుని వేళ్ళమధ్యన ఇస్త్రీ పెడుతూ.

"స్కాలర్ షిప్‌లు ఇస్తారటగా'' అంది జనాంతికంగా.

"అవును – కాని మార్కులు చాలా బాగా ఉంటే తేలిగ్గా వస్తుంది."

"నాకు మార్కులు బాగా వచ్చాయి!"

"తీసుకురావే అబ్బాయి చూస్తాడు" అంది ఆవిడ.

ఛంగున పరుగెత్తి కెళ్ళి పుస్తకం పట్టుకొచ్చింది. ఆ అమ్మాయి చేతులోంచి తనే తీసుకుని చూశాడు. ఆశ్చర్య పోయాడు – బ్రహ్మాండంగా ఉన్నాయి మార్కులు.

"సుభద్ర కివ్వకపోతే ఇం కెవరి కిస్తారండి ?'' అన్నాడు ఉత్సాహంగా.

ఫలితంగా కాలేజీలో చేరింది సుభద్ర. అప్పటినుంచే తన మీద ఒక మధుర మయిన భారం వేయబడింది.

"దానికి వేరే ప్రయివేట్లు చెప్పించే తాహతు లేదు నాయనా నాకు – ఏదో నువ్వు నామీద దయవుంచి దానికి నాలుగు ముక్కలు చెబితివంటే చచ్చి నీ కడుపున పుడతాను'' అంది ముసలావిడ.

అంతకన్న తనకిమాత్రం కావలసిం దేముంది. మనస్సు ఆనందంతో ఎగిరి గంతేసింది ... మొదట సిగ్గు పడుతుం డేది సుభద్ర. కాని రానురాను చనువుగా ఉండసాగింది. కేవలం పాఠాలు మాత్రం అడిగేదల్లా క్రమంగా ఇతర విషయాలు మాట్లాడసాగింది.

తరువాత తమ ఇమిద్దరిమధ్యా కేవలం ఇతర విషయాలే వచ్చేవి. తనను పూర్తిగా నమ్మి తన సర్వస్వం అర్పించు కుంది.

తన మనస్సు మాత్రం తన కప్పటికి పూర్తిగా తెలియదు. ఆ అమ్మాయిని ప్రేమించి ఆమె స్నేహాన్ని కోరా డను కోవడం పొరపాటే అవుతుంది. ఆమె అందం తన్ని ముగ్ధుడ్ని చేసింది. అందు కోసమే తను ప్రయత్నించాడు. వయస్సులో ఉన్న అందమయిన అమ్మాయిలపట్ల సహజంగా ఉండే ఆకర్షణవలన మాత్రమే తను ఆమె సహచర్యాన్ని, సాన్నిహిత్యాన్ని అభిల షించాడు. అనుకోకుండానే తనకి ఆమె లభ్య మైయింది. అందుకు తన్ను తాను అభినందించుకున్నాడు – అదృష్టవంతుడ నని.

తన కోర్కె ఫలించేందు కని తను ఆమెతో కొన్ని మాటలు అని ఉండ వచ్చును – కాని అది కేవలం అబద్ధమేనని తెలిసి చెప్పాడు అప్పట్లో. పాపం సుభద్ర నమ్మింది.

తనకి పరీక్షలు జరిగేవరకూ ఎవరికీ తనమీద అనుమానం రాలేదు. అలా జాగ్రత్త పడ్డాడు తాను. కొద్దిమంది స్నేహితులు పసిగట్టి ఈర్ష్యపడ్డారు...చివ రికి తను చదువు పూర్తిచేసుకుని ఇంటికి

బయలుదేరవలసిన రోజు ఆసన్నమయింది.

శలవలిచ్చేశారని తెలిసిన సుభద్ర అడిగింది "మరి నా సంగతి ఏం చేస్తారు?" అని.

నిజానికి అప్పటిదాకా తను ఆ విషయమే అంతగా ఆలోచించలేదు. అందువలననే హటాత్తుగా ఆ ప్రశ్న ఎదురవడంతో కలవరపడిపోయి "ఏముంది, ఇంటికి వెళ్ళి మా వాళ్ళతో చెప్పి ఏర్పాటు చేయిస్తాను" అనేశాడు.

సుభద్రకి తనమీద, తనప్రవర్తనమీద అపారమయిన విశ్వాసం— "నాకు తెలుసు, మీరు నన్ను అన్యాయం చేయరని..ఇప్పుడు నేను వట్టిదాన్ని కూడా కాను. మన స్నేహం ఫలించింది'' అంది సిగ్గుపడుతూ మెల్లిగా.

ఇంకో పరిస్థితుల్లో నయితే ఈ మాటకి ఎంతో ఆనందపడవలసినది. కాని అప్పుడు మొదటిసారిగా పశ్చాత్తాప్పడ్డాడు— తన తొందరపాటుకి. ఆ అమ్మాయి భవిష్యత్తుని పాడుచేశానని బాధపడ్డాడు.

రైల్లో కూర్చున్నా సుభద్ర తన మనస్సులోంచి పోలేదు. తనకు తెలియకుండానే తనలో ఒక చెరగని ముద్ర వేసుకుంది. "పోనీ సుభద్రనే చేసుకుంటే ఏం— అందమయినది, చదువుతున్నది.



అన్నిటికీ మించి చాలా మంచిది.'' అన్న ఆలోచన కలిగింది. కాని ఆ వెంటనే చండశాసనుడయిన నాన్నగారు, అక్కయ్యకూతురు పద్మావతి, వంశ గౌరవం వగయిరా జ్ఞాపకం వచ్చాయి.

''సుభద్ర తల్లి గతచరిత్రని గురించి ఎవరూ మంచిగా చెప్పుకోరు. ఆమె ప్రస్తుతం వంటలు చేస్తోంది. తన తండ్రి ఇటువంటివాళ్ళతో సంబంధానికి ఇష్ట పడతాడా ?''

ఆలోచనలతో బుర్ర వేడెక్కి-పోయింది.

అక్కడికీ ధైర్యంచేసి అమ్మతో చెప్పాడు తను — ఇలా సుభద్ర అనే అమ్మాయిని చేసుకోవా లని ఉన్నదని. కాని అసలు జరిగిన విషయం మాత్రం చెప్పలేదు. అయినా ఆ చెప్పినంతవరకే కొంప లంటుకున్నాయి. నాన్నగారు శివ తాండవం చేశారు. అమ్మ ఏడుస్తూ "అక్కయ్యకూతుర్ని చేసుకుంటా వని అందరం ఆశపెట్టుకున్నాం నీమీద. అలా చేస్తే అక్కయ్య ఆత్మకి శాంతి కలుగు తుంది. పద్మకూడా నిన్నుతప్ప ఇంకెవ రినీ చేసుకో నంటోంది. ఇప్పుడు దాని గతేం కావాలి ?" అంది.

"మావయ్యా, నువ్వు నాకింత అన్యాయం చేస్తావని కలలో కూడా అనుకోలేదు...పోనీలే, నువ్వయినా సుఖపడు'' అంటూ నున్నని బుగ్గల మీదుగా కన్నీళ్ళు కార్చింది పద్మావతి.

వీళ్ళందరిమధ్యా తను ఓడిపోయాడు. దీనంతకీ ముఖ్యమయిన కారణం — తనకి కూడా తన నిర్ణయాన్ని గురించి అంతగా పట్టుదల లేకపోవడం కావచ్చును.

మొత్తానికి పద్మావతితో తనకి పెండ్లి అయిపోయింది. కొన్నాళ్ళలో సుభద్రని పూర్తిగా మర్చిపోవచ్చు ననుకున్నాడు — కాని తను అక్కడే పొరపడ్డాడు !

'ఈర్ష్య' అన్నది ఆడదాని సొత్తు అన్నమాటని పద్మావతి నిజం చేసింది. తను ఇంకా మనస్సులో సుభద్ర నే ఆరాధిస్తున్నట్లు అనుమానపడసాగింది. చీటికీ మాటికీ సుభద్రవిషయం తెచ్చేది. తనేమయినా కొద్దిగా విసుక్కుంటే "మీ సుభద్ర అయిఉంటే మిమ్మల్ని విసిగించేదికాదు కదూ'' అనేది. ''నేను మిమ్మల్ని అన్యాయం చేశాను. సుభద్ర అయుంటే మిమ్మల్ని ఇంతకన్న సుఖ పెట్టేది'' అటుండేది.

ఇలా ప్రతి మాటకి సుభద్ర పేరు తెచ్చి ఆమెని తనతో పోల్చుకొనడంతో అనుకోకుండానే తనకి తనే ఎంతో చెరుపు చేసుకుంది పద్మావతి. ఆమె ఆ మాటలు అనగా అనగా తనకి కూడా అనిపించ సాగింది ''సుభద్రని చేజేతులా ఒదులు కుని జీవితంలో నష్టపోయానా ?" అని. అయినా ఆ ఆలోచనని సాధ్యమయినంత వరకు దూరంగానే ఉంచుదా మని ప్రయ త్నించేవాడు. కాని పరోక్షంగా పద్మావతే

తనని బలహీనుడ్ని చెసింది ఆ విషయంలో.

తను అనేవాడు కూడా - "అనవసరంగా నువ్వు అనుమాన పడుతున్నావు పద్మావతీ. నా మనస్సు ఇంకా ఆ అమ్మాయి మీదే ఉండినట్లయితే నిన్నెందుకు చేసుకుంటాను ? ప్రతి మగవాడు బ్రహ్మచారి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు పెడదారి పడతాడు. దాన్ని దిద్దుకునేందుకు మన స్ఫూర్తిగా ప్రయత్నిస్తున్న నాతో సహకరించు. అంతేగాని ప్రతిసారి ఆ అమ్మాయి పేరు తేవడం వలన ఇద్దరికీ ఉపకారం జరగదు" అని.

వెక్కి వెక్కి ఏడ్చేసేది !

అదే ఆమె మనస్సులో ఒక దిగులుగా ఏర్పడిపోయి ఆమె ఆరోగ్యాన్ని హరించేసి మంచం పట్టించింది. తన శక్తి వంచన లేకుండా పద్మావతిని నమ్మించేందుకు ప్రయత్నించాడు. కాని తన ప్రతి కదలిక పట్ల అనుమానపడేదాన్ని తృప్తి పరచడం తన తరం కాకపోయింది.

అసలే అర్భకం మనిషి. చిన్నతనం లోనే తల్లిపోవడం వలన అతిగారాబంగా పెరిగినది కావడాన మంకుతనం కూడా అబ్బింది. అందుకే తన కున్న అనుమానం పునర్విమర్శించుకోకుండానే తన నిండు జీవితాన్ని పాడు చేసుకుంది చివరకి.

"ఇన్నాళ్ళు మిమ్మల్ని అనవసరంగా అనుమానించానని తెలుసు నాకు. కాని నాలోని బలహీనతలే నన్ను పాడు చేశాయి. నన్ను క్షమించండి. ఏనాటికయినా సుభద్ర మళ్ళీ మీకు తటస్థపడితే ఆమెని స్వీకరించండి. ఇదే నా కోరిక" అంటూ తన జీవితంలోంచి నిష్క్రమించింది.

జాలిగా రెండు కన్నీటి బొట్లు రాల్చాడు.

అయిదు సంవత్సరాల తమ దాంపత్య జీవితంలో ఇద్దరూ సుఖపడింది లేదు. లేనిపోని అనుమానాలతో పద్మావతి బాధపడుతుండేది. తాను ఆమెని ఎలా సమాధాన పరచాలో తెలియక సతమతమవుతుండేవాడు.

ఆమె పోయి అప్పుడే పదిహేను సంవత్సరాలయింది. ఈ మధ్య కాలంలో చాలామంది తన్ని మళ్ళీ గృహస్థుగా మార్చే ప్రయత్నం చేసి విఫలులయారు. తన తల్లికూడా "నీ ఇష్టం వచ్చినదాన్ని చేసుకోరా పోనీ - ఆడపిల్ల ఇంట్లో తిరగనిదే సిరికూడా ఉండదు" అనేది. తాను మాత్రం నవ్వి ఊరుకునేవాడు. ఇప్పుడు అలా చెప్పేందుకు ఆవిడకూడా లేదు. తాను ఏకాకి !

తన మనస్సులో మాత్రం ఎప్పుడూ సుభద్ర,పద్మావతి మెదులుతూ ఉంటారు. పద్మావతి ఉండగా తనలో కలిగించిన అభిప్రాయం ఇప్పుడు బాగా బలబడిపోయింది. అది – "సుభద్రని చేసుకుని ఉంటే నిజంగా సుఖపడి ఉండేవాడిని" అన్నది.

ఇన్ని ఏళ్ళుగా ఒక్కమారైనా విన లేదు ఆమెని గురించి. నిజానికి పద్మావతి ఉన్న రోజుల్లో సుభద్రని గురించి తెలుసుకో దలుచుకో లేదు కూడా. కాని ఆమెపోయాక సుభద్రకోసం విచారించాడు. ఆమె ఉనికిని తెలుసుకునేందుకు తీవ్రంగా ప్రయత్నించాడు కాని లాభం లేకపోయింది. ఆమెను గురించి తాను తెలుసుకోగలిగినదల్లా — సుభద్ర హటాత్తుగా ఇంట్లోంచి అదృశ్యమయిం దని. తరువాత కొన్నాళ్ళకి ఆమె తల్లికూడా ఇల్లు అమ్మేసి వెళ్ళిపోయిం దని. మరి వా రిద్దరూ కలుసుకున్నారో లేదో తెలియలేదు.

ఆ సుభద్ర ఈనాడు తనకి హటాత్తుగా కనిపించి మళ్ళీ మాయమయింది. కోర్టు హాల్లో అగపడిన మనిషి ఎప్పుడు వెళ్ళిపోయిందో, తరువాత తాను చూస్తే లేదు.

సుభద్రకోసం త నెందుకు వెతికాడు అంటే_...

తలుపు చప్పు డయింది. మొదట గాలేమోననిఅనుకున్నాడు. కాని భద్రయ్య వచ్చి "అయ్యగారూ, తమరి కోసం ఏవరో వచ్చినారండి. హాల్లో కూర్చుండ బెట్టినా" అన్నాడు.

గభాలున నైట్‌గౌను వేసుకుని హాల్లోకి వెళ్ళాడు.

ఆమె లేచి నుంచుని నమస్కరించింది.

"సుభద్రా!'' అన్నాడు. ఆశ్చర్యంగా.

ఆమె చిన్నగా నవ్వుతూ "అవును నేనే. ఇంకా మీకు గుర్తుండడం నా అదృష్టం'' అంది మెల్లిగా.

"కాని సుభద్రా, ఆశ్చర్యపోవడం పొద్దున్నే అయిపోయింది. అసలు నువ్వు కాదేమోనన్న అనుమానం కూడా కలిగింది" అని కాసేపు తటపటాయించి "ఎక్కడ ఉంటున్నావు ?'' అనడిగాడు.

"షుమారు ఇరవయి ఏళ్ళ తరువాత ఇప్పుడు మళ్ళీ మీ ఎదట ఉన్నాను చాలదా ?" అంది దిగులుగా నవ్వుతూ.

ఆనందరావుగారు తలవంచేసుకున్నాడు. "నేను క్షమించరాని అపరాధం చేశాను సుభద్రా నీ పట్ల. నీ జీవితం ఏమయిపోతుందోనన్న ఆలోచనయినా లేకుండా నా దారి నేను చూసుకున్నాను. పిరికివాడిని. స్వార్థపరుడ్ని!"

"సర్లెండి, అయిపోయిన దానికి ఇప్పుడు మనం విచారపడడం దేనికి ? ఒక ఆడది పాడైపోయిం దంటే ఆ పాపంలో మగవాడికి ఎంతభాగం ఉందో ఆడదానికీ అంతా ఉంటుంది. ఒక్కర్ని విడిగా నిందించకూడదు ... అప్పుడు తప్పు చేసినది కేవలం మీ రొక్కరే కాదు_నేనుకూడా ! కాకపోతే మగవాడు అదృష్టవంతుడు. ఆడది మాత్రం ఆ తప్పుయొక్క గుర్తుల్ని శాశ్వతంగా భరించాలసి ఉంటుంది. అందుకని ఆ సంగతి గ్రహించే ఆడదాన్ని అదుపాజల్లో పెట్టా లనడం మనవాళ్ళు...

మీకు నే నేదో పాఠాలు నేర్పుతున్నట్లు మాట్లాడుతున్నాను కదూ ?''

ఆనందరావుగారు ఆమె మాటలు వినిపించుకోలేదు. "నీకు మనస్సుకి కష్టం కలగకుండా ఉంటే ఒక్కమాట అడుగుతాను. నేను నిన్నలా అర్ధాంతరంగా వదిలేసి వెళ్ళిపోయాక నన్ను తిట్టుకుని ఉంటావుకదూ ?''

"తిట్టుకున్నాను. కాని మిమ్మల్ని కాదు—నన్ను నేను. మిమ్మల్ని మన స్ఫూర్తిగా నమ్మడం నా తప్పు కాదూ మరి!...చాలా రోజులదాకా ఇంకా మీరు వస్తారనే ఆశతో ఎదురు చూశాను. కాని నిరాశే వరించింది నన్ను. రోజులు గడుస్తున్న కొద్దీ నా శరీరంలోని మార్పులు నాకే కొట్టవచ్చినట్లు కనబడ సాగాయి. అమ్మకూడా ఏదో అనుమాన పడుతున్నట్లు నావంక చూసేది. కాని బహుశ అడిగేందుకు ధైర్యం చాలేది కాదనుకుంటా. లేకపోతే తన జీవితంలో తాను చేసిన పొరబాటే కూతురు చేసిందని తెలిసికూడా ఆ అనుమానాన్ని ధృవపరుచుకుని పరిస్థితిని ఎదుర్కొనేందుకు శక్తి చాలకనో ఏమో మొత్తానికి మాట్లాడేది కాదు..దీనికితోడు మన విషయం తెలిసిన మీ స్నేహితులు కొందరు చేసే అల్లరి దుర్భర మయిపోయేది.

"నిజంచెప్పొద్దూ, మొదట ఆత్మహత్య వైపుకి లాగేది మనస్సు – ఏ ఆడదానికయినా ఆ పరిస్థితుల్లో అంతిమ శరణ్యం



"మిద్దెమీది అమ్మాయి ఫ్రెండ్ వచ్చినట్టున్నాడు."

ఆదేగా ! కాని నా కడుపులో కదిలే జీవిని తలచుకుని ఆ ఆలోచనలని మనస్సులోంచి నెట్టేసేదాన్ని. చివరికి ఆ ప్రాణిని

రక్షించి భూమిమీద ఒక వ్యక్తిగా నిలిపేందుకు నిర్ణయించుకుని ఒకరాత్రి ఇంట్లోంచి పారిపోయాను.

"మీరు అమ్మని ప్రోత్సహించి నన్ను కాలేజీలో చేర్పించడం అప్పుడు అక్కరకు వచ్చింది. ఉద్యోగం తేలికగా సంపాయించుకో గలిగాను. నా గతం తెలియనివాళ్ళ మధ్య బ్రతకడం తేలికని పించింది. అక్కడ అందరితోనూ 'నాకు పెళ్ళి అయిందని, కాని భర్తకి చెడు తిరుగుళ్ళ అలవాటయి నన్ను వదిలేశారని' చెప్పేశాను.

"తరువాత అమ్మ పాపం ఒంటరి దయి పోయిందని ఆమెకి ఉత్తరం రాశాను – కులాసాగా ఉన్నాను. మరేం ఫరవాలేదు. ఫలానా కారణంవలన ఇలా వదలి వచ్చేయవలసొచ్చిందనీ, క్షమించమనీ: ముఖతః చెప్పేందుకు లేని ధైర్యం ఉత్తరంద్వారా చెప్పేందుకు వచ్చింది.

"పాపం ఆవిడకూడా కూతురు బ్రతికి ఉంది అదే చాలుననుకుని అక్కడఉన్న ఇల్లు అమ్మేసి నాదగ్గరకు వచ్చేసింది. కాని ఆమెమనస్సులో ఉన్న దిగులు మాత్రం ముఖంలో కనబడేది. బహుశ కూతురు ఇలానాశనం అయిపోయిందని బాధపడుతుండేదనుకుంటా – 'అమ్మాయ్, పోనీ ఎవరినయినా పెళ్ళి చేసుకోరాదటే ఎలాగోలా అయిందని పిద్దాం' అనేది.

"కాని నాకే ఇష్టం లేకపోయింది. ఉన్ననిజాన్ని చెబుతే మనలో ఎవరూ చేసుకునేందుకు సిద్ధపడరు. అథవా ఇష్టపడినా అది మనస్ఫూర్తిగా మాత్రం కాదు. ఇల్లు అమ్మగావచ్చిన డబ్బుచూసో లేక వయస్సులోఉన్న నన్నుచూసో :... కొన్నాళ్లు గడిపి చక్కాపోతారు. ఇక నిజాన్ని కప్పిపుచ్చి చేసుకోవడమంత మహాపరాధం మరొకటి ఉండదు. ఇది మన్ని మనమే మోసగించుకోవటం. ఏనాటికయినా నిజం బయటపడకపోదు.

కాబట్టి నేను అసలు వివాహప్రసక్తి రానిచ్చేదాన్ని కాదు. జీవితంలో ఏదో ఒక్కసారి తప్పటడుగు వేశాను. చరిత్ర చర్వితచరణం కావడం నాకిష్టం లేదు" అని కాసేపాగి నవ్వుతూ "మీరు కట్టకపోయినా మీపేరుతో నేనే మంగళ సూత్రంకూడా కట్టేసుకున్నాను" అంది.

ఆనందరావుగారు ఏమీ మాట్లాడలేదు.

"సరే ఒక కొడుకు పుట్టాడు. అమ్మ మనవడ్ని చూసి మురిసిపోయింది. కాని ఆ ఆనందం ఆమెకి ఆట్టే కాలం దక్కలేదు."

"అంటే?" ఆత్రుతగా అడిగా రాయన

"మా అమ్మ పోయింది. జీవితంలో ఏకాకి నయాను. పైగా నామీద ఓ భారం. వీడిని చూస్తూ రోజూ ఆఫీసులో పడే సూటీపోటీ మాటలు, అండలేని ఆడదాని పట్ల మగవాళ్ళుచూపే తేలికభావం అన్నీ మర్చిపోయేదాన్ని. వాడే నా జీవిత

సర్వస్వం. కొద్దికాలం మాత్రమే అనుభవించిన మధురస్మృతుల చిహ్నం ! నేను ప్రేమించినవారి ప్రతిరూపం !

నాలోని శక్తి నంతా ఒడ్డి వీడిని పెద్దవాడిని చేయాలి. నలుగురిలో 'ప్రయోజకుడు' అనిపించుకోవాలి వాడు. అంతకన్న ముఖ్యం—వాడివల్ల ఎవరూ బాధపడకుండా ఉండేట్లు వాడిప్రవర్తన రూపొందించాలి ! అదే నా ధ్యేయం. అందుకే నా ప్రయత్నమంతా. వాడికి ఏకష్టమూ రానీయకూడదు. అదే నా తపస్సు.

కాని అందులోనూ కొంతలో కొంత అపజయం పొందా ననే ఒప్పుకోవాలి. వాడికోసం నేను సంపాయించి ఇచ్చే ధనంతోపాటు నా గతచరిత్ర కూడా నీడలా వాడిని అనుసరించింది.

ప్రతిచోటా వాడిని ఎదుర్కొన్న మొదటి ప్రశ్న " మీ నాన్నగారి పేరేమిటి ?" అన్నది. వాడిని కుర్రాళ్ళు ఏడిపించా లన్నా అదే ప్రశ్న. వాడు నన్ను అడిగేవాడు అదేమాట — ఏం మాట్లాడను ? ఏమని చెప్పను ?

చిన్నప్పుడు మా అమ్మని గురించి రకరకాలమాటలు నా చెవిన పడుతుండేవి. దుర్మార్గురాలిని వాటిని నమ్మేదాన్ని ! "ఏదో లేనిదే అందరూ ఎందుకిలా చెప్పుకుంటారు ?" అనిపించేది — అమ్మని అనుమానించేదాన్ని. అది స్వానుభవంలోకి వచ్చాక నేను చేసిన పొరపాటు తెలిసివచ్చింది.

కాని ఆ విషయంలో మాత్రం నేను అదృష్టవంతురాలిని. నా కొడుక్కి నా మీద నమ్మకం ఎక్కువ. ఎవరినోట ఏమాట విన్నా నన్ను అనుమానించేవాడు కాదు. వాడు వేసే ఒకేఒక ప్రశ్న "నాన్న ఎవరు ?" అని.

వాడు పెద్దవాడయి యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం వచ్చాక నా కథ అంతా చెప్పాను

"ఏమన్నాడు ?'' అడిగారు ఆనందరావుగారు.

సుభద్ర ఒక్కక్షణం ఆలోచనలో పడింది. ఏమన్నాడో ఎలా చెబుతుంది ?... 'తండ్రి — అనే గౌరవపదం చాటున దాక్కున్నప్పటికీ నేను ఆ వ్యక్తిని క్షమించను, క్షమించలేను. నా కిలా తండ్రి ఎవరో తెలియకుండా ఉండటమే కోరుకుంటాను గాని మానవత్వంలేని అటువంటి మనిషి ఎదట పడటానికి ఇష్టపడను. అదే జరిగితే నే నేమయిపోతానో, ఏం చేస్తానో నాకే తెలియదు. ఆయన ఒకవేళ మళ్ళీ నీ కంటపడినా నాకుమాత్రం చూపించకు.' అన్నాడు తీక్షణంగా అని చెబుతుందా ?...

బయటికి మాత్రం నవ్వేసి "ఏమంటాడు, మీ పేరుకూడ చెప్పమన్నాడు. అవకాశం వచ్చినప్పుడు చెబుతానులే అని సమాధానపరిచాను...స్కూల్లోనూ కాలేజీలోను మంచిమార్కులు రావడం

వలన ప్రతిక్లాసులోనూ స్కాలర్‌షిప్‌లు వచ్చేవి. అందుకనే వాడిని చదివించేం దుకు ఎక్కువగా కష్టపడవలసిన పని లేకపోయింది. అందుకే అంత లక్షాధికారి కూతురయినా ఆ అమ్మాయి సావిత్రి వాడిని ప్రేమించింది !''

ఆశ్చర్యపోయారు ఆనందరావుగారు. "అయితే ఇందాక కోర్టులో...''

''అవును. కోర్టులో మీ అందరిఎదట ముద్దాయిగా నిలబడినవాడే నా కొడుకు — మనవాడు. నే నిపుడు వచ్చింది ఆ విషయం చెబుదా మనే!''

కా సేపు ఎవరూ మాట్లాడలేదు. మళ్లా ఆవిడే అంది—

"వాడు, సావిత్రి ఒకరినొకరు ప్రేమించుకున్నారు. నేను అక్కడికీ అన్నాను—పెద్దవాళ్ళమీద మనం ఆశలు పెంచుకోకూడదురా—అని. కాని 'సావిత్రి అలాంటిది కాదమ్మా' అనేవాడు. ఆ అమ్మాయిని రెండు మూడు సార్లు మా ఇంటికి తీసుకునివచ్చాడు కూడా. చాలా అందమయిన పిల్ల. అణకువ కలది. వాళ్ళిద్దరినీ చూసి ముచ్చట పడ్డాను. కాని స్వానుభవం ఉండడం వలన కాబోలు వాళ్ళిద్దరి ప్రేమా ఫలిస్తుం దనిపించేదికాదు.

సావిత్రి వీడిని వాళ్ళ ఇంటికి వచ్చి వాళ్ళ తాతగారిని అడుగమందిట పెళ్ళి విషయం—ఆ సంగతి నాకు తెలియదు. వీడు వెళ్ళి ఆయన్ని అడిగేసరికి కులాలు, గోత్రాలు వచ్చి నా ప్రసక్తి వచ్చిందిట. వాళ్ళ అమ్మాయి వీడితో తిరుగుతోం దన్న విషయం ముందే తెలియడం వలన అంతక్రితమే వీడిని గురించి విచారించిన ట్లున్నాడు. సహజంగానే నా గురించి చెప్పదలచుకున్న వాళ్ళకి మంచి అవ కాశం దొరికి దాన్ని వినియోగించు కున్నారు. ఉన్నవి, ఊహించినవి కలిపి చెప్పిఉంటారు.

"మీ అమ్మ అలాటిది — నీ కేమో తండ్రి ఎవరో తెలియదు. పోనీ ఆస్తి అక్కరలేదనుకున్నా నాకు వంశగౌరవం కావాలి. ఏం చూసి నీ కివ్వమంటావు ? నీ తల్లి పేరు, ఆవిడ తల్లి పేరు అన్నీ నాకు తెలిశాయి......"అంటూ వీడిని దులిపేశాడు. దాంతో వీడికి కోపం వచ్చి, ఆయన మీద కలియబడ్డాడు...విన్నదేగా ఇదంతా మీరు.

ఇప్పుడు నేను పుత్రభిక్ష కోసం వచ్చాను మీ దగ్గరకు. వాడివేపు మాట్లా డేందుకు మంచి లాయర్ని పెడదామన్నా నాకు తాహతు లేదు. మీరే దీనికి పూను కోవాలి. నా కొడుకుని నాకు దక్కిం చండి. ఇందువలన మీ పరువు ప్రతిష్ఠలకి భంగం కలుగుతుం దని భయపడకండి. అటువంటి పను లేవీ నేను చేయను. మీ రెవరో ఎవ్వరికి చెప్పను. ఇప్పుడు రావడం కూడా ఎవ్వరూ చూడకుండానే వచ్చాను. నాకు వాడిని దూరం కానీయ కండి'' అంది. అలా అంటూంటే ఆమె

కండ్లు, నీళ్ళతో నిండిపోయాయి. గొంతు పూడుకుపోయింది.

ఆనందరావుగారు ఇంకా ఆశ్చర్యం నుంచి కోలుకోలేదు సరిగా — "వాడు నా కొడుకా! నాకూ ఒక కొడుకున్నా డన్నమాట! ఒక భార్య ఉందన్నమాట! నేను ఒంటరివాడిని కాదన్నమాట!" అనుకుంటున్నాడు మనస్సులో.

అంతలోనే ఒక నిర్ణయానికి వచ్చేసి "పిచ్చిదానా—నీ కెంత బాధ్యత ఉందో ఆమాత్రం నాకూ ఉంది. నువ్వు 'పుత్ర భిక్ష' అంటూ నన్ను యాచించటానికి వచ్చావు కాని నా దగ్గరనుంచి ఏం కావలసినా అడుగగలఅధికారం నీ కుంది. చెప్పాగా, నిన్ను అన్యాయం చేసినందుకు నేనూ ఏమీ సుఖపడలే దని!

"ఇంత ఆస్తి వున్నా నేను 'ఏకాకినే' అన్నభావం అనుక్షణం కలుగుతుంటుంది నాకు. కాని ఇక అదంతా గతం. ఇక ముందు...సరే, సరే అవన్నీ తరువాత ఆలోచిద్దాం. ముందు వీడిసంగతి చూడాలి. వీడికి వచ్చిన భయ మేమీ లేదు. మొదటి విషయం—కేసు మరేమంత పెద్దది కాదు. ఇక లాయర్లంటావు— పెద్దపెద్ద వాళ్ళంతా మన చేతుల్లోని వాళ్ళే. అదీ కాక... అదేమిటి ఛ ఛ కళ్ళు తుడుచుకో" అని ఒక్క క్షణం తటపటాయించి తనే ఆమె పయటచెరుగుతో కళ్ళద్దారు.

"చూశావూ-కాని ఒక్క-షరతు. కేసు పూర్తియి వాడు విడుద లయ్యాక నేను ఫలానా అని వాడికి చెప్పాలి నువ్వు. వాడి నిర్ణయానికి తల ఒగ్గుతాను."

* * *

అసలు మొదటినుంచీ కూడా కేసు చాలా తేలికయిం దన్న నమ్మకం ఉంది ఆనందరావుగారికి. దానికితోడు సావిత్రి-ముందు తన తాతగారే అతన్ని, అతని తల్లిని నానా మాటలు అన్నా డనీ, అక్కడికి తను ఆయన్ని వారించేందుకు ప్రయత్నించిం దనీ, అయినా లాభం లేక పోయిం దనీ, కేవలం ఆయన మాటలకి కోపం వచ్చి గోపాలరావు ఆయన్ని కొట్టా డనీ చెప్పింది. వాళ్ళ ఫామిలీ డాక్టరు కూడా అంతక్రితం నుంచే ముస లాయన జబ్బులో ఉన్నట్టు అదే ముదిరి మరణానికి దారి తీసిఉంటుం దని అభిప్రాయం వెలిబుచ్చాడు.

ఇకతనకి వ్యక్తిగతంగా ఉన్న పలుకు బడి వినియోగించవలసిన పని పెద్దగా లేకపోయింది ఆనందరావుగారికి.

ఇంటిదగ్గర కూర్చున్నా రన్న మాటే గాని ఆనందరావుగారికి కాలు నిలవడం లేదు. మాటి మాటికీ టైము చూసు కుంటున్నా డాయన. "ఇంకోఅరగంటలో రావాలిమరి" అనుకున్నారు గడియారాన్ని మరోమారు సంప్రతించి.

"మీరు పదండి. ఏ విషయమయినా హటాత్తుగా చెప్పకూడదు. నేను నిదానంగా చెప్పి మీ దగ్గరకు తీసుకు

వస్తాను'' అంది సుభద్ర విడిపోయే ముందు

"మీరిద్దరూ నన్ను క్షమించి ఇకమీదట నేను చెప్పినట్లు చేయాలి'' నవ్వుతూ అని ఇంటికి వచ్చేశా డాయన.

తను ఇకముందు ఏంచేయాలి? ఇలా హటాత్తుగా "ఈవిడ నా భార్య. వీడు నా కొడుకు" అంటే ఒప్పుకుంటుందా లోకం? మరింకేం చేయాలి? ఎలా ఈ సమస్యను పరిష్కరించడం. తనని ఏమనుకుంటారు?...తనగురించి ఏమనుకున్నా తను భయపడడు. ఇతరులకి భయపడడం జీవితంలో ఒకసారే జరుగుతుంది. స్వసుఖాన్ని బలిచేయడం అనేది కూడా అంతే! తనిక వంటరిగాడుకాదు. ఇంటికి వస్తే ఎదురుచూస్తూ ఒక భార్య ఉంటుంది. చేతి కందిన...

తలుపు చప్పుడు ఆలోచనలకి అంతరాయం కలిగించింది. నిజానికి ఆ అంతరాయం మనస్సుకి కష్టం కలిగించింది కాకపోగా ఆనందకర మయినది.

గబగబ వెళ్ళి తలుపు తీశా రాయన.

ఎదురుగా గోపాలరావు నిలబడి ఉన్నాడు — ఒంటరిగా!

ఒక్క-క్షణం అతనివంక చూసి నిశితంగా తనవంకే చూస్తున్న అతని చూపుకి తట్టుకోలేక తల తిప్పేసుకుంటూ "రా, రా, లోపల కూర్చుందాం'' అన్నారాయన కొద్దిగా ఖంగారుపడుతూ.

అతను మాట్లాడకుండా ఆయన్ని అనుసరించి ఆయన వెనకనే వచ్చాడు లోపలికి.

ఆనందరావుగారు వెనక్కి-తిరిగి అతనింకా తనవంకే తీక్షణంగా చూస్తూండడం, నిలబడే ఉండడం గమనించి ''కూర్చో. మీ అమ్మ రాలేదూ?'' అనడిగాడు గోడవైపుకి చూపు తిప్పుకుని.

"చెప్పవలసిన దంతా చెప్పింది. అందుకే వచ్చాను'' అన్నాడు గోపాలరావు విసురుగా.

"అయితే—''

''అవును. ఇన్నాళ్లూ ఏ వ్యక్తి నాకు తారసపడకూడ దని భగవంతుణ్ణి ప్రార్థించానో ఆ వ్యక్తి ఎదటే నిలబడి ఉన్నా నని తెలుసు. నేను దేనికయితే భయపడ్డానో అదే చేయబోతున్నా ననికూడా తెలుసు.''

అతని మాటలోని తీవ్రతకి చిన్నబుచ్చుకున్నాడు ఆనందరావు. "సహజమే నువ్వు అన్నమాటలు! నాలాటివాడిని సాధారణంగా ఎవరూ క్షమించలేరు. నేను మీ యిద్దరిపట్ల తీరని అపచారం చేశాను. అందుకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాప్పడుతున్నాను."

"కాని లాభంలేదు సర్వనాశనం అయాక 'చేసింది తప్పు' అంటే క్షమించేంత సహనం మా అమ్మకి ఉండొచ్చు—ఆవిడ అడదయి పుట్టింది కాబట్టి. కాని మగవాడికి అంతటి విశాల హృదయం, సంస్కారం లేవన్న మాట మీకూ తెలుసు!

"నా జీవితంలో గడిచిపోయినంత వరకు అవమానాలనే ఎదుర్కొన్నాను. డబ్బుకి మా అమ్మ నా కేనాడూ లోపం చేయలేదు. కాని ప్రత్యక్షంగా నా కేనాడూ ఉపకారం చేయకపోయినా మీరు నాకు కావలసినంత అపకారం చేశారు... ఏమిటో, నాతండ్రి ఎవరో తెలియనంత మాత్రాన నా కేమీ వ్యక్తిత్వం లేనట్లు ప్రతివాడూ ఆ ప్రశ్నే వేసేవాడు. తెలియని రోజుల్లో వెంటనే అమ్మని ఆ ప్రశ్న అడిగి నేను పడిన బాధని ఆవిడకి బదిలీ చేసేవాడిని. కానీ ఆవిడ పరిస్థితిని అర్థంచేసుకున్న తరువాత అందరినీ ఎదిరించి నిలబడడం నేర్చుకున్నాను — రాటు దేలిపోయాను. ఇరవయి సంవత్సరాల నా జీవితంలో మీ మూలంగా నేను బాధపడవలసి రావడంవలన మిమ్మల్ని మనస్ఫూర్తిగా ద్వేషిస్తున్నాను. ఎప్పటి కయినా ఇటువంటి సమావేశం తటస్థ పడుతుందేమో నని వణికి పోయాను. కారణం — ద్వేషం దాచుకోవడం నాకు చేతకానిపని ! నేను నటుడ్ని కాను — ఆవేశపరుడుని !

"ఇది చాలద న్నట్లు సావిత్రి వాళ్ళ తాతయ్య వ్యవహారం వచ్చింది. సరే కోర్టువారు క్షమించినా నా సావిత్రి నన్ను క్షమించలేదు. 'తన ఆత్మీయుడి మీద చేయిచేసుకున్న వ్యక్తితో కాపరం చేయడం ఆడదాని సహానానికి మించిన పరీక్ష' అంది.

"నేను జీవితంలో ఆరాధించే వ్యక్తులు ఇద్దరు—సావిత్రి, అమ్మ. సావిత్రి అలా శాశ్వతంగా నాకు దూరం అయిపోయింది. ఇక అమ్మకూడా నాకు మిగలబోదు..

"మనదేశంలో ఆడవాళ్ళకి సుకుమార హృదయాలు పెట్టి వాళ్ళని నానా బాధలు పడమని, అలా పడుతూ కూడా 'భర్తే దేముడు' అని ఎలుగెత్తి చాటమని దేముడు శపించాడు. ఇరవయి సంవత్సరాల పాటు తన ఊసయినా పట్టించుకోని వ్యక్తి ఇప్పుడు క్షమించమనే సరికి అమ్మ ఉబ్బి తబ్బిబ్బయి పోయింది. మీతో జీవించేందుకు సిద్ధంగా ఉంది.

"ఇది నేను సహించలేను. అమ్మ ప్రేమకి ఇన్నేళ్ళుగా నేను ఒక్కడినే వారసుడ్ని. ఇప్పుడు అది పంచి ఇవ్వ లేను. నా సావిత్రిని పోగొట్టుకుని, అమ్మని దూరం చేసుకుని నేను బ్రతక లేను. అందుకనే..."

"అందుకనే......" సంశయంతో అడిగారు ఆనందరావుగారు.

"ఈ భూమిమీద మనిద్దరిలో ఒక్కరు మాత్రమే బ్రతకాలి'' ఉద్రేకంతో అని పిస్టల్ బయటికి తీశాడు గోపాలరావు.

చలించిపోయారు ఆనందరావుగారు. ఒక్కక్షణం మౌనంగా ఉండి. "నన్ను క్షమించలేవా ?" అన్నాడు బాధగా.

''ఉహూ: నా తరం కాదు. మిమ్మల్ని మనస్ఫూర్తిగా ద్వేషిస్తున్నాను.''

"సరే, ఇన్నాళ్లూ మీ అమ్మ, నువ్వు

కలిసి జీవించారు. ఇప్పుడుకూడా అలాగే చేయండి."

"ఆనిర్ణయంతోనే నేనూ వచ్చాను. మా అమ్మ ఇప్పటికే చాలా కష్టాలు అనుభవించి జీవితంలో అలసిపోయింది. నీలాటివాడి చేతిలో ఆమెను వదిలి నేను నిశ్చింతగా చావలేను. అందుకనే ఇప్పుడు నిజంగా హంతకుడి నవదలుచుకుని స్నేహితుడి దగ్గర ఇది అడిగి తెచ్చాను."

హడావుడిగా సుభద్ర లోపలికి పరుగెత్తుకుంటూ వచ్చి అక్కడి దృశ్యాన్ని గుమ్మంలోంచే చూసి గ్రహించుకుని స్థంభించిపోయింది –

"గోపీ, ఏమిటది—ఆయన మీ నాన్నగారురా! నిన్నివాళ రక్షించినాయన" అని అరుస్తూ దగ్గరసా వచ్చింది.

"లాభం లేదమ్మా – అంతా అయిపోయింది. ఈయన రాకతో మన సంసారంలో అశాంతి రేగింది" అంటూ పట్టుదలగా పిస్టల్ ఎత్తిపట్టుకున్నాడు.

సుభద్ర కోపంతో వణికిపోయింది. "అయితే నీ మాటే నీదికాని వాస్తవాన్ని గ్రహించ వన్నమాట. ఒక్కటి మట్టుకు గుర్తుంచుకో. ఆడదానికి కొడుకు కన్న భర్తే ఎక్కువ. నువ్విలా ప్రవర్తిస్తావని తెలిసి జాగ్రత్తపడి వచ్చాను" అంటూ చేయెత్తింది – ఆమె చేతిలోని కత్తి తళుక్కున మెరిసింది......

గభాలున ఆనందరావుగారు గోపాలరావుని పక్కకి లాగేసి అతని స్థలం లోకి తను వెళ్ళి 'అబ్బా' అంటూ కుప్పగా కూలిపోయాడు. ఆయన షర్ట్ రక్తంతో తడిసిపోతోంది.

సుభద్ర కెవ్వున కేకేసి ఆయన్ని గట్టిగా పట్టుకుని "నావి పాపిష్టిచేతులు' అంటూ ఏడవసాగింది.

అంతవరకు జరిగినది తెలియని గోపాలరావు గ్రహించుకుని దిగ్భ్రాంతుడయిపోయాడు. క్షణంలో తనని రక్షించిన ఆయనపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది అతని మనసు.

"నాన్నా" అన్నాడు ఖంగారుగా

బీటలు వారిన నేలమీద తొలకరించినట్లయింది ఆనందరావుకి. ఆశగా అతని వంక చూశాడు.

"అవును నాన్నా, నన్ను క్షమించండి. మిమ్మల్ని అపార్థం చేసుకున్నాను"

"ఛీ దుర్మార్గుడా – ఆయన్ని పొట్టనెట్టుకునేందుకు సిద్ధపడ్డవాడివి నువ్వు. నా కంటికి కనబడకు" అంది ఏడుస్తూనే సుభద్ర కోపంగా.

ఆనందరావుగారు మాత్రం "ఇదుగో సుభద్రా, వాడిని పొమ్మంటే నన్నూ అన్నట్టే – ఎందుకంటే ఇకనుంచి మేమిద్దరం ఒకటే కాబట్టి!" అని నవ్వి "ఖంగారు పడకు, దెబ్బతగిలింది చేతికి మాత్రమే. వెంటనే నయమయిపోతుంది" అన్నాడు.

గోపాలరావు ఆనందంతో గబగబ టెలిఫోన్ దగ్గరకు పరుగెత్తాడు—డాక్టరు కోసం.




"రాకరాక - మమ్మల్ని చూడాలని కాకపోయినా కనీసం వ్యాపారపు మిషతోనన్నా వచ్చావు. ఆ వ్యాపారం మొదటి రోజునే పూర్తయింది కనుక మర్నాడే వెళ్తానని కూర్చున్నావు! కనీసం మూడు నిద్దర్లయినా చేయందే వెళ్ళేందుకు వీల్లేదు!" అని మిత్రబృందంలోని నలు

గురూ బలవంతం చేయటంతో రాజు ప్రయాణం నాలుగోనాటికి వాయిదా పడకతప్పలేదు.

మిత్రులన్న మూడు నిద్దర్లూ ఆహ్లాదకరంగా వెన్నెల రాత్రుల్లో పరదేశాల్లో తయారైన అమృతోపాసనలో హాయిగా దొర్లిపోయినవి. ఉమ్మర్ ఖయ్యాం అడుగుజాడల్లో కాలం గడిపి, ఆ మహానుభావుడి వేదాంతసారాన్ని సరాసరి రక్తంలోకి ఎక్కించుకోవటం జరిగింది. అవతలి తొందరిపనుల తొందర వేధించకపోతే మరో పదినిద్దర్లన్నా చేసిఉండేవాడే-రాజు. ఆదర్శాలకూ, నిత్య జీవిత విధానానికీ లంకెలు కుదరని దుస్థితిలో నాలుగోనాటి మెయిల్‌కు ప్రయాణపు ఏర్పాట్లు జరిగినవి.

అదృష్టవశాత్తూ ఫస్ట్‌క్లాస్ కూపే కంపార్ట్‌మెంట్‌లోని లోయర్ బెర్త్ రిజర్వేషన్ రాజుకు దొరికింది. అప్పర్ బెర్త్‌లో అప్సరసలాంటి నవయవ్వని ఉంటే ఇక ఆ ప్రయాణపు రాత్రికూడా ఉమ్మర్ ఖయ్యాం అపర అవతారంగా ఆ రాత్రి గడుస్తుందికదా అని ఎంతో సంబరపడ్డాడు రాజు.

మెయిల్ దగ్గిరికి వెళ్లేదాకా అప్పర్ బెర్త్ పాసింజర్ విషయం తేలదు. ఒకవేళ మరో 'మొగపురుగే' తనకు పైభాగాన ఉండే పరుపులమీద పవళిస్తే - కనీసం ఉమ్మర్ ఖయ్యాం వేదాంతసారంలో సగమన్నా అనుసరించే అవకాశాన్ని జారవిడువరాదు. మద్రాసులో వ్యాపారపు చికాకుల్లో సరైన స్థలమూ, తగిన మిత్రులనండూ రెండూ కరువైనందువల్ల తన సరదాలన్నీ యీ దూరతీరంలోనే తీరే అవకాశం పుష్కలంగా ఏర్పడింది. ఈ సదవకాశాన్ని ఏవిధంగానూ దుర్వినియోగపరుచుకోని తృప్తి ఉన్నది. మిత్రులన్న మూడునిద్రలనూ, యీ నాలుగోనిద్ర రైలులో. ఆ మూటికి కొంతసరకన్నా తోడుగా గడుపుతే మంచి దనిపించింది.

ఐతే ఈ ప్రభుత్వ చట్టాలు తననూ, తనలాంటి లక్షలాది పౌరులను చట్రంలో చట్టంపేరిట బిగించివారేసినవి. కన్నుగప్పి చేజిక్కించుకున్నదే దక్కుదల! స్వతహాగా రాజు చట్టవిరుద్ధంగా ప్రవర్తించే సద్గుణమున్న వ్యక్తి కాడు. కాని వ్యక్తిగతమైన వాంఛలు తీరేందుకు కొన్ని సందర్భాలలోనన్నా వేరువిధంగా నడవక తప్పదు మరి!

అందుకని ఆ ఫారిన్ జిన్ సేవిస్తూ ప్రయాణపు బడలిక తెలియరాకుండా ఆ రాత్రి రైలులో గడిపేందుకే నిశ్చయించుకున్నాడు - రాజు. ఇటువంటి అసలు సరుకు చవిచూసి ఎన్నాళ్ళు - ఎన్నేళ్ళయిందో! చెల్లించే వెలకూడా అత్యధికమేం కాదు. వేగంగా

ప్రయాణం చేస్తూ ఈ 'సుధ'ను సేవిస్తూంటే అదొక నూతనానుభవం కూడాను! ఎటొచ్చీ ఎవరికంటా పడకుండాను, తాగి పట్టుబడకుండానూ సమర్థించుకోగలిగితే మ రే ఇబ్బందీ ఉండదు.

అసలే ఫస్ట్‌క్లాస్! తలుపులు బిడాయించుకొని కూర్చుంటే రాత్రిపూట మరెవ్వరూ - చివరకు టికెట్ చెకింగ్ వాళ్ళుకూడా డిస్టర్బ్ చేయరు. కూపే కంపార్ట్‌మెంట్ కనుక తాను కన్ను కప్పాల్సింది-మరొక్క ప్రయాణీకుణ్ణిమాత్రమే!

ముఖ్యంగా ఇటీవలనే వ్యాపారంలో విపరీతమైన లాభాలు వచ్చి ఉండటంవల్ల దేశాచారాన్ని అనుసరించి, ఆ ముదనష్టపు సొమ్ములో కొద్ది భాగం పడుకొండలవాడికి అనుకున్న ప్రకారం మొక్కు చెల్లించుకోవటమే గాక, నెత్తిన ఉన్న బొచ్చుకూడా సమర్పించుకున్నాడు. భారీగా, హుందాగా, కళకళ్ళాడుతూండే తన స్వరూపానికి యీ బోడిగుండు చంద్రునిలో మచ్చవలె తోచటంతో, మళ్ళీ బొచ్చు పెరిగేదాకా దాన్ని కప్పిఉంచేందుకు గాంధీ టోపీ కొనుక్కున్నాడు. యీ కొత్త అవతారం నిజంగానే తన పెద్దమనిషితనాన్ని ఎన్నోరెట్లు పెంచింది.

''ఎవరో గొప్ప కాంగ్రెస్ నాయకుడు ఓట్ల ముష్టికి బయలుదేరినట్లు-'' అన్నారు ఇక్కడి మిత్రులు తనను చూడగానే! ఏ పవిత్రోద్దేశంతో బాపూజీ యీ టోపీని కనిపెట్టినప్పటికీ, దీని బురఖాలో మంత్రుల దగ్గిర్నుంచీ మిండగాళ్ళ వరకూ అందరూ దేశోద్ధారకుల్లాగే కనిపించే ఏర్పాటూ, సహనత్వాన్ని నిరూపించే అద్భుత శక్తి మేళవించింది! దీని చాటున ఎంత పెద్ద తప్పయినా ఒప్పుగానే భ్రమింపజేసే గోసాయి చిట్కా ఉండనే ఉన్న'దనే విషయం మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ స్వతంత్రంగానే తెలుసుకునే అనేక సందర్భాలు తెలుసుకోనివారు అరుదు! ఈ టోపీ ప్రపంచానికే పెద్ద టోపాగా పరిణమించింది! బోడిగుండును కప్పేందుకే వాడుకున్న గాంధీటోపీ తాలూకు వివిధాలైన ఉపయోగాలు ఇప్పుడు రాజు జీవితంలో తారసిల్లినవి. మొట్టమొదటిసారి పూజ్య బాపూజీకి మనస్సులోనే అనేక నమస్కారాలూ, ధన్యవాదాలూ అర్పించుకున్నాడు-రాజు!

ఈ రూపంలో తానొక కాంగ్రెస్ నాయకుడల్లే కనిపించటంవల్ల తనను ప్రస్తుతానికి ఈశ్వరుడు కూడా పట్టలేడు-సందేహించలేడు!

బుడ్లు బుడ్లుగా వెంట తీసుకొని

వెళ్లటం ఎంత కాంగ్రెసు నాయికుడికైనా తగని పని అని తెలుసుకొన్న రాజు- రెండు పెద్ద ప్లాస్టిక్ వాటర్ బాటిల్స్ కొని వాటి నిండా జిన్ నింపుకొని ప్రయాణంలో దాహం (!) తీర్చుకొనే మొదటి తరగతి ప్రయాణీకుడల్లే చూపరులకు తోచే విధంగా అన్ని కోణాల్లోనూ జాగ్రత్త పడ్డాడు ! జిన్ మంచినీళ్ళలాగే ఉంటుంది కనుక చూపులతో దాన్నెవరూ పట్టుకోలేరు !

## 2

బండి బయలుదేరేందుకు అరగంట ముందరే వచ్చి లోయర్ బెర్త్ మీద బెడ్డింగు పెట్టించి, సామానులు కింద తోయించి, పరమ పవిత్రమైన గంగాజల మున్న రెండు ప్లాస్టిక్ వాటర్ బాటిల్స్‌నూ ఎదురుగా ఉన్న హుక్స్‌కు తగిలించాడు- రాజు. అప్పర్ బెర్త్‌ను ఆక్రమించేది ఒక మొగపురుగనే విషయం రిజర్వేషన్ కార్డ్‌లో చూసి తన స్వప్నం సగం భంగమయినందుకు, విచారమూ, మిగతా సగమన్నా సత్యమైనందుకు సంతోషమూ కలిగాయి అతనికి.

మిత్రులతో జోక్స్ వేస్తూ ప్లాట్‌ఫారమ్ మీదనే నిలబడి వన్నెల విసనికర్రలు చూపుమేర దూరంలో కనిపిస్తారేమో నని గుచ్చి గుచ్చి నలువైపులా పరికించసాగాడు రాజు. ఎక్కడన్నా అల్లంత దూరాన అలాటి అందాల రాసులు చూపులకు తగిలినా వాళ్లను తలుచుకొని లొట్టలు వేయటం తప్ప చేసేది ఏమీ లేదనే విషయం మనస్సులో కలుక్కుమంటూనే ఉన్నది.

బండి బైలుదేరేందుకు మొదటి గంట మోగించారు. తన తోటిప్రయాణీకుని జాడ లేదు. అదీ ఒకందుకు మంచిదే! తానొక్కడే హాయిగా తాగి తందనాలాడుతూంటే తన బొందిని తెల్లారేప్పటికి మద్రాసు జేర్చేందుకు మెయిల్ పరుగెత్తుకొని పోతూనే ఉంటుంది! లేదా తాను ఊహించినట్లుగా ఏ సుందరాంగికన్నా చోటు దొరక్క, ఏ రైల్వే ఆఫీసరో యీ కంపార్ట్‌మెంట్‌లోకి తోస్తే, ఆమెకు టిక్కెట్టున్నా లేకున్నా తాను సంతోష పూర్వకంగా ఆమెను యీ రాత్రికి మాత్రం స్వీకరించి స్వర్గానికి బెత్తెడు తక్కువకు వెళ్ళనూవచ్చు !

ట్రాలీ నిండుగా సామానుతో ఒక ముసలాయన ఆదరాబాదరా వస్తున్నాడు. డార్విన్ థియరీని రుజూ చేసేందుకు అవతరించిన వ్యక్తిగా గోచరించే యీ ముసలాడు తనకు తోటి ప్రయాణీకుడు కాదు కదా ? ఆలోచన తెగక పూర్వమే తన కంపార్ట్‌మెంట్ దగ్గిరే ట్రాలీ ఆగటంతో రాజు ఒక్కనిట్టూర్పు విడిచాడు.



కూలీలు ఆదరాబాదరాగా సామానులు సర్దుతున్నారు. ముసలాయన హడావిడిపడుతూ ఏది ఎక్కడ ఎలా పెట్టాలో పురమాయిస్తూ ఆయాసపడుతున్నాడు. ఆయన తెచ్చిన సామానులు మహా బరువనే విషయాన్ని రుజూచేసేందుకు ఒక్కో పెట్టెను ఇద్దరు, ముగ్గురు కూలీలు కూడా ఎత్తవలసి వస్తోంది.

"పెట్టెలు మెల్లిగా దింపండి.... జాగ్రత్త!.. నీకే చెప్పేది—"అని అరుస్తున్నాడు ముసలాడు.

రెండో గంట కూడా కొట్టారు. ఇంకా సగం సామానులన్నా ఎక్కాల్సి వుంది; ముఖ్యంగా ముసలాయన ఎక్కాలి. బండి బయలుదేరుతే లోపలికి ఉరికేందుకు రాజు సిద్ధంగా ఉన్నాడు. అండర్ గార్డ్ గార్డ్‌కు పచ్చ దీపం చూపుతున్నాడు. గార్డు ఈల వేస్తున్నాడు. యీ ముసలాడు సగం సామానుతో ప్లాట్ ఫారమ్ మీద ఉండిపోవటమూ, ఆయన తాలూకు మిగతా సగం సామానుతోనూ తాను ప్రయాణం చేయవలసి రావటమూ ఊహించుకుంటే రాజుకు చికాకు కలిగింది. ముసలాడిమీద జాలి కలిగింది. కాని అది క్షణికమే!

ఇంతలో ఏం జరిగిందో కాని గార్డ్ ఈల ఆగిపోయింది. పైపెచ్చు ఎర్ర దీపం కనిపించగానే అండర్ గార్డ్ కూడా ఎర్రదీపం వేశాడు. కూత వేసిన ఇంజన్ ఆవిరి వదులుతోంది. డ్రైవర్ ప్లాట్ ఫారంమీద నిలబడిపోయాడు. రణగొణ ధ్వనిగా ఉన్న ప్లాట్ ఫారాన్ని ఒక్కక్షణం నిశ్శబ్దం ఆవరించింది. మెయిల్‌లో ప్రయాణం

చేసే తమ బంధుమిత్రులకు వీడ్కోలు చెప్పేందుకుగాను బైటికి తీసిన జేబు రుమాళ్ళూ, కొద్దికొద్దిగా ఊపు అంకించుకున్నవాటితోసహా అచేతనా లైనవి.

ఇంతలో ఒక పోలీసు ఆఫీసర్ ముసలాయన దగ్గరికి పెద్దపెద్దఅంగలు వేసుకుంటూ వచ్చాడు. ముసలాయన సామానులు తనిఖీకి వస్తూన్న ధోరణి రాజుకు కనిపించింది. అదే నిజమైతే తన సామానులుకూడా తనిఖీ చేయ వలసిరావటమూ, ముఖ్యంగా ప్లాస్టిక్ వాటర్ బాటిల్స్ బండారం బైట పడటంతో కాంగ్రెస్ నాయకుడల్లే ఉన్న తన చేతులకు బేడీలు వేసి (వీటి ఒత్తిడికి గత మాసంలో తాను కొన్న స్మగుల్డ్ గోల్డ్ వాచ్ పగలకుండా జాగ్రత్తపడాలా? లేక అది మరొక నేరంక్రింద ఒప్పేసుకోవాలో తెలి యటంలేదు!) ఊరేగింపు జరుగుతే, కాంగ్రెస్ ప్రతికక్షీయులూ, ప్రభుత్వ మంటే ఒళ్ళు మండిపోతున్న జనావళీ రోడ్డుమీద ఉమ్మి వేయరు (ఉమ్మి రాకున్నా సరే!). ఈ దుస్థితి తలుచు కుంటే వంటిమీద గొంగళిపురుగులు పాకుతున్న ట్లనిపించింది రాజుకు! అంతగా గొంతుమీదికి వస్తే తాను మొదటితరగతి ప్రయాణీకుడు కానట్లు పోజు వేసి జారుకోవచ్చనుకున్నాడు. కాని తన సామానులు సోదాచేస్తే మాత్రం యీ పోలీసు బలగం తనను పట్టుకోగలదు! ఒక ప్లాస్టిక్ వాటర్ బాటిల్స్ మినహాగా తాను నేరస్థుడు కాడు. అంతగావస్తే అవికూడా ముస లాడివేనని తప్పించుకోవచ్చు.

"అసలే ఆ యాసంగా ఉన్న దన్నారు. తొందరేంలేదు. ఐదు నిమి షాలు బండి ఆగుతుంది-" అన్నాడు పోలీసు ఆఫీసర్.

"థాంక్స్!" అన్నాడు ముసలాడు.

ఆ తరువాత కూలీలచేత పది ఎక్కడ పెట్టించాలో అక్కడ పెట్టిస్తూ ముస లాడు కుదుటపడ్డాడు. యీ ముసలాడి పలుకుబడి రాజుకు బాగా అర్థమైంది. బయలుదేరే మెయిలు బండినే ఆపిం చాడు! పోలీసు ఆఫీసర్లతో పరిచయ మున్నదో, లేక ఈయనకూడా ఒక పెద్ద పోలీసు ఆఫీసరో రాజుకు తెలియ లేదు. ఏమైనా ఈయనతో మాటలు కలిపి పరిచయం, వీలైతే స్నేహం చేసుకోవటం మంచి దనిపించింది రాజుకు

పోలీసు ఆఫీసర్ చేయి ఎత్తి సౌంజ్ఞ చేయటంతో గార్డ్ ఈలవేసి ఆకుపచ్చ దీపం చూపటం, అందరుగార్డు అనుస రించి 'రైట్' చెప్పటం జరగటంతో ప్లాట్ ఫారంమీద జేబు రుమాళ్ళు గాలిలోకి లేచి మెయిల్ కు ఘనమైన వీడ్కోలు ఇచ్చినవి

పట్టాలమీద లయగా చక్రాలు చేసే శబ్దం మినహాగా మరేమీ వినిపించని ఘట్టం ఆరంభమవగానే రాజు "మీరు పెద్దవారు. పైకి ఎక్కలేరు. లోయరు బెర్తులోనే ఉండండి. నేను పైకి వెళ్తాను–'' అన్నాడు.

ముసలాడు "థాంక్స్" అన్నాడు

తన బెడ్డింగు పైన పారేసి రాజు లోయర్ బెర్తులోనే ముసలాడికి ఎదురుగా సుఖంగా ఆశీనుడయ్యాడు. ముసలాడు పుస్తకం చదువుకునే పర్యాట్లలో ఉన్నాడు. రాజు ముసలాణ్ణి పరిశీలనగా చూశాడు.

జన్మతః ఉత్తమ వంశీకుడై ఉండాలి. కిష్కింధావాసుని ముఖమైనా, ఆ ముఖంలోని తేజస్సు, కళ్లలోని కాంతీ చూస్తే ఈ దేశంలోని మహా మేధావులకోవకు చెందినవాడై ఉండాలి. గొప్ప ఉద్యోగమో, లేక వ్యాపారమో. లేక పలుకుబడో ఏదో బాగా చెప్పుకోదగ్గది ఈయనకు ఉండి ఉండాలి తనంతట తాను కల్పించుకొని మాట్లాడినా ముభావంగా ఊరుకున్నందుకు ముసలాడిమీద కాస్త చరచరమంది. అంతమాత్రానే నిరాశపడే తత్వం కాదు రాజుది!

"మీ వంట్లో బాగా లేదనుకుంటాను!'' అన్నాడు రాజు.

తన ఆరోగ్యం మీద శ్రద్ధచూపే వ్యక్తిని చూసేప్పటికి ముసలాడి ముఖం వికసించింది.

"ఆస్థ్మా.... మైల్డ్ ఎటాక్, కాస్త ఆయాసంగా ఉంది–అంతే!'' అన్నాడు ముసలాడు

"మందేమీ తీసుకోలేదా?"

"తీసుకున్నాను. బాగా నిద్రపడితే బాగుండును. మత్తు పదార్థాలు – ప్రాందీయో, విస్కీయో ఉంటే ఎంత బాగుండునో కదా అనిపిస్తుంది. ప్రొహిబిషన్ లేనప్పుడు యీ సమస్యలే. లేవు. కనీసం నాలాటి రోగిష్టి వాళ్ళకు ప్రొహిబిషన్ చట్టాలు అసలు లేకుండా ఉంటే–"

ముసలాడు కూడా మందు పుచ్చుకునే అలవాటున్న వ్యక్తేనని అర్థమైంది. తాను ఊహించిన పలుకుబడీ, హోదా మొదలైనవి నిజంగానే ఆయనకు ఉంటే పర్మిట్ తెచ్చుకోవటం, లేదా, అదీ లేకుండానే తన పలుకుబడి ప్రభావంతో హాయిగా తాగటం చేసి ఉండేవాడుకదా! తాను తాగుతాడని నలుగురికీ తెలియకుండా ఉండాలని ఆయన ఆశయమేమో? లేక పర్మిట్ ఉంటే 'తాగుబోతు'గా తయారౌతానని భయమేమో? లేక తనను పరీక్షించేందుకు యీ ఎత్తు ఎత్తాడేమో? ముఖ్యంగా తన గాంధీటోపి చూసి, తనకు రాజకీయమైన పలుకుబడి అత్యధికంగా ఉన్నదని అపోహపడి, యీ

ప్రభుత్వ విధానాల మీద ఉండే తన ద్వేషాన్ని విమర్శనా పూర్వకంగా ప్రయోగించేందుకు నాందీప్రస్థావనగా యీ ధోరణి ప్రారంభించాడేమో ?

అందుకనే రాజు ముసలాడి మాటలు పూర్తి కాకండానే "తమ లాటి మేధావులు యీ వింత ధోరణిలో మాట్లాడుతా రనుకోలేదు. మీ ఆయాసం తగ్గేందుకు 'ద్రాక్షాసవ' లాటి మందులు లేవా ? ప్రొహిబిషన్ ఉండబట్టే ముఖ్యంగా బీద సాదల కొంపల్లో శాంతి భద్రతలు నెలకొల్పబడినవి !" అన్నాడు.

"ఔనౌను. చాలామంది బీదసాదల ఇళ్ళల్లో సారా బట్టీలు నెలకొల్పబడి, వారి స్థితిగతులు కాస్త మంచి స్థాయిని అందుకున్నవి !" అని అంటించాడు ముసలాడు.

ముసలాడు ప్రొహిబిషన్ మీద దండయాత్రకు నడుం బిగించాడనేది రాజుకు సుస్పష్టంగా తెలిసింది. తన కూ్కడా యీ పాడు ప్రొహిబిషన్ మీద మంటగానే ఉన్నది; కాని ముసలాడి అసలు రూపురేఖా విలాసాలేమిటో ఆకళింపు చేసుకోకుండా ముందుకు సాగి తన నిజరూపాన్ని బైటపెడితే ఎలాటి ఇబ్బందులపాలు కావలసివస్తుందో ననే భయం రాజును పీడిస్తోంది. కనుకనే ప్రొహిబిషన్‌ను నెత్తిన పెట్టుకొని ఆ విధానాన్ని సమర్థించేందుకు రెండో కోనలో కాపు వేశాడు.

"మీరు ఎత్తిపొడుపుగా మాట్లాడుతున్నారే కాని, నిజానికి ప్రొహిబిషన్ వల్ల ఎంత మేలు జరిగిందో గమనించటంలేదు" అన్నాడు రాజు.

"మంత్రుల అంచనాల ప్రకారమా ?"

"లేదండీ. నా మిత్రుల్లో తాగుడు అలవాటున్నవారు చాలా మంది మానేశారు. అసలు సరుకు దొరకటం లేదాయె !"

"అసలుసరుకు దొరక్కనే నకిలీ సరుకు తాగి ఆరోగ్యాన్ని చెడగొట్టుకుంటున్నారండీ!" అన్నాడు ముసలాడు.

"లేదండీ, చట్టం ఉన్నది. అనవసరంగా నేరస్థుడయేందుకు ఇదేమన్నా సరదాయా ! అదీగాక రేట్లు ఎంత పెరిగినయ్ ! సంపాయించేది తినేందుకే సరిపడీ సరిపడకుండా ఉంటే తాగటం ఎలా కుదురుతుంది ?"

"అయ్యా ! తాగాలని వాంఛే ఉండాలి కాని తాగేందుకు డబ్బూ దొరుకుతుంది; సరుకూ దొరుకుతుంది. మీ మిత్రుల్ని గూర్చి చెప్పారు కదూ ! నాకూ ఉన్నారు మిత్రులు. వాళ్లల్లో తాగుడుకు అలవడినవాడు ఒక్కడూ మానలేదు. కొత్తవాళ్ళు చాలామంది




"ఈ వెన్నెలరాత్రి చందమామను చూస్తే నాకు పదిహేనేళ్ళ వయస్సు తగ్గినట్టుంది. కాని నిన్ను చూశాక నా అభిప్రాయం తారుమారయింది."

ముఠాలో చేరారు. దానికేమంటారు!" అని సవాలు విసిరాడు ముసలాడు.

ఇది కాచి వడబోసిన సత్యమని రాజుకు తెలిసినా తన వాదాన్ని బల పరుచుకునేందుకు ఒప్పుకోలేదు.

"అలాంటివారుంటే తమబోటి పెద్దలు మందలించాలి. పూజ్య బాపూజీ ఆత్మశాంతికోసమన్నా తాగ రాదని ఉత్తేజకరంగా ప్రబోధించాలి. ఏ విధంగానూ తాగుణ్ని ప్రోత్సాహ పరచరాదు!" అని బాపూజీ ఆత్మ శాంతి గుర్తుకురాగా, ప్లాస్టిక్ బాటిల్ నుంచి ఒక గ్లాసు పోసుకొని మింగాడు; అది చాలక తన ఆత్మ శాంతికోసం మరో గ్లాసుకూడా పుచ్చుకొని వాసనా గీసనా రాకుండా వక్కపొడి బొక్కాడు-రాజు!

"బాపూజీ ఆదర్శాలకూ, ఆయన ఆత్మశాంతికీ తగిన వెలలు యీనాడు మనం చెల్లిస్తూనే ఉన్నాం. ఇదివరకు ఆ తాగేవాం డెవడో చెల్లించుకునే పన్నులు, ఇప్పుడు తాగని నేరాలకు గాను, తాగనివారు ఇచ్చుకుంటూనే ఉన్నారు. దొంగచాటుగా జింజిబరీస్ లాటి పానీయాలు తాగి చస్తున్నారు!" అన్నాడు ముసలాడు రుసరుస లాడుతూ!

జింజిబరీస్ పేరు వినగానే రాజుకు

వొళ్ళు జలదరించింది. మద్రాసులో తనకు ఆ దేగతి! దాన్ని మరిచిపొయ్యేందుకు మరొక గ్లాసు 'భారతమాతకూ జై!' అనే ధోరణిలో పుచ్చుకుంటే బాగుంటుందా అనుకుంటున్నాడు.

"మీరు ఎన్నన్నా చెప్పండి. స్వాతంత్ర్యం వచ్చాక మనం బాగు పడ్డాం!" అన్నాడు రాజు.

"పంచవర్ష ప్రణాళికా ఫలితాలు చూశాక చాలా బాగుపడ్డామనే అనుకుంటున్నాం! ఎందుకొచ్చిన రభస లెండి!" అన్నాడు ముసలాడు.

అమృతం వెంట నుండగా ఊపిరి తిత్తులు అలిసిపొయ్యేట్లు యీ వెధవ వాదప్రతివాదా లెందుకు? భారత మాతను మరొక్కసారి స్మరించుకొని మరొక్క గ్లాసు జిన్ తాగేటప్పటికి రాజు హృదయం జిల్ మని భూమికి మూరెడు పైగా ఉన్నట్లు తోచింది.

"నాక్కూడా కాసిని మంచినీళ్ళివ్వండి!" అన్నాడు ముసలాడు.

రాజు గతుక్కుమన్నాడు. జిల్ మన్న అతని హృదయం గడ్డకట్టుకు పోతున్నట్లు తోచింది. ఇలాటి ప్రమాదాలనుంచి ఇదివరకు అనేకసార్లు తప్పించుకోగలిగిన ప్రతిభ ఉన్నవ్యక్తి కనుక తొణకకుండా - "ఇవి మంచి నీళ్ళు కావండీ!" అన్నాడు.

"మరేమిటి?" అన్నాడు ముసలాడు కనుబొమలు పైకి ఎత్తి.

"కషాయం స్వామీ! కషాయం!... ఆ మధ్య టైఫాయిడ్ పడ్డాక మద్రాసులోని ఒకానొక ప్రముఖ ఆయుర్వేద భిషగ్వరుని ఆదేశానుసారం గంట గంటకూ-ముఖ్యంగా ప్రయాణాల్లో తాగేందుకు నిర్దేశించబడింది. పాడు వగరూ-చేదుకూడాను. అందుకనే-" అని ఒక గుప్పెడు వక్కపొడి నోట్లో వేసుకొని "యీ వక్కపొడి తినటం!" అన్నాడు. 'నీ బోటి శల్యపరీక్షకారుడికి చిక్కకుండా ఉండేందుకు!' అని మనసులో అనుకున్నాడు.

ఈ అస్త్రం ప్రస్తుతానికి పారింది. ముసలాడు తన దృష్టిని పుస్తకంమీద కేంద్రీకరించాడు. ఈ ముసలాడికి అసలె ఆయాసం. తన ఖర్మకాలి ఆ ఆయాసం మరికాస్త ఎక్కువైతే ఏదో ఒక ద్రవ పదార్థం లేనట్లయితే మరీ బాధ పడతాడు. తన దగ్గిరున్న యీ ద్రావకాన్ని సేవించేపక్షంలో, మొదటి గుక్కటలోనే తన రంగు తెలిసిపోతుంది! అదీగాక ఇలాటివి అలవాటు లేని మేళాం కనుక ఐతే కంపార్టుమెంట్ నిండా కక్కినా కక్క వచ్చు! మాటల ధోరణినిబట్టి అడపా దడపా ఇలాటి పానీయాలతో నోరు తడుపుకునే రకమే నని అర్థమైంది ప్రొహిబిషన్‌కు విముఖుడనే విషయం కూడా ఆయన మాటల్లో స్పష్టమైంది ఐతే ప్రొహిబిషన్‌కు ఎంతో సుముఖ

త్వాన్ని ప్రదర్శించి బాపూజీ పవిత్రా శయాలను నెత్తి కెత్తుకొని హోరా హోరీగా పోరాడిన తను-యీ ద్రావ కాలను సేవిస్తూన్న సంగతి ముస లాడు రుచి చూసి చూడగానే గ్రహించి .... ఇందాకట్నించీ వెధవ వాదాలు చేసిన తనమీద కసితీర్చు కునేందుకు గొలుసులాగి రైలు ఆపినా ఆపవచ్చు. పెనువెంటనే తనను పోలీ సులకు అప్పగిస్తే తన పరువుప్రతిష్ఠలు ఏం కావాలీ? పలుకుబడి ఉన్న వ్యక్తికి పట్టుబడట మంటే అగ్నిగుండంలోకి ఉరకటమే అవగలదు!

అలాటి దుస్థితి వచ్చిపడితే ఆ వాటరు బాటిల్స్ తనవి కావనీ, ముసలాడివేననీ బుకాయించవచ్చు. కాని తన నోటినుండి వెలువడే సువా సనా, ముప్పై సంవత్సరాలనాడు స్కాట్ లెండ్ యార్డువారు అనుసరిం చిన డిటెక్షన్ పద్ధతులను నేడు అనుస రిస్తున్న భారతీయ డిటెక్టివ్‌లు నిశి తంగా పరిశీలించి ఆ బాటిల్స్‌మీది వేలి ముద్రలు తనవే నని రుజూచేయటంతో నేరం నిస్సందేహంగా తనపై పడి రుజూ అవుతుంది. యీ వెధవ జిన్ లేకుంటే మానె - ఇంత రాద్ధాంతం జరుగుతుందనే ఊహన్నా ఉన్నట్లయితే యీ సాహసానికి చాలా దూరానే ఉండేవాడు కదా!

పావుగంట గడిచాక ముసలాడి వైపు చూశాడు రాజు. ముసలాడికి ఆయాసం కాస్త ఎక్కువైంది. ఆయన దృష్టి తన వాటరు బాటిల్స్‌మీదనే నృత్యం చేస్తున్నట్లు తోచింది రాజుకు. ఈసారి మళ్ళీ నీళ్ళు (!) అడిగే ధోరణి ముసలాడిపట్ల కనిపిస్తోంది. అడుగుతే ఏం చేయాలి? త్వరత్వరగా వాటరు బాటిల్స్‌లోని అమృతాన్ని అవపోసన పట్టి ఖాళీ బాటిల్స్‌ను కిటికీలోంచి విసిరివేస్తే? అంత త్వరత్వరగా పీల్చి పారేసేందుకు తానేం అగస్త్యుడా! రాత్రంతా హాయిగా సిప్ చేస్తూ ఆనం దిస్తూ గడపాల్సినదాన్ని 'మింగు - మింగు' అనే ధోరణిలో ఐతే - తనకు తిక్క తిరిగి బూతుపాటలు లంకించు కునే అపాయంకుడా ఉన్నది! తాగి నందుకూ, బుడ్లు మోసినందుకూ, తందనా లాడినందుకూ - మూడు సెకన్లు రాజు మొహంమీద వేళ్ళాడ సాగినవి.

రొప్పుతూ "అయ్యా! కాసిని మంచినీళ్ళివ్వండి!" అన్నాడు ముస లాడు.

ఈ బాంబు పేలి తీరుతుం దనే తెలుసు రాజుకు.

"అవి మంచినీళ్ళు కావండీ ... కషాయం!.. .క-షా-యం!" అని విడిగొట్టి వికారం ఉట్టిపడే విధంగా తెలియజెప్పాడు—రాజు.

"ఏదోవొకటి—గొంతెండి ఛస్తుంటే ఏంచేస్తాం? ఇవ్వండి!" అని దబాయించాడు ముసలాడు.

"అది మందు స్వామీ! వ్యాధికి ఉపయోగపడేదాన్ని మంచినీళ్ళ వలె తాగుతానంటే ఏం చెప్తాను? నా మాదిరి రోగమే మీకుం ఉంటే తప్ప పనిచేయదు. మొండికేసి తాగితే ప్రాణాపాయం కూడాను!" అన్నాడు రాజు.

"ఇలా . ఇలా .. ఆయాసంతో బాధపడటంకన్న ఆ కషాయం తాగన్నా ప్రాణాలు వదలటం. మంచి దనిపిస్తోంది.... గొంతులోంచి ద్రవపదార్థం ఏదో వొకటి జారకుంటే ప్రాణాలు నిలవవు. కషాయం కానీ, విషం కానీ ఫర్వాలేదు! ఎలాగూ ప్రాణాలు పొయ్యే పతుంలో తాగకుండా చావటంకన్న తాగి చావటమే మేలు!"

సరాసరి తన ప్రాణానికే ఎసరు పెట్టిన విధంగా ఉన్న దా ధోరణి! రాజుకు ఎటూ తోచటం లేదు. ఒక మానవప్రాణి తృష్ణతో ప్రాణాపాయ స్థితిలో ఉంటే చూస్తూ ఊరుకోవటమెలా? ఊరుకోక ఉరి వేసుకోవటమెలా? ముసలాడిమీద జాలి కలిగింది; కాని తన బండార మంతా బైటపడి, తన గాంధీటోపీ విలువ బజారుపాలు కావటానికి ఎలా అంగీకరించగలడు?

తిరిగి తిరిగి యీ ముసలాడు తన వెంట పడకుండా ఉండే విధంగా కాస్త కఠినస్వరంతోనే "అలా ఇచ్చేందుకు వీల్లేదండీ! కషాయ మని చెపుతూంటే వినిపించుకోరేం? ఇవ్వను-ఇవ్వలేను. క్షమించండి!" అన్నాడు; ఆ చివరి మాటలో తన సంస్కృతిని వ్యక్తపరిచాడు.

ముసలాడు కనుబొమలు ముడివేశాడు యీ జవాబు విని!

ఈ ముసలాడికి దాహం తీరక ఛామ్మని ఛస్తే? తాను కోర్టుచుట్టూ తిరిగి సాక్ష్యం చెప్పటం, తన వాటర్ బాటిల్స్‌లోని లోతార మంతా బట్టబయలు కావటం, తనలాటివాళ్ళను చూసిన బాపూజీ ఆత్మ ఘోషించటం కాంగ్రెస్‌కే చెడుపేరు రావటం మొదలైన అనేక దుర్భర పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తుంది. ముసలాడికి తాను చెప్పిన 'విషం-కషాయం' నిజంగానే తన పాలిట విష కషాయాల రూపులు దిద్దుకునేట్లున్నవి!

ఏ వెధవగొడవా లేకుండా ఇప్పుడే ఈ రెండు వాటరుబాటిల్స్‌నూ కిటికీలోంచి విసిరిపారేస్తే? బోలెడు డబ్బు పోసి కొన్న నిఖార్సయిన ఫారిన్ సరుకు! ఒక బాటిల్ రైలులోకి, రెండోది ఇంటికీ అని తన అంచనా! ఒక బాటిల్‌లో నాలుగో వొంతు మాత్రమే మింగాడు ఇప్పటికి! యీ

ముసలాడు శని దేవతల్లే తన వెంట పడతాడని ఊహించిఉంటే ఒకకూజా నిండా నీళ్ళుకూడా వెంట తెచ్చిఉండేవాడు! కనీసం తనతోపాటే తోడుగా కూర్చుని గొడవ లేకుండా ఈ అమృతాన్ని సేవించటానికి పూనుకున్నా ఎంతో సంతోషించేవాడు! ఎటు కదులుతే ఏం ప్రమాదమో? ఈ ఆయాసం కూడా తనకు అగ్ని పరీక్ష లాగే ఇప్పుడే దాపరించాలా ముసలాడికి? ఆయాసం తననొక్కణ్ణే బాధ పెడుతోందని ముసలాడు భ్రమ పడుతూన్నాడు. అంతకన్న ఎక్కువగా ఏ ఆయాసమూ లేని తాను బాధపడుతూన్న సంగతి ఆయనకు తెలియదు—పాపం!

పోనీ గొలుసులాగి రైలాపి ముసలాడికి సోడాయో, మంచినీళ్ళో ఇప్పిస్తే? తాను ఎందుకు గొలుసు లాగిందీ తెలుసుకున్నాక తన వాటరు బాటిల్స్ రహస్యం పరిశోధించబడకుండా ఉంటుందా? ముసలాడొక్కడికీ బురిడీ వేసినంత తేలిగ్గా తన కంపార్టుమెంటు చుట్టూ చేరినవారిని మోసగించగలడా? ఏ గొడవా లేకుండా నిద్రపోతే? అప్పుడు ముసలాడు ఆత్రంకొద్దీ తన అమృతాన్ని— ఉపాయంగా తోచినా సరే మింగేస్తే? సరుకు నష్టమౌతుందని కాదు — ఆ సరుకు బైటపడుతుందని!

ఉపాయాలు తోచక ముఖావంగా



మొహం ముడుచుకొని కూర్చున్నాడు రాజు.

మరో అరగంటకాని మెయిల్ ఆగే స్టేషన్ రాదు. మెత్తని పరుపుల మీద కూర్చున్నా రాజుకు ముళ్ళకంప మీద కూర్చున్నట్లే ఉంది. ఈ బాధాకరమైన విషమపరిస్థితినుంచి తాత్కాలికంగా విడుదల అయేందుకు మరొక్క గ్లాసు పానీయం పట్టిస్తే బాగుండు ననిపించింది; ఐతే అసలే దాహంతో నాలిక పీక్కుంటున్న ముసలాడు - తాను తాగే కషాయాన్ని చూస్తే మరింత తృష్ణతో అలమటించిపోతాడేమో నని ప్రస్తుతానికి ఆ ప్రయత్నం నుంచి విరమించుకోవలసివచ్చింది.

ముసలాడివంక చూడటమంటేనే భయంగా ఉంది. రొప్పుతూ మెలికలు తిరుగుతున్నాడు. ఇలాటి రోగిష్టి వాడితో ప్రయాణం చేయవలసి రావటం నిజంగానే తన దురదృష్టం; కూపే లేకుండా ఏ ఆరు బెర్తు లున్న కంపార్టుమెంటన్నా ఐవుంటే ఏ ప్రయాణీకునిదగ్గరో ఇన్ని మంచినీళ్ళు దొరక్కనూపోవు; తా నీ దుర్భర పరిస్థితుల్లో ఇరుక్కోకనూ పోనుకదా!

"నాకు .... దాహం .... మీ .... పర్మిషన్ లేకుండానే. . తాగేస్తాను.... నాకి .... ఫార్మాలిటీస్ .... పనికి .... రావు!" అన్నాడు ముసలాడు.

తృష్ణార్తుని ఆరాటాన్ని అర్థం చేసుకోలేనంత తక్కువరకం సంస్కృతి కాదు రాజుది! తాను అన్నట్లుగా ఆ బాటిల్స్‌లోది కషాయం ఐనా ఇచ్చేవాడే! జిన్ (మత్తుపదార్థం) కాకుండా ఏ ఇతర ద్రవపదార్థ మైనా పట్టింపు లేదు. చివరికి జిన్ ఐనా ఫర్వాలేదు- అది తాగాక ముసలాడు తనను నేరస్థుడుగా చేస్తాడేమో ననేదే రాజును పీడించే భయం!

ముసలాడి మాటలకు విసురుగా గోడకు తగిలిన కొత్త టెన్నిస్ బంతి లాగు ఎగిరిపడ్డాడు-రాజు.

"అలా వీల్లేదండీ!" అన్నాడు రాజు. "నామం దేదో మీరు తాగేస్తానంటా రేమిటి? ఆయాసం ఉండగా ఒక కూజాతో నీళ్ళు తెచ్చుకోలేకపోయ్యారా? .... నా సామానుల్ని మీరు తాకేందుకు వీల్లేదు. అలాటి ప్రయత్నం చేస్తే నే నీ బాటిల్స్‌ను విసిరి బైటికి పారేస్తాను! ఆ కషాయం తాగుతే ఏదన్నా ప్రమాదం జరిగినా జరగవచ్చు. దానిక నేను పరోక్షంగా కూడా బాధ్యత వహించలేను!"

తాను ఇంతకు తక్కువ కఠినంగా మాట్లాడితే శృతిమించి రాగాన పడుతుందనే జ్ఞానముంది రాజుకు. అందుకనే ముసలాడు తన అవస్థ తాను పడసాగాడు.

## 3

మెయిల్ ఇంకా ఆగిందో లేదో రాజు ప్లాట్ ఫారంమీదికి ఉరికి సోడా స్టాల్ వైపు పరుగెత్తి "రెండు మంచి సోడాలు !'' అన్నాడు.

రాజును తేరిపార జూచిన స్టాల్ వాడు "స్పెషల్ సోడాలు ఇమ్మంటారా ?'' అన్నాడు.

''ఇయ్యవయ్యా!" అని రాజు పది రూపాయిల కాగితం ఇచ్చాడు.

స్టాల్ వాడు రహస్యంగా ఉండే సొరుగులోంచి రెండు బుడ్లు తీసి రాజుకు ఇచ్చాడు. రాజు పరుగు పరుగున వచ్చి సోడాలు కొట్టి గ్లాసులో పోసి ముసలాడికి అందించాడు. ముసలాడు కృతజ్ఞతాపూర్వకంగా రాజు వైపు చూసి ఒకదానివెంట మరొకటి గడగడా తాగేసి, తేపి, ఆయాసం తగ్గిన ధోరణి కనబరిచాడు. ముసలాడు సోడాలు తాగుతుండగా ఆ ద్రవం తెల్లగాగాక కాస్త ఎర్రగా ఉండటాన్ని రాజు గమనించాడు. ఐతే స్పెషల్ సోడాలు కనుక ఇలా వున్నవేమో నని అంతగా పట్టించుకోలేదు.

"చాలునా ? మరో రెండు తెమ్మంటారా ?''అన్నాడు రాజు.

"చాలండీ! ప్రాణాలు నిలబెట్టారు-మొత్తంమీద !"అని ముసలాడు అనేప్పటికి, రాజుకు ఎంతో ఆనందమై తన గాంధీటోపీని ఒక్కసారి సవరించుకున్నాడు.

ఖాళీ బుడ్లను స్టాలువాడికి ఇచ్చాక, స్టాలువాడు ఎనిమిది రూపాయి నోట్లు తిరిగి రాజుకు అందించి తన పని చూసుకోసాగాడు.

''మిగతా చిల్లరా !'' అన్నాడు రాజు.

"అవి స్పెషల్ సోడాలు సార్ ! ఒకొ్కటి రూపాయి !"అన్నాడు స్టాల్ వాడు, 'యీ మాత్రం తెలియదటయ్యా-కాంగ్రెస్ నాయకా !' అనే ధోరణిలో ఈ సడింపుగా రాజువైపు చూస్తూ !

వెధవ సోడా రూపా యేమిటి ! స్పెన్సరు సోడా కూడా ఇరవై పైస లేనే ! ఇది మరీ దొంగల దోపిడిగా ఉన్న దనిపించింది రాజుకు ! ఐతే ఏం మాట్లాడేందుకూ తోచక, వెళ్ళినడకలతో తన కంపార్టుమెంట్ వైపు వెళ్లాడు.

అప్పటికే కంపార్టుమెంటులో ఒక పోలీస్ ఆఫీసరు ఎక్కి ముసలాడితో మాట్లాడుతున్నాడు. యీ ముసలాడు ఇంతకుముందు జరిగిం దంతా పోలీస్ ఆఫీసరుకు చెప్పి, తన వాటరు బాటిల్స్ సోదా జరిపిస్తాడేమో ననే భయం పట్టుకుంది రాజుకు ! ఈ ముసలాడి పలుకుబడిని వాసన పట్టే తన కషాయాన్ని ఇవ్వనందుకు తనను

తాను అభినందించుకున్నాడు. ఎందుకైనా మంచిదని ప్లాట్ ఫారం మీదనే నిలబడి బండి కదిలే వేళకు పోలీస్ ఆఫీసరు దిగుతూండగా తాను ఎక్క వచ్చు నని నిశ్చయించుకున్నాడు.

ప్లాట్ ఫారం మీద నిలబడి ఆలోచించగా మరో పెద్ద ఇబ్బంది—ఇదివరకు లాటిదే వచ్చిపడుతుందేమోననే ఊహ వేధించింది రాజును! మళ్ళీ యీ ముసలాడికి దాహం వేస్తే తన కషాయం మీదికి దృష్టి పోనిస్తాడు! అప్పుడెలా? లోగడ జరిగిన అనుభవంతోనన్నా యీ ముసలాడు ఒక కూజాతో నీళ్ళు తెప్పించుకోరాదూ? రూపాయి సోడాలు తానిక సరఫరా చేయలేడు! ప్లాట్ ఫారమ్ మీద ఎక్కడా కూజాలు అమ్ముతూన్నవాళ్ళు కనిపించలేదు. అసలు యీ వెధవ జిన్ వెంట తేకండా ఉంటే యీ క్లిష్ట సమస్యలు వచ్చిపడేవి కావుకదా! ఇప్పటికైనా మించిపోయిం దేమిటి? మెయిల్ కాస్త పరుగు లంకించుకున్నాక రెండు వాటరు బాటిల్స్‌నూ విసిరి బైటికి పారేస్తే పీడ విరగడైపోతుంది! ఏం చేయాలనేది బండి బయలుదేరాక కాని నిర్ణయించుకునేందుకు వీల్లేదు! బైట పారవేసి తీరవలసివస్తే పొట్ట పట్టినంతగా తాగి కృష్ణార్పణంగా పారవేయటమే శరణ్యం!

బండి బయలుదేరేందుకు మొదటి గంట కొట్టారు. ముసలాడు పోలీస్ ఆఫీసరుతో చాలా కులాసా ధోరణిలో మాట్లాడుతున్నాడు. స్పెషల్ సోడా-రూపాయి చొప్పున అమ్ముతే అమ్మారు కాని—అది ముసలాడికి దివ్యౌషధంగా పరిణమించింది!

ఇంతలోనే ఒక కానిస్టేబిల్ కూజాతో నీళ్ళూ, ఒక గ్లాసూ తెచ్చి కంపార్టుమెంట్ లో పెట్టాడు. ముసలాడి పలుకుబడితో క్షణంలో అన్ని ఏర్పాట్లూ, ఆయనకూ-ఆ మాటకొస్తే తనక్కూడా వాటంగా రూపొందించబడినవి! అదృష్ట దేవత తన నింకా పూర్తిగా విడనాడలేదు! న్యాయంగా (?) సంపాయించుకున్న సొమ్ముతోనే కదా—వేంకటేశ్వరుని ముడుపు చెల్లించగా మిగిలిందాంట్లోంచి కదా యీ జిన్ను కొన్నది. అది తన పొట్టలోకి పోకుండా ఉంటే వేంకటేశ్వరస్వామి మాత్రం - లంచం తీసుకున్న పెద్ద మనిషేగా-ఊరుకోగలడా? యీసారి గ్లాసు వేంకటేశ్వరుని పేరుమీదుగా తాగటం తన విధి!

బండి బయలుదేరుతూండగా పోలీస్ ఆఫీసరు దిగిపోవటమూ, రాజు ఎక్కటమూ జరిగింది. ముసలాడి మొహం కళకళ్ళాడుతోంది; తనకు ఖర్చయిన వెధవ రెండురూపాయిలూ సద్వినియోగ మైందనే అభిప్రాయం రాజుకు కలిగింది.




"ఇప్పుడు మీకు కాస్త తేలిగ్గా వుందా?" అన్నాడు రాజు.

"కాస్త కాదు - బాగా తేలిగ్గా ఉంది! సోడాలు భలే పనిచేసినయ్.... అన్నట్లు ఎంతైంది?" అన్నాడు ముసలాడు జేబులోంచి పర్సు తీస్తూ.

"దానిక్కూడా డబ్బా? వద్దండీ?" అన్నాడు రాజు.

ముసలాడు చిరునవ్వు చిలకరించాడు.

"మీ కషాయంజోలికి రాకుండా మంచినీళ్ళు తెప్పించుకున్నాను-" అన్నాడు ముసలాడు ఎత్తిపొడుపుగా.

"చూశాను!" అని నసిగాడు రాజు.

ఇక తన కషాయానికి ఎలాటి ప్రమాదమూ లేదని తెలుసుకున్నవాడై, రాజు మొదటి గ్లాసు తన నిర్ణయాన్ని అనుసరించి వేంకటేశ్వర స్వామికి అంకితం చేశాడు.

నిద్రపొయ్యే వేళయిందనీ, యీ రాత్రి హాయిగా నిద్రపోవాలనే నిశ్చయంతో-మరో రెండు గ్లాసులు తనకు తానే అంకితం చేసుకున్నాడు రాజు. మత్తులోని గమ్మత్తు రాజును ఆవరిస్తోంది.

ఆ తరువాత పై బెర్తుమీద బెడ్డింగ్ వేసుకొని "ఇక పడుకుంటాను సార్ - గుడ్‌నైట్!" అని ముసలాడికి చెప్పి, పైకి ఎగబాకాడు.

ముసలాడు గుడ్‌నైట్ చెప్పి వేదాంత సంబంధమైన పుస్తకాన్ని చదువుకోసాగాడు.

రాజుకు ఆవలింతమీద ఆవలింత వస్తోంది. తన కషాయానికి కాపలాగా ముసలాణ్ని ఉంచి నిద్ర పోవటం మంచిదా? కాదా? అనే తర్కం అతని మనస్సులో ప్రారంభ మైంది. కూజానిండా నీళ్ళు ఉన్నవికనుకా-తన ఖర్చుమీద సోడాలు (స్పెషల్!) బిగించాడుకనుకా - ముసలాడివల్ల ప్రమాదం ఉండదని తేల్చుకొని, ఇక ఆపుకోలేని గాఢనిద్రకు ఉపక్రమిం చాడు రాజు.

## 4

రాజు కలగంటున్నాడు:

కూపే కంపార్టుమెంటులో అన్నుల మిన్నతో సరసా లాడుతూ, తాను తందనా లాడే దృశ్యం ఆరంభమై - వెనువెంటనే మాయ మైంది.

ఆ యువతి స్థానంలో ఇప్పుడు నిజంగానే తనతో ప్రయాణం చేస్తూ తనపాలిటి యముడైనవిధంగా కన్పట్టిన ముసలాడు తయారయ్యాడు.

తన కషాయంకోసం అర్రులు జాచినవిధంగా ముసలాడు ఎగబడుతూంటే, డబ్బుపోసి కొన్నది ముక్కూ మొహం ఎరగనివాడికి పోసేందుకు ఇష్టంలేక, పలుకుబడి గలవాడుకనుక చట్టానికి తనను చుట్టిపారేస్తాడేమో ననే భయంచేత, చేజిక్కింది జారిపోకుండా తగు జాగ్రత్త పడేందుకై - ముందూ వెనుకా చూడకుండా గడగడా రెండు బాటిల్స్‌నూ ఖాళీచేసి పొట్ట నింపుకున్నాడు-రాజు.

తన కోటా ఒక బాటిల్ అనీ, అంతకుమించుతే రాంభజన మొదలూ, భరతనాట్యమూ ప్లస్ హరికథా కాలక్షేపంవరకూ జరిపించవలసి ఉంటుందనీకూడా రాజుకు తెలుసు. కాని పరిస్థితుల వొత్తిడికి దాసానుదాసుడై పొట్ట పట్టకుండా తాగినందువల్ల-

తూలుతూ, పడుతూ, లేస్తూ పాటలూ, పద్యాలూ ఆరంభించాడు. బూతు పదాల్ని, పద్యాల్ని రాగయుక్తంగా పాడాడు. "భారత భూమీ మనదేరా - భారత బీడీ మనదేరా!" ఇత్యాది స్వంత కవిత్వాలు వినిపించాడు. ఛండాలపు పాటలు, యీ కథకుడు రాయకూడనివి - పాడాడు.

ముసలాడు ఎంత మృదువుగా చెప్పినా కళ్ళాలు తెంచుకున్న పంగెపు గుర్రాలవలె మొరాయించి, హరామి చేసే తన శక్తులు తన అధీనం తప్పి తను ఇష్టానుసారంగా కంపార్టుమెంట్‌లో వివిధనాట్యాలు-ప్రపంచం కనీవినీ ఎరుగనివాటిని కదంతొక్కాడు; పొట్టలోని జిన్ గలగల్లాడటం ఇంత గొడవలోనూ, రైలుచక్రాల మోత లోనూ సుస్పష్టంగా వినిపించింది. దాని కక్కడ తావు లేకపోవటంవల్ల ఒకటికి రెండు వాంతులు ఐనవి. "నా

వాంతుల కాంతులు .... ఇంతుల సొంపులు, వంపులు, బంతుల తుంపులు!'' అనే ఆసుకవిత్వాన్ని విడుదలచేశాడు.

నాట్యం చేస్తూ భారత ప్రభుత్వానికి చెందిన డిమ్ లైట్ నొకదాన్ని తునాతునకలు చేశాడు. గాంధీ టోపీని నెత్తిమీద పటవాలుగా పెట్టుకొని సిగ్గు నటిస్తూ ''తుంహారా బీబీకి ఇది హాబీ!"అని ఒక పాట పాడి రాజభాషా గౌరవ మున్న హిందీకి ఇంగ్లీషు జోడించి తన ప్రతిభ చాటుకున్నాడు.

ముసలాడు నిస్సహాయ స్థితిలో పడి ఎంత చెప్పినా కంట్రోల్ చెయలేని రాజు విషయంలో భయపడిపోయి-గొలుసు లాగి బండి ఆపించాడు.

జనసమూహాలు కంపార్టుమెంటును ముట్టడించటం పోలీసువారు రాజు చేతులకు బేడీలు వేయటంతో రాజు నిషాతో పాటు, నిద్రమైకం కూడా వదిలిపోయింది.

నిద్ర మెళుకూ రాగానే చేతులు ఝాడించి చూసుకొని, బేడీలు తన చేతులక్కాదని తెలుసుకున్నాడు. లయ వేసుకుంటూ రైలు సాగిపోతోంది. తన వాటరు బాటిల్స్ మృదువైన నాట్యం చేస్తూ ఊగుతున్నవి. ఇదంతా కల అని తెలుసుకున్నాక రాజు మనస్సు కుదుటబడింది.

ముసలాడు మహదానందంగా ఉన్నట్టున్నాడు. రాత్రి గడిచిపోతున్నా ఇంకా చదువుతూనేఉన్నాడు. గడియారం చూసుకొని పన్నెండున్నరయిందని తెలుసుకున్నాడు రాజు.

ముచ్చటగా ముందుకూ వెనక్కూ ఊగుతున్న ప్లాస్టిక్ వాటరు బాటిల్స్ రాజును ఆహ్వానించినయి.

పై బెర్తు మీదినుంచి లంకలోకి దూకే హనుమంతుడివలె దూకి, ఒక గ్లాసుకు ద్రావకాన్ని నింపాడు. పెదవుల దగ్గర పెట్టుకునేప్పటికి చల్లగా-తియ్యగా-పచ్చి మంచినీళ్ళు! జిన్ స్టాకుఉంటే నీళ్ళవుతయ్యని ఎన్నడూ తాను వినలేదు. ఆ గ్లాసులోది అవతల పారబోసి, రెండోబాటిల్-నిండుగా ఉన్నదాన్ని విప్పుతే-అదీ అంతే! తన కషాయం గంగాతీర్థపు అవతారాన్ని దాల్చింది! రాజు ముఖం కూడా మాడి మసిబొగ్గయింది!

ముసలాడు క్రీగంట చూస్తూ చిరునవ్వులు చిందిస్తున్నాడు. ఇదంతా ముసలాడి మాహాత్మ్యమే నని రాజు గ్రహించేందుకు ఎక్కువసేపు పట్టలేదు. ఐతే ఏమని అడుగుతాడు? 'నా జిన్ ఎందుకు మింగావు?' అంటాడా? 'కషాయంకాస్తా హరించావేనుయ్యా!' అంటాడా?

గుడ్లు మిటకరిస్తూన్న రాజును చూసి ముసలాడు "కాంగ్రెస్ నాయకా! రా-ఇటు ఆశీనుడవుకా!...

ఏం గొప్పకషాయం తెచ్చావయ్యా! అసలు నేను అడిగినప్పుడే నా మొహాన ఒక గ్లాసు పడవేసిఉంటే అసలు ఆయాసం యీ పొలిమేర్లకు వచ్చి ఉండేదా?నీ ప్రో ప్రొహిబిషన్ వాదాలు చూసి నేను సాహసించలేదు కాని లేకుంటే నేనే నీ కింత 'సుర' అందించే వాణ్ణి! నిజమైన రాజకీయవాదివి కను కనే ఆ స్పెషల్ సోడాలు సాధించావ్! ఒకదాంట్లో మైల్డ్‌గా బ్రాందీ. మరొకదాంట్లో మైల్డ్‌గా విస్కీ--నీ అభిరుచులకు అనుగుణంగానే అవి అందించబడినవి. అవి పుచ్చుకున్నాక ప్రాణం శాంతించిం దనుకో! నీబోటి జంబుకాన్ని నేను వాసనపట్టలే నను కున్నావా? నిశ్చయంగా తెలుసుకుందామనే వేచి ఉన్నాను. ఐదుగ్లాసులు పుచ్చుకున్నానో లేదో- సుఖనిద్రపోక ఆపాట లేమిటి? అలాటి అద్భుతగానం విని ఎన్నాళ్ళయిందో! పై బెర్త్‌మీదనుంచి వినవయే ఆ గానామృతానికి తోడుగా మీరు వేసిన దరువు - అద్భుతం! మద్రాసులో తమతో పార్టీపర్చాటు చేయించి నా మిత్రబృందం సమక్షంలో మీ కుప్పిగంతులూ, ఆ బూతుపాటలూ అవీ ఒక వెరైటీ ఎంటర్‌టైన్‌మెంట్ పెట్టించాలని నిశ్చయించుకున్నాను -"

తీర్పు వింటూన్న ఖూనీనేరస్థుని స్థితి - ఇప్పుడు రాజుకు బాగా అర్థమౌతోంది. కలలో కలవరింతలుకూడా అవతరించిన వన్నమాట! ఇంకా నయం — డాన్స్ చేస్తూ పై బెర్త్‌మీద నుంచి ముసలాడిమీదికి పడి హత్య చేయటమూ, తన నడుం విరగ్గొట్టుకోవడమూ జరగలేదు. ఇంతకూ ముసలాడు తన జిన్ మింగుతే మింగాడు - ఇప్పుడింకో ప్రమాదం తెచ్చిపెట్టకుండా ఉంటే అదే పదివేలు! రూపాయి సోడాల రహస్యం ఇప్పుడే రాజుకు అర్థమైంది!

"మొదట మీరు ఎత్తుకున్న ఇష్టదేవతా ప్రార్థన 'ముంముగా ..........' అత్యద్భుతం! మీ అభిరుచుల్ని నేనెంతో అభినందిస్తున్నాను. ఇప్పుడు మీ జిన్ కాస్తా మాయమై హిమవన్నాగన్నుంచిపారిన గంగోదక రూపం దాల్చిందని బాధ పడకండి. నా పక్కను కూర్చొని యీ ఫారిన్ సరుకు కాస్త రుచిచూసి మీ గానకళామృతంతో నా చెవుల్లోని తుప్పుతో పాటు వెంట్రుకల్నికూడా పెకలించండి....గాంధీ టోపీ పెట్టుకుంటేనే మీ అందం ఇనుమడిస్తుంది....రండి!" అని రాజుచేత గాంధీటోపీ ధరింపజేసి బెర్తుకింద ఉన్న పెట్టెలోంచి 'ఓల్డ్ స్మగల్డ్' బుడ్డి లాగాడు. ఆ బుడ్డి చూస్తేనే ఎంతవ్వాడికైనా లోపలి సరుకు రుచి చూడాలనిపిస్తుంది. ముసలాడి పెట్టెనిండా ఉన్న బాటిల్స్

చూసేటప్పటికి రాజు కళ్ళు జిగేల్ మన్నవి !

మెరిసిపోయ్యే ద్రవాన్ని రెండు గ్లాసుల్లోను వొంచి "ప్రస్తుతం సోడాలు లేవు కనుక నీళ్ళు కలిపి సేవిద్దాం!'' అన్నాడు ముసలాడు. తనకు గురు సమానుడైన ముసలాడి మాటను కాదనలేకపొయ్యాడు రాజు.

"మీ ఎడ్రస్ ఇవ్వండి. మద్రాసులో మీకు కొన్ని బుడ్లు హోమ్ డెలివరీ చేస్తాను....ఇంక ముందుమాత్రం ప్రో ప్రొహిబిషన్ మాటలు మాట్లాడకండి!" అని హెచ్చరించాడు ముసలాడు.

''మంచి మర్యాదా ఉండొద్దండీ!" అన్నాడు రాజు.

"దానికి నీ టోపీయే చాలయ్యా!.. అది సరేకాని కాస్త పాటలుపాడు— రంజుగా ఉంటుంది !"

రాజు మొదట్లో సిగ్గు పడ్డాడుకాని, మూడో రౌండ్ కాగానే కంపార్టు మెంట్ దద్దరిల్లేలా రాంభజన ఆరంభించాడు. ముసలాడు కూడా స్మృతి కలపటంతో మహదానందంగా ఉన్న, చట్టాన్ని ధిక్కరించిన ఆ ఇద్దరు చుట్టాలనూ మెయిల్ అతివేగంగా మరింత హుషారుగా మోసుకొని వెళ్ళసాగింది.



# చక్రనేమి

## కోడూరి కౌసల్యాదేవి

### జరిగిన కథ

[ఇంగ్లీషు లెక్చరర్ చక్రపాణిని తిరుపతిలో మాధవి అనే విద్యార్థిని పరిచయం చేసుకుని యింటికి ఆహ్వానిస్తుంది. ఆమె తండ్రి సెనేట్ సభ్యుడైన అనంతయ్య కోరికపై మాధవికి తన తీరిక సమయాల్లో పాఠాలు చెప్పటానికి పాణి అంగీకరిస్తాడు. కాలేజీలో చిన్న విషయంపై ఒక విద్యార్థికీ, చక్రపాణికీ ఘర్షణ వచ్చి విద్యార్థులు సమ్మెచేసే పరిస్థితివరకు వస్తుంది. ప్రిన్సిపాల్ పాణిని విద్యార్థులకు అపాలజీ ఇమ్మనగా పాణి నిరాకరించి వచ్చేస్తాడు.

శ్యామసుందర్ మాధవి మేనమామ. ఈతని విషయమై మాధవి అన్న కేశవరావూ, తల్లీ ఘర్షణపడతారు. కాలేజీలోని తోటి లెక్చరర్లు మాధవితో పాణికిగల పరిచయంవల్ల పడే యీర్ష్యకూ, పద్మ పెళ్లివిషయమై తల్లితో వచ్చిన ప్రస్తావనకూ బాధపడుతూవుంటే, పాణిని అకస్మాత్తుగా అనంతయ్యగారు కబురుచేసినట్టు చెప్పి తీసుకెళ్తారు ఎవరో. పాణి చెల్లెలిందిర మరునాటి ఉదయంవరకూ అన్న ఇంటికి రానందుకు భయపడుతూ స్నేహితురాలు రుక్మిణితో కలిసి అనంతయ్యగారింటి కొచ్చి కేశవరావుకు సంగతులన్నీ చెబుతుంది. వెంటనే కేశవరావు ప్రమాదము నూహించి పాణి కుటుంబాన్ని తన ఇంట్లో వుంచి పాణికై ఆరాదీయ పూనుకుంటాడు.] ఇక చదవండి—

వాతావరణం సంభాషణలోకి దిగగానే మాధవికి హుషా రందుకొంది.

"మీరు ?'' అనడిగింది ఇందిరని.

"స్కూల్ ఫైనల్ చదువుతున్నాను" అంటూ ఇందిర "మీరు బి. ఎ. చదువుతున్నారు కదూ, మీకేనా మా అన్నయ్య ట్యూషన్ చెప్పేది ?'' అనడిగింది.

"అవును. ఎవరు చెప్పారు ?

మేష్టారు చెప్పారా ?'' అంది మాధవి ఆశ్చర్యంగా

''వూఁహూ'' తల అడ్డంగా త్రిప్పింది ఇందిర ''అన్నయ్య ఎవరితోను



ఎక్కువగా మాట్లాడడు. రుక్మిణి చెప్పింది.''

''అవునే మాధవీ, నేనే చెప్పాను. ఆసలీమధ్య ఒకసారి నేనే వీళ్ళను తీసుకొద్దా మనుకొన్నాను. మనలాగే బలే సర్దాగా వుంటార్లే. వుండవలసిన స్నేహితులు మనకి'' అంది రుక్మిణి.

''అలాగా ?'' అంటూ సంతోషంగా మాధవి దగ్గరగా జేరింది.

నిముషంలో రుక్మిణీ, మాధవీ, పద్మా ఎప్పటినుంచో పరిచయ మున్నట్టు మాట్లాడుకోసాగారు. ఎందుకో ఇందిరకు మాధవీ, పద్మా ఒకేరకం మనస్తత్వం కలవా ళ్ళనిపించింది. ఏ పరిస్థితులలో యెలా నడుచుకోవాలో తెలిసినవాళ్ళు ; మధ్య మధ్య తప్పనిసరిగా ఒక్కోమాటకు జవాబు చెప్పటం మినహాగా ఇందిర వాళ్ల సంభాషణలో కలియలేదు. అనేక ఆలోచనలతో కొట్టుమిట్టాడుతోంది ఆమె మనస్సు.

పది గంటల వేళ అనంతయ్యగారు దిగారు మెయిల్‌లో. ఆయనకు వీధిలోనే నౌఖర్లు సంగతులన్నీ యేకరువు పెట్టేశారు. లోలోపల చాలా ఖంగారు పడ్డా పైకి గాంభీర్యం నటిస్తూ వెళ్ళి జానకమ్మ గార్ని పరామర్శించాడు. ''ఎవ్వరికీ కలనైనా హాని తలపెట్టని మీ కుమారునికి భగవంతు డెవరివల్లా హాని కల్గించడు. అత డెక్కడున్నా వెదకి ఒప్పజెప్పే భాధ్యత నాది'' అని అభయ మిచ్చాడు. ''నేను స్నాన భోజనాలు ముగించి అదే పనిమీద వుంటా నమ్మా. మీ కే బెంగా వద్దు. రండి, మీరుకూడా భోజనాలు చెయ్యాలి. మీ రలా కూర్చుంటే యిక యీ యింట్లో ఎవరూ ముద్ద యెత్తరు;'' అని పట్టుదలగా తనతో భోజనాల గది లోకి తీసుకొని వెళ్ళాడు.

వంటమనుషులు వడ్డిస్తూండగా కుటుంబ మందరూ, అతిథులూ ఒకేసారి డైనింగ్ టేబుల్ చుట్టూ కూర్చుని భోజనాలు కానిచ్చారు. 'ఇంటినిండా వెండి, మెటల్ సామగ్రి, విలువైన సోఫాలు, కుర్చీలు, కార్లు; నాలుగంతస్థుల భవనం — అడుగడుగునా నౌకర్లు — ఇటువంటి వాళ్ళు నా కొడుకు నింత అభిమానించట మేమిటి ?' అని ఆలోచించ సాగింది జానకమ్మ.

''ఏమిటమ్మా ' ఆ ఆలోచన ? కానివ్వండీ మరి'' అని హెచ్చరించాడు అనంతయ్య మధ్యలో. దానితో కాస్త జాగ్రత్తలో పడింది జానకమ్మ.

కాని భోజనం చేస్తూండగా తిరిగి మనసులో ఆలోచనలు ముసర సాగాయి నౌఖర్లు వంటచేసి వడ్డించటం. ఓ మడా, పాడా ? కుర్చీలో కూర్చుని బల్లపై భోజనం చేయడం. రుక్మిణీ, మాధవీ, శ్యామసుందర్ మరీని ; కాళ్ళ చెప్పులు విడవకుండానే భోజనం చేస్తున్నారు ఇటువంటి అనాచారులతోనే తన కొడుక్కి స్నేహాలూ, విందులూ ఎక్కువయ్యాయి

అందువల్లే యింత అనర్థం కొని తెచ్చు కున్నాడు మరి! వాడి మూలంగానే తాను కూడ ఈ అనాచారులతో కలసి తిండి తినవలసివచ్చింది. తనదగ్గ రేదో రహస్యంగా దాస్తున్నారు కాని, ఇందులో వీళ్ళ ప్రమేయ మేమీ లేనిదే యింత శ్రద్ధ చూపుతున్నారా? క్రమంగా జానకమ్మ మనస్సులో కొడుకు విషయంలో గల ఆత్రత, భయం స్థానే అనుమానం, అసహ్యం ఆవరించసాగాయి. భోజనం ముందునుంచి తినీ తినకుండానే లేచి పోయింది.

అందరూ మేడమీద హాల్లో చేరారు. ఆ రోజుకు మాధవీ, రుక్మిణీ కూడ కాలేజీ మానుకుని ఇంటిదగ్గరే వుండిపోయారు. అనంతయ్య తీరికగా సోఫాలో వెనుకకు వాలి చెప్పసాగాడు.

"నేను అబ్బాయి పని గురించే హైద్రాబాద్ వెళ్ళానమ్మా. ఇక్కడున్న ప్రిన్స్‌పాల్ చాలా దుర్మార్గుడు. చిన్న విషయాన్ని పెద్ద గొడవచేసి, క్షమాపణ పత్రం వ్రాసిమ్మన్నాడట. అందుకు మీ అబ్బాయి అంగీకరించకుండా ఉద్యోగమే వదలుకోవటానికి తయారయ్యాడు. మంత్రులలో చాలామంది నా చేతులలో వాళ్ళు; నేను చెప్పినది వేదవాక్యం. మొన్న హైద్రాబాద్ వెళ్ళి నిముషాల మీద ఆ ప్రిన్స్‌పాల్‌కు 'రివర్షన్, ట్రాన్స్‌ఫర్' ఆర్డర్లు వేయించేశాను. ఈ పాట్టికి అనంతపురం పోవడానికి మూటా, ముల్లే సర్దుతూంటాడు.

"ప్రిన్స్‌పాల్ అండ చూచుకునే ఆ పిల్లల అల్లరి. అతడు లేకపోతే వీళ్ళూ తోక ముడుస్తారు. ట్రాన్స్‌ఫర్ ఆర్డర్సు నిన్న జేరివుంటాయి కాలేజీకి. బహుశః ఆ కక్షతో కాలేజీలో యింకేమీ చెయ్యలేమని ఏదో ఈ విధంగా తీర్చుకుని వుంటారు. అబ్బాయి ప్రాణాల కేమీ హాని వుండదు. అంతవరకు నేను చెప్పగలను," అన్నాడు.

"ఏమో బాబూ, మీ నోటి చలువ వల్ల ఆ భగవంతు డలాగే చల్లగా చూస్తే..." అంటూ కళ్ళు తుడుచుకుంది జానకమ్మ.

అందరికీ తమలపాకులు అందిస్తున్న సరోజిని బయట ఎవరిదో సౌంజ్ఞకు తలెత్తి చూచి మెల్లగా ఏదో పనున్నట్టు అక్కడినుంచి వెళ్ళిపోవటం ఒక్క ఇందిర తప్ప మాటల సందడిలో ఎవరూ గ్రహించలేదు. సరోజిని వెళ్ళిన దిక్కుగా కిటికీలోనుంచి తల వంచి చూచింది. ఎవరికీ కన్పించకుండా వరండాలో కేశవరావు నిల్చునివున్నాడు. రెండు నిముషాలతడితో ఏదో మాట్లాడి సరోజిని తిరిగి లోపలి కొచ్చి మెల్లగా మామగారి కేదో చెప్పింది.

"నాకోసం ఎవరో వచ్చారట. మళ్ళీ కలుస్తానమ్మా. మీరేం బెంగపడకండి" అంటూ అనంతయ్య లేచి మెల్లగా వెళ్ళి

పోయాడు. ఆ వెనుకనే ఆదిలక్ష్మికూడా వెళ్ళిపోయింది. కిటికీ కర్టెన్స్ సరిచేస్తూన్న సరోజిని దగ్గర కెళ్ళి, "కేశవరావుగా రేమైనా చెప్పారాండీ?" అనడిగింది ఇందిర మెల్లగా.

సరోజిని ఒక్క క్షణం ఇందిర ముఖంలోకి చూచి, "ఏం చెప్పలేదు. పోలీస్ రిపోర్టిచ్చివచ్చారట. మామగారు ఊరునుంచి వచ్చాక కల్సుకోలేదుకదూ? అంచేత ఒకసారి కన్పిద్దామని పిలువమన్నారు" అంది సరోజిని.

ఇందిర కా మాటలలో నమ్మకం కుదరలేదు. 'తండ్రిని కల్సుకోవడానికే అయితే హాల్లోకే రావచ్చునుగా. అలా ముఖం చాటు చేయడం దేనికీ?' మనస్వంతా భయ మావరించేసింది. అయినా సరోజనిని తరచి అడగడానికి ధైర్యం చాలలేదు. అలా రకరకాల భయాందోళనలతో కిటికీకి జేర్లబడి తోటలోకి చూస్తూ నిల్చుంది.

సుమారు ఒక అరగంట అనంతరం కాంపౌండులో కొచ్చి ఆగిన కార్లోంచి అనంతయ్యా, కేశవరావూ, గుమస్తా దిగారు. అయిదు నిముషాలలో అనంతయ్య మేడమీది కొచ్చాడు. నుదుటిపై చెమట ఒత్తుకుంటూ కుర్చీలో కూర్చుని, "అమ్మా! మీ అబ్బాయి క్షేమంగా వున్నాడు" అన్నాడు నవ్వుతూ కాని ఆ నవ్వు చాలా భారంగా వున్నట్లు, బలవంతాన నవ్వుతున్నట్లూ స్పష్టంగా తెలుస్తోంది.

"రండి, చూద్దురుగాని" అన్నాడు తిరిగి లేస్తూ.

కాని ఎవరి మటుకు వారే శిలా ప్రతిమలలా వుండిపోయారు, అనుమానంగా చూస్తూ.

క్షేమంగా వున్నవాడు మీతో కలసి రాక, చూడ్డానికి మనం వెళ్ళడ మేమిటి? ఎక్కడ వున్నాడు, ఎలా వున్నాడు?" అంది జానకమ్మ ఆందోళన వ్యక్త పర్చుతూ.

అనంతయ్య తలొంచుకుని మౌనంగా నాలుగు సార్లు అటుయిటు పచారు చేశాడు. తర్వాత, "చూడండి. నేనబద్ధం చెప్పటంలేదు. అబ్బాయి క్షేమంగానే వున్నాడు. అతడి కింకే ప్రమాదమూ లేదు; ఈ చిన్న ప్రమాదమైనా జరుగకపోయేదే, అతడు కొంచం ఆలోచన కలిగి ప్రవర్తిస్తే. నే నెప్పుడతడికి కబురంపినా కారు పంపించేవాడిని కదూ? ఎవడో వచ్చి కాలి నడకను రమ్మంటే యేమాత్రం అనుమానం లేకుండా అతడివెంట ఎలా వెళ్లాడని?"

ఆ మాటలు చికాకు కలిగించాయి జానకమ్మకు "ఇంతకూ అబ్బాయి ఎలా వున్నాడో చెప్పలే దేమిటి బాబుగారూ? నా కడుపు బాధ మీ కర్థం కావడంలేదు" అంది

"చెప్తున్నా నమ్మా. మీరు మాత్రం ఏమీ ఖంగారుపడకూడదు. అబ్బాయి కొచ్చిన ప్రమాద మేమీ లేదు. కొద్దిగా చిన్న దెబ్బలు మాత్రం తగిలాయి. ఆస్పత్రిలో వున్నాడు.''

జానకమ్మ పై ప్రాణం పైనే ఎగిరి పోయింది. "నాయనోయ్, దెబ్బలే? నా బిడ్డని కొట్టడాని కెవడికి చేతు లొచ్చేయిరోయ్! చీమ కైనా హాని చెయ్యడే?'' అంటూ గుండెలు బాదుకుని శోకాలు పెట్టసాగింది.

ఆమె రెండు చేతులూ పట్టుకుని సరోజనీ, రుక్మిణీ ఓదార్చడానికి శత విధాల ప్రయత్నించారు. ఇందిరా, పద్మ నిశ్శబ్దంగా రోదించసాగారు. ఎన్నడూ దుఃఖ మెరుగని మాధవికి కూడ ఎందుకో కళ్ళనుండి నీళ్ళు బొట బొటా రాలాయి. హృదయం బరువెక్కి పోయింది.

ఆమె శోకవేగం కొంత తగ్గాక కేశవరావు చెప్పాడు, "జనరల్ హాస్పటల్‌లో వున్నాడు. నాల్గు రోజుల పాటు డాక్టర్ వైద్యం అవసరమే కాని మనం మరీ ఖంగారు పడవలసిన దేమీ జరుగలేదు. డాక్టర్లంతా అదే చెప్పారు. మీ రక్కడ ఇలా ఆవేశపడకూడదు మరి.''

జానకమ్మ మాట్లాడలేదు. ఇంకా వెక్కెక్కి ఏడ్వసాగింది.

''ఇందాక నే నడిగితే మీరు చెప్ప లేదు కదూ?'' అంది ఇందిర సరోజినిని.

సరోజిని తల దించుకుంది. తర్వాత మెల్లగా అంది," గోపాలస్వామి గుడి ప్రక్క సందులో ఎవరో తెల్లవారు ఝామున స్నానానికి వెళ్తుండగా కాళ్ళకు తగిల్తే నలుగురూ పోగై చూచారట. స్పృహ లేని స్థితిలో దెబ్బలుతో వున్న మనిషట. పోలీసులకు తెలియపరిస్తే వాళ్లు జనరల్ హాస్పటల్‌లో జాయిన్ చేశారట. ఎవరికీ ఫలానా అని తెలీలే దట. ఇందాక ఈ సంగతులు ఎస్. ఐ. చెప్తే అసలు ఆయన ఔనో కాదో చూచి వస్తా నని వెళ్ళారు. అసలే గాభరాగా వున్న మిమ్మల్ని అనుమానంలో వున్న సంగతి చెప్పి భయపెట్టడం దేని కని నేను చెప్పలేదు; అంతేకాని మరో వుద్దేశ్య మేమీ లేదు.''

"మళ్లీ పన్నెండు దాటితే విజిటర్స్‌ను చూడనివ్వరు. త్వరగా బయల్దేరాలి.'' త్వరపడ్డాడు అనంతయ్య.

ఎలాగైతేనేం అందరూ బయల్దేరారు రెండు కార్లలో. ఆదిలక్ష్మి బయల్దేరక పోవడం చూచి ''నువ్వు రావా?'' అనడిగాడు అనంతయ్య వెనక్కు వెళ్ళి.

"రావడంలేదు'' అంది ముక్తసరిగా ఆదిలక్ష్మి.

"వస్తే బాగుంటుంది. వాళ్ళేమను కొంటారు? అదీకాక పాపం అత డా స్థితిలో వుంటే...''

"ఏ మనుకొంటే నేం, ఏమైతే నా కేం? అయినా ఎందుకో యిదంతా

నా కేం అర్థం కావటం లేదు. వాళ్ళేం బంధువులా? స్నేహితులా?" కఠినంగా అడిగింది ఆదిలక్ష్మి.

తిరుగు జవాబు కేశవరావు నుండి వచ్చింది. "బంధువులు, స్నేహితులు చేసుకొంటే అవుతారు కాని, ఆదిలోనే ఎలా గౌతారు? అయినా తల్లివి. తోటి తల్లి హృదయం ఏడుస్తూంటే ఓదార్చవలసిన ధర్మం నీకు లేదూ? – అదైనా పరిచయ ముంది గనుక. లేకపోతే ఏ గొడవా లేదు" అంటూ తండ్రిని "నడవండి నాన్నగారూ.మన కివి రోజూ వున్న అనుభవాలేగా?" అన్నాడు.

"ఒరేయ్ శ్యాం. నీ కెందుకురా ఆ గొడవ లన్నీ? ఆ తండ్రీ పిల్లలంతా ఒకటి. వాళ్ళను వెళ్ళనీ. మన కెందుకు?" అంది ఆదిలక్ష్మి తమ్ముడిని.

"వూరుకో అక్కా. నీ కన్నీ పట్టింపులే –" అంటూ శ్యామసుందర్ కూడా అనంతయ్య వెంట వెళ్ళిపోయాడు.

హాస్పటల్ రూమ్‌లో కెళ్ళే ముందు అందర్నీ కేశవ్ ఓసారి హెచ్చరించాడు. "అతడి ఎదుట ఎవ్వరూ కంట తడి పెట్టవద్దు, గాభరాగా మాట్లాడవద్దు," అంటూ. అంతలోనే ఆ రూమ్ నుండి వస్తూన్న డాక్టర్ ఎదురుపడ్డాడు.

కేశవరావూ, అనంతయ్యా అతడికి నమస్కరించి పాణి విషయం అడిగారు.

"చక్రపాణిగారి కిప్పుడే స్పృహ వచ్చిందండీ. తెలివిగానే మాట్లాడుతున్నారు. తలమీది గాయం కొంచెం బలంగానే వుంది కాని ఇందులో వ్యాకులం పొందవలసిం దేమీ లేదు. త్వరలోనే తగ్గిపోతుంది. లోపలికి వెళ్ళి చూడండి" అంటూ వెళ్ళిపోయాడు "ఇప్పుడే కాఫీ, బ్రెడ్డూ ఇప్పించాను మీరు మరేమీ ఇవ్వవద్దు" అని హెచ్చరించాడు వెళ్ళిపోతూ.

ముందు కేశవరావూ, అనంతయ్యా, సరోజనీ లోపలికి వెళ్ళారు.

పది నిముషాలు పోయాక నర్సువచ్చి మిగిలిన అందర్నీ లోపలికి తీసుకు వెళ్ళింది. తలకు పెద్ద కట్టు, కుడి మణికట్టుకు పెద్ద బాండేజీతో దుమ్ము కొట్టుకుపోయి రక్తపుచారలతో నున్న బట్టలతో, కళ్ళు లోతుకు పోయి చెట్టంత కొడుకు బల్లిలా మంచాన పడివుండడం చూడగానే జానకమ్మకు కడు పుడికిపోయి శోకం ప్రవాహంలా వచ్చేసింది అంతకు ముందే అందరు చేసిన బోధలూ మరచిపోయి బావురు మంది.

"నా కేం ఫర్వాలే దమ్మా, ఖంగారు పడకు," అంటూ నీరసంగా ఎడంచేతితో తల్లి కళ్ళొత్తసాగాడు చక్రపాణి

"ఏంఖంగారు నాయనా? ఎందుకింత బాధలు కొని తెచ్చుకుంటున్నావు?" ఎంతకూ ఆమె శోకం అధిక మవ్వటమే కాని తగ్గకపోవడం చూచి ఒక నర్సు బలవంతంగా బయటకు తీసుకుపోయింది. నీరసంగా వున్న పాణికి

కూడా తల్లి బాధను చూచి అంతరంగంలో చెలరేగిన వేదన కన్నీటిగా రూపొందింది. ఇందిర నిశ్శబ్దంగా అన్న చెంపలపై జాలువారే అశ్రుధారలను ఒత్తసాగింది. సరోజనీ, రుక్మిణీ కళ్ళొత్తుకుంటూ ముఖాలు మరోవైపుకు త్రిప్పేసుకున్నారు. ఎవరి మట్టుకు వారే అశ్రువులను కనురెప్పల మాటున దాచ వ్యర్థ ప్రయత్నం చేస్తూ కళ్ళెత్తి చూడలేక పోతున్నారు. దుఃఖంతో పూడుకు పోయిన కంఠాలు విప్పి మాట్లాడుకో లేక పోతున్నారు.



కాస్సేపటికి చక్రపాణి తమాయించు కున్నాడు. "చాలా ఖంగారు పడ్డారా? భోజనాలు చెయ్యలేదామ్మా?" అన్నాడు దగ్గరే కూర్చున్న చెల్లెలితల నిమురుతూ.

"చేశా మన్నయ్యా'. అంటూ జరిగిందంతా క్లుప్తంగా చెప్పింది ఇందిర.

అంతా విన్న చక్రపాణి ఆశ్చర్యానందాలు అవధులు దాటిపోయాయి. ఆ సంతోషంలోనే పరసహాయ్యం పొందవలసివచ్చిం దనే కించిత్ లజ్జకూడ మిళితమై బాధ పడ్డాడు.

"ఆప్త బంధువులలా ఆదుకున్న మీకు ఏమని కృతజ్ఞత చెప్పుకోను? మీరే లేకుంటే వీ శ్ళమై పో యే వా రో;" అన్నాడు అనంతయ్యవైపు తిరిగి కృతజ్ఞత మెరిసే కండ్లతో.

"ఏమిటండీ? సామాన్య మానవ ధర్మం నెరవేర్చి నందుకే అంత బరువైన పదాలు వాడేస్తున్నారు? ఇంతకూ అసలీ ఆ నర్థ మెలా జరిగింది?" అన్నాడు కేశవరావు.

మెల్లిగా గుర్తు చేసుకుంటూ చెప్పాడు చక్రపాణి. ''నిన్న సాయంత్రం ఏమీ తోచక నదిఒడ్డుకు షికారుకు వెళ్ళాను. అక్కడనుంచి మా కొల్లీగ్స్-ముకుందం, ఆనందంతో కలసి పిక్చర్ కెళ్ళాను. పిక్చర్ చూసి ఇంటికొచ్చి సరిగా భోజనం ముందు కూర్చున్నానో లేదో — ఎవరో కుఱ్ఱా డొచ్చి. 'అనంతయ్యగారు వూరినుం చొచ్చారు — ర' మ్మంటే వెంటనే బయల్దేరాను......

మధ్యలో అడ్డుపడి అడిగాడు కేశవరావు. "సినిమా నుంచి వచ్చేదారిలో మిమ్మ ల్నెవరైనా వెంటా డ్తున్నట్టు అన్పించిందా మీకు?"

పాణి కొంచం ఆలోచించి అన్నాడు "ఏమో? పిక్చర్ వదిలాక రోడ్ల వెంబడి చాలామంది జనం వుంటారు కదూ? అంచేత నాకెవరిపైనా అనుమానం కలిగే అవకాశం లేదు..... కాని సినీమాలో కరుణాకరం అతడి క్లాస్‌మేట్స్ కన్పించారు. కన్పించడమేకాని వారి ప్రవర్తన ఆ విధంగా లేదు సుమండీ. ఏదో వాళ్ళూ పిక్చర్ చూశారు; వెళ్ళిపోయారు."

"ఇంకా అనుమాన మేమిటి? వాళ్ళే" అన్నాడు శ్యాంసుందర్.

కేశవ్ అవు నన్నట్టు తల పంకించాడు "అయితే మాష్టారూ? మీరు ఆ కుఱ్ఱాడితో వెంట నడచి వెళ్ళారా, లేక. " అనంతయ్య సాలోచనగా చూస్తూ అడుగుతూన్న ప్రశ్న అర్థోక్తిలో ఆపేశాడు

"నడిచే వెళ్లాను" అన్నాడు చక్రపాణి.

''ప్చ్, ఇంత అమాయకులు మీ రెలా బ్రతుకుతా రండీ? నేనెప్పుడూ మీ కోసమై కారు పంపిస్తున్నానుకదా? కనీసం రిక్షా అయినా లేకుండా రెండు మైళ్ళ దూరం నేను మిమ్మల్ని నడిపించగల నని ఎలా అనుకున్నారు? ముక్కూ-

ముఖమూ తెలియని ప్రతివాడినీ అలా నమ్మేయడమే?'' అంటూ విచారించాడు అనంతయ్య.

"సరే, తర్వా తేంజరిగింది ?'' కేశవ రావు ప్రశ్నించాడు.

"తర్వాత ...... మీ సంగతు లేవేవో అడుగుతూంటే అతడు ప్రతిదానికీ ఏదో నటుతూ అవక తవక సమాధానాలు చెప్తూవచ్చాడు. ఏదో తెలివి తక్కువవా డనుకున్నాను కానీ ఇంత ప్రమాదాన్ని ఊహించలేకపోయాను. గోపాలస్వామి గుడివీధి దాటి సందులో అడుగు పెట్ట



గానే అతడు సన్నగా ఈల వేశాడు. మళ్ళీ ఎక్కడో ఎవరో అదే విధంగా ఈల వేయడం నాకు స్పష్టంగా వినిపించింది. అనుమానంతో నేను తల ప్రక్కకు త్రిప్పేలోగానే ఏదో నా తలపై బలంగా తగిలింది; 'అమ్మా !' అనుకొంటూ చేత్తో తల పట్టుకున్నాను. ఆ చేతిమీదా, తలమీదా మరోదెబ్బ — అంతే ! ఇక నా కేమీ తెలియదు. మళ్ళీఇక్కడే, ఇప్పుడే కళ్లు తెరిచాను" అంటూ ముగించాడు చక్రపాణి దెబ్బలు తడిమిచూచుకుంటూ.

అందరితోపాటు వింటూన్న దల్లా మాధవి చటుక్కున లేచి బయటకు వెళ్ళిపోయింది. అందరూ ఆశ్చర్యంతో అటే చూస్తూండగా జానకమ్మ లోనికివచ్చింది. ఈ సారి ఆమె ఏడవడం లేదు. తిరిగి ఆమెతో సంభాషణలోపడి తాత్కాలికంగా మాధవిసంగతి మరచిపోయా రందరూ.

"ఇక మీరు వెళ్ళాలండీ. పైమై పోయింది" అంటూ సిస్టర్ వచ్చింది.

అంతా బరువుగా లేచారు.

"ఒక రిద్దరుండండి ఆయన సంరక్షణకు. మిగిలినవారు వెళ్ళిపోవాలి." అంది సిస్టర్ తిరిగి.

"అంతా వెళ్ళండి బాబూ, ఇక నేను చూచుకుంటాను" అంది జానకమ్మ. కేసవరావు ఒప్పుకోలేదు. "మీ దసలు బేల మనసు. నిష్కారణంగా ఖంగారు పడిపోతారు" అని అత డంటుండగా, "ఎవరూ అవసరం లేదు. నేను చూచుకోగలను అన్నయ్యాను, మీరు వెళ్ళండి'' అంది ఇందిర.

కేశవరావు నవ్వాడు. "నిజమేనమ్మా, ను వ్వెంతకైనా తగిన ధైర్యస్థురాలివి కాని మేము వదలి వెయ్యగలమా ? సరోజినినీ గుమాస్తానూకూడ ఇక్కడ వుంచేస్తాను. జాగ్రత్తగా చూడండి. నేను మళ్ళీ సాయంత్రం వస్తాను." అన్నాడు

"అవును. అలా చేద్దాం" అన్నాడు అనంతయ్య.

"అయితే నేను చూచుకోకుండా వుండగలనా ?" అంటూ పట్టుబట్టింది జానకమ్మ.

"మళ్ళీ సాయంత్రం వచ్చి చూద్దువు గాని లేమ్మా. ఇక అన్నయ్య కేమీ ఫర్వా లేదు'' అని నచ్చజెప్పింది ఇందిర.

"కేశవరావుగారూ !'' నీరసంగా పిల్చాడు చక్రపాణి. "మీరు పడ్డ శ్రమంతా చాలక సరోజినిగారిని కూడ ఇబ్బంది పెట్టడం దేనికీ ? మీ సపర్యలు వదలి ఆవిడ నిక్కడ వుండమనడం భావ్యమా ? నేను తలెత్తగలనా ?''

"ఏమిటండీ ? మే మంత ఆత్మీయంగా చూచుకున్నా అంత పరాయి వాళ్ళలా మాట్లాడ్తారు ? స్నేహితుల మైవుండీ ఎందుకు మరి ?''

"మీరు వద్దన్నా నే నిక్కడే వుంటాను నా కేమీ బరువు లేదు." అంది సరోజిని నవ్వుతూ.



"ఇం కేమనగలను ? ధన్యుణ్ణి. మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను."

అని రెండుచేతులూ జోడించాడు చక్రపాణి అనంతయ్యనూ, కేశవరావునూ

ఉద్దేశించి. "మరొక్క సాయం చెయ్య గలరా ?'' అన్నాడు సందేహిస్తూ మంద స్వరాన.

"ఏమిటి, చెప్పండి ?'' అన్నాడు కేశవరావు.

చాలా సంకోచించి చివరకు చెప్పాడు పాణి. "ఏం లేదు. మా తమ్ముడు రఘు వైజాగ్‌లో మెడిసిన్ చదువుతున్నాడు. టెలిగ్రాం యిప్పిస్తారా ?'' సిగ్గుపడ్తూ, ప్రాధేయపడ్తున్నట్లు అడిగాడు.

"ఓస్, ఇంతేగా ?'' నవ్వాడు కేశవ రావు. "మిమ్మల్నన్నివిధాలా స్వంత తమ్ముడిలా చూచుకొనేవాడిని నే నున్నాను. అయినా మీరు తప్పనిసరిగా రప్పించమంటే అలాగే చేస్తాను. ఇందిర ఉదయమే చెప్పింది. కాని అనవసరంగా చదువు పాడౌతుంది. 'ఫైన లియరు' కూడాను. ఏమంటారు ?''

"అది కాదండి. వాడొస్తే ఇక మీకే శ్రమా ఉండదు. ఒక్కనాటికి ఫర్వాలేదు కానీ మా ఫామిలీ ఎన్నాళ్ళని మీ ఇంట్లో......''

"నో మెన్షన్. అటువంటి దేమీ పెట్టు కోకండి. మరి మేం వుంటాం."

డాక్టర్‌తో మాట్లాడి వెళ్ళిన అనంతయ్యకూడా రావడంతో అందరూ వెళ్ళిపోయారు. అప్పుడు వచ్చింది వారికి మాధవి అజ.

ఆస్పత్రి ఆవరణలో ఒక చెట్టుక్రింద పచ్చికపై కూర్చుని వుంది మాధవి యేమేమో ఆలోచిస్తూ.

''అక్కడి నుంచి అలా వచ్చేశా వేమిటి మాధవీ ?'' అంది రుక్మిణి. మాధవి మాట్లాడలేదు. "దాని కిటువంటి వాతావరణం కిట్టదు మరి.'' అంటూ సరి పెట్టేశాడు కేశవరావు.

## 11

హాస్పిటల్ నుంచి తిరిగి వచ్చిన భర్తకూ కుమారునికీ కాఫీ లిస్తూ, "సరోజి నేదీ ?'' అనడిగింది ఆదిలక్ష్మి.

''చెప్తాను కానీ, వాళ్ళంతా హాలులో వున్నారు. ముందు వాళ్ళకు కాస్త యేమైనా చూద్దూ'' అన్నాడు అనంతయ్య.

''తెల్పులెద్దురూ నాకూ ఆ మాత్రం మర్యాదలు. వంటమనిషి అన్నీ తీసుకు వెళ్లాడు. మాధవీ, శ్యామసుందర్ దగ్గ రుండి కనుక్కుంటున్నారు. ఇంతకూ మన సరోజి నేమయ్యింది ?''

''మన సరోజినీ, వాళ్ళ ఇందిరా ఆ అబ్బాయి దగ్గ రున్నారు. నేనే వుండ మన్నాను.''

''ఏమిటీ ?'' నిర్ఘాంతపోయింది ఆది లక్ష్మి. ''పాతికేళ్ళయినా లేని ఆడపిల్లని ఎవరో పరాయివాడి దగ్గర వదిలేసి వచ్చారా ? నలుగురూ ఏమనుకుంటారు ? ఇక మన పరువూ, మర్యాదా యేమైనా నిలుస్తాయా ? అవ్వ ! ఇంటి కోడల్ని

ఎవరికో సేవ చెయ్యమన్నారట! ఏ మందైనా తినలేదుగదా ఈ తండ్రీ కొడుకులు? లేకపోతే పరాయివాడిపై ఇంత శ్రద్ధేమిటి?'' ఆవిడ అలా నోరూ, నెత్తీ బాదుకుని వగరుస్తూంటే ఏమనాలో తోచక తండ్రీ కొడుకు లిద్దరూ ముఖ ముఖాలు చూచుకున్నారు.

కడకు కేశవరావు అన్నాడు, "ఆపదలో వున్నప్పుడు సాయం చేయక పోతే ఎలాగమ్మా? అతడు చాలా మంచివాడు. వాళ్ళతో పరిచయం వల్ల మన పరు వేమీ అయిపోదు.''

"చాల్లేరా, చెప్పొచ్చావు!'' ఈసడించింది ఆదిలక్ష్మి. "ఇంతకూ మీ రుండ మంటే అ దెలా వుంది? దానికి బుద్ధి వుండద్దూ? రానీ చెప్తాను.''

ఇక అనంతయ్య ఊరుకోలేక పోయాడు. "మరి ఆపుజేస్తావా నీ దూకుడు? నే నేం అంత తెలివితక్కువ వాడి ననుకున్నావా? ఏ పనైనా బాగా ఆలోచించి చేస్తాను. వెఱ్ఱివాడిని కాను; వూరికే మతిలేనట్టు ఎవరి చుట్టూనో తిరగడానికి. మళ్ళీ నువ్వు ఆ విషయమై ఆవిధంగా మాట్లాడడానికి వీలులేదు.'' శాసించినట్లున్న ఆ తీవ్ర ధోరణికి ఆదిలక్ష్మి మరి మాట్లాడ సాహించలేక ఆ కోప మంతా అప్పుడే అక్కడికి వచ్చిన కూతురిపై వెళ్ళగ్రక్కింది. "నువ్వొచ్చేశావేం? నువ్వూ అక్కడే పడివుండలేకపోయావా? ఆ మేష్టరంటే పడి ఛస్తావ్?''

ఒక్కసారి తల్లివంక చురుగ్గా చూచింది మాధవి. "అవును. ఉందా మనే అనుకున్నాను. కాని ఏం లాభం? కాస్త మందివ్వటమైనా చేతకానిదాన్ని. తిని, గంతు లేస్తూంటే చూడడమే కాని పని పాటలు నేర్పకపోతివి.''

"అయ్యో, అయ్యో!'' దిగ్భ్రాంతురాలై పోయింది ఆదిలక్ష్మి. "ఏ పనీ చెప్పకుండా గారాబంగా పెంచుకున్నందుకు ఇదా నువ్వు నన్ననవలసిన మాట? ఒక్కొక్కళ్ళు ఎంతంతలేసి మాట్లాడుతున్నారు! సందేహం లేదు. అందరికీ ఒక్కసారే మతులు పోయాయి.''

నిజానికి మాధవి మాటలు ఒక్క తల్లినే కాదు — అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తాయి. ఆమె అంత లోతుగా మాట్లాడగా ఎవరూ ఎప్పుడూ వినలేదు. ఎప్పుడూ వికసితపద్మంలా కలకల లాడ్తూండే మాధవి ముఖం హాస్పిటల్ కెళ్ళినప్పట్నుంచీ చిన్నబోయి పరధ్యానంగా వుండటం గమనించిన కేశవరావు చెల్లెలిలో ఏదో మార్పు వచ్చిందని గ్రహించాడు. ఆమె దృష్టి త్రిప్పే ప్రయత్నంలో "ఇలా రా బిందూ. వాళ్ళు కాస్సేపు పడుకుంటారేమో. ప్రక్కలు వేయించు. నువ్వూ అక్కడే వుండు'' అని పంపేశాడు ఆ గదిలోనుంచి.

## 12

సాయంకాలం హాస్పిటల్‌లో వున్న చక్రపాణిని చూడటానికి రుక్మిణీ, వెంకటేశం, శ్రీహరీ కలసివచ్చారు. 'చక్రపాణికి దెబ్బలు తగిలి ఆసుపత్రిలో వున్నాడని కాలేజీ అంతా హోరెత్తిపోయిందనీ, తాము చాలా విచారించా' మనీ చెప్పారు వాళ్లు.

''రెండు దెబ్బలు తగిల్తే తగిలాయి కానీ, వెధవల రోగం మహా బాగా కుదిర్చారు లెండి. తలలు వాలేసుకుని సగం చచ్చినట్టు తిరుగుతున్నారు'' అన్నాడు జబ్బలు చరుచుకుంటూ శ్రీహరి.

ఆశ్చర్యంగా చూచాడు పాణి 'ఏమి' టన్నట్టు.

వెంకటేశం, శ్రీహరీ విస్మయంతో



ముఖ ముఖాలు వీక్షించుకుని, సంశ యంతో రుక్మిణి ముఖం చూచారు.

రుక్మిణి నవ్వి ఏదో చెప్పబోతూండగా సరోజిని వద్దన్నట్టు సైగ చేసింది.

''ఫర్వాలేదు వదినా. మనవాళ్ళే. రహస్యంగానే వుంచుతారు" అంటూ రుక్మిణి చక్రపాణివైపు తిరిగి "ఉదయం మీరు మరీ నీరసంగా వున్నారని ఆ విషయాలేమీ మాట్లాడలేదు మేం. అనంతయ్యగారు నిముషాలమీద ప్రిన్స్పాల్‌కు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ తెప్పించారు ; రివర్షన్ కూడాను ! అందుకే ఇక తమ ఆటలు సాగవని కరుణాకరం ఈ విధంగా కక్ష తీర్చుకున్నాడు.''

అతి ఆశ్చర్యంగా విన్నాడు చక్రపాణి. ''ఇందుకా అనంతయ్యగారు నన్నంత ధైర్యంగా రెండు రోజులు సెలవు పెట్ట మన్నారు ! ఎందు కాయనకు నాపై ఇంత దయ ?"

రుక్మిణి సరోజిని ఒకర్నొకరు చూచుకుని గుంభనగా నవ్వుకున్నారు.

ఆదేమీ గమనించని శ్రీహరి "నిజంగా మీ కీ విషయం తెలియదా మాష్టారూ ? అందరూ అలాగే చెప్పుకుంటున్నారు. మీరు మాధవిగారికి ప్రైవేటు చెప్తున్నారు గనుక అనంతయ్యగారు మీకు తప్పక సాయం చేస్తారని ముకుందం గారు సమ్మె జరిగినరోజునే అన్నారు." ఇంకా ఏదో చెప్పబోయిన శ్రీహరి వెంకటేశం సైగలు చూచి ధోరణి ఆపు జేశాడు.

"ఎంత చిన్న విషయం ఎంత పెద్దదిగా మారిపోయింది. ప్చ్." విచారించాడు చక్రపాణి.

అది శ్రీహరికి నచ్చలేదు. "ఏమిటి మాష్టారూ, అలా విచారిస్తారు? ఆ ప్రిన్స్పాల్‌కు అలా జరగవలసిందే. ఇంక ఆ కరుణాకరంగాడున్నాడు; వాడినీ వదలిపెట్టరులెండి అనంతయ్యగారు.''

సంశయాత్మక దృక్కులతో అన్నాడు చక్రపాణి. "అయితే కరుణాకరమే నన్ను కొట్టించాడని మీరంతా నిర్ణయించేశారేమిటి ? ఏమిటి ఆధారం."

"బాగుంది. ఆరోజు మీకు సినీమాలో కన్పించాడన్నారు. అసలీ గొడవలకంతకూ కారణమతడు. ఇంకా సందేహమేమిటి ?" అంది సరోజిని.

ఆమె మాటను తక్కిన అందరూ బలపరిచారు.

బాధగా తల అడ్డంగా త్రిప్పాడు చక్రపాణి. "నాకూ అతడిపై అనుమాన మున్నమాట నిజమే. కాని అతడే నని నిర్ధారణ చెయ్యడానికి నా మన సెందుకో అంగీకరించడం లేదు. ఒక్కోసారి ఇలాగే అమాయకులను బాధపెడ్తూంటాం తప్పుడు అంచనాలతో."

"అయితే కరుణాకరం అమాయకుడా ?'' అందరూ ముక్తకంఠంతో ప్రశ్నించారు.

"అసలు కాకపోవచ్చు. కాని ఈ విషయంలో నేననేది అందరి దృష్టి అసలే అతడిపై వున్నది కదా! అత డెందు కిలాంటి పనిచేస్తాడు? ఇంతటి దారుణాలు చెయ్యగలవాడైతే తన కక్ష ఈ విధంగానే తీర్చుకొనును కాని కాలేజీలో అంత హంగామా చెయ్యడు. అదీ కాక ఈ దెబ్బల తీరు, ఇది జరిగినప్లానూ చూస్తే అసలు నా ప్రాణాలు తీసే ఉద్దేశంతోనే చేసినట్లు కన్పిస్తోంది. ఎటూ కరుణాకరంపై అనుమానం పోతుందనే ధైర్యంతో మరెవరో చేసినపని ఇది.''

పాణి హేతువాదం అందరికీ సబబుగానే తోచింది. అందరూ మౌనంగా ఆలోచించసాగారు.

"అయితే మన కిక విరోధు లెవరున్నారన్నయ్యా?'' అనడిగింది ఇందిర.

"ఎవరూ లేరు మరి. నా ఊహ కందటంలేదు. పోనీండి ఎవరి చెడు వాళ్ళదే.'' "మీ రెంత మంచివారు మాష్టారూ!'' అంటూన్న శ్రీహరి కళ్ల చెమర్చాయి.

"కరుణాకరం ఎంత దుష్టుడైనా మీ హృదయంలో ఆ మాత్రం దయ సంపాదించగలిగినందుకు చాలా అదృష్టవంతుడే.''

"అయిపోయింది వాడి అదృష్టం. ఇక ఆ భగవంతుడుకూడ రక్షించలేడు.''

అందరూ ఒక్కసారి ఆశ్చర్యంగా ఆ మాట వచ్చిన దిక్కుకు చూచారు. ప్యాంటు జేబుల్లో చేతు లుంచి షోగ్గా మెల్లగా నడచి వస్తున్నాడు శ్యామసుందర్. ఆ వెనుకనే కేశవరావు ఉదయంనుంచీ పాణిని అటెండవుతూన్న నర్సుతో ఏమిటో నెమ్మదిగా మాట్లాడుతూ వస్తున్నాడు.

"ఆ కరుణాకరం గాడ్ని టి. సి. ఇచ్చి పంపించే సే ప్రయత్నంలో వున్నారు బావగారు. ఇక వాడి నెవరూ రక్షించలేరు.'' శ్యామసుందర్ ఇంకా యేమో చెప్తూండగా కేశవరావు ముందుకు వచ్చి మ్రింగేసేట్టు చూచాడు శ్యామసుందర్ని. దానితో ఆతడి నోటికి తాళం పడింది.

శ్రీహరీ, వెంకటేశం వెళ్ళిపోయాక కేశవరావు సన్నసన్నగా మందలించాడు శ్యాంసుందర్ని. "ఎలా వుంది?'' అని ప్రశ్నించాడు పాణిని.

"బాగానే వుందండి. కొంచం అటు యిటు కదలితే ఈ దెబ్బలు బాధపెడ్తున్నాయి. కొద్దిగా టెంపరేచర్ కూడా తగిలినట్టుంది" అన్నాడు చక్రపాణి.

"ఇక ఫర్వాలేదులెండి. అవే తగ్గిపోతాయి. డాక్టర్‌తో నేను మాట్లాడాను. మంచి ఇంజక్షన్స్ వాడుతున్నాడు. మరో సంగతి — మిమ్మల్ని ఇప్పుడు ఇంటికి తీసుకుపోవడానికి పర్మిషన్ తీసుకున్నాను, డాక్టర్‌తో మాట్లాడి'' అన్నాడు కేశవరావు పాణి ముఖ కవళికలు గమనించుతూ.

చక్రపాణి ముఖం విప్పారింది. "నేనింకా ఇప్పుడు మీకా సంగతి చెప్దా మనుకుంటున్నాను. మీరే ఏర్పాటు చేశా రన్నమాట! మీ కన్నీ తెల్సు. ఎంతైనా మీకు ఋణపడ్తున్నాను."

"చూడండి పాణిగారూ. మీరు ప్రతీదీ భూతద్దంలోనుండి చూస్తారు. మనుష్యుల మైనందుకు అవసరకాలంలో ఒకరి కొకరం కాకపోతే ఎందుకు?"

మధ్యలో ఇందిర కలుగజేసుకుంది. "అయితే మా అమ్మనూ, అక్కయ్యనూ ఇంటికి దిగబెట్టేశారా కేశవరావుగారూ?"

అర్థంగానట్టు చూచాడు కేశవ్.

అర్థమైన సరోజిని వివరించింది. "ఇప్పుడు పాణిగార్ని తీసుక్కె వెళ్ళేది మా ఇంటికే. ఆయనకు కాస్త తగ్గేవరకూ అంతా మాదగ్గరే వుండాలి."

ఆ మాటలు విన్న అన్నా చెల్లె ళ్ళిద్దరూ ముఖ ముఖాలు చూచుకోవటమే కాని కొద్దిసేపటివరకూ ఏమీ మాట్లాడ లేకపోయారు.

"ఏం? మొగమాట పడ్తున్నారా?" అన్నాడు కేశవ్.

ప్రయత్నం మీద నర్సు సహా య్యంతో లేచి కూర్చున్నాడు చక్రపాణి. నర్సును బయటకు వెళ్ళిపోమని సౌంజ్ఞ చేస్తూ "చూడండి కేశవరావుగారూ, మీ దయకు చాలా కృతజ్ఞుడిని. మీబోటివారి స్నేహానురాగాలకు పాత్రుడ నైనందుకు నిజంగా నన్ను నేనే అభినందించుకుంటు న్నాను. కాని మరీ ఇంతటి గౌరవానికి నే నసర్హుణ్ణి. మీ మాట కాదంటున్నం దుకు నన్ను క్షమించాలి. నన్ను మా ఇంటికి పంపే ఏర్పాట్లు చేయించండి." ప్రాధేయపూర్వకంగా, అణకువగా వున్నాయి ఆ మాటలు.

"ఇందులో విశేష మేముందండి? కేవలం స్నేహం. అంతేకదా? మా ఇంటిదగ్గ రుంచి వైద్యం చేయిద్దా మని; రెండు పూటలూ వచ్చి డాక్టర్ చూస్తారు. మాకూ ఆందోళన తప్పుతుంది. అదీకాక బజారుకు పోయి మందులు తేవటం — గొడవా, ఆడవాళ్ళకు చాలా ఇబ్బందిగా వుంటుంది. ఇవన్నీ ఆలోచించే నాన్నగా రావిధంగా ఏర్పాటు చేశారు."

"ప్లీజ్! ఏమనుకోకండి. నేను చాలా మూర్ఖుణ్ణని మీరు భావించవచ్చు. కాని తప్పదు. నాబోటి సామాన్యునిపై మీ వంటివారి అకారణ వాత్సల్యానికి ఏదో కట్టుకథ అల్లబోతుంది లోకం. నిష్కార ణంగా మరొకరి విమర్శకు మనం ఎందుకు గురి కావాలి చెప్పండి? ఇప్పటికే ఈ సమ్మెలు, అల్లర్లతో చాలమంది దృష్టిలోకి వెళ్ళాను. ప్రశాంత జీవితం కోరుకొనేవాడిని — నాకు తెలియకుండానే ఇటువంటి ఇబ్బందులలో చిక్కుకున్నాను. ఇప్పుడు మీ రింత అభిమానం చూపటంతో మీ సహృదయత నర్థం చేసుకోని అనేక మంది నోళ్ళకు పని కల్పించినవార మౌతా మని భయంగా వుంది. నాన్న



చలచిత్రవంచల రాగం




జయంతి పిక్చర్స్ వారి

# శ్రీ కృష్ణార్జున యుద్ధం

నిర్మాత-దర్శకుడు: కె. వి. రెడ్డి B.Sc. (HONS)

వాహిని విడుదల



గారు ప్రిన్స్‌పాల్ విషయంలో చేసిన ప్రయత్నం పదిమందికీ తెల్సిపోతుంది.

అది అంత శ్రేయస్కరం కాదని నా అభిప్రాయం.''

చాలసేపు మౌనంగా ఆలోచించిన కేశవరావు కడకు అన్నాడు. "అవును. అదీ నిజమే. కాని మరి ఇవన్నీ నేను నాన్నగారితో చెప్పాలి. ఆయన ఏమంటారో ?"

నీరసంగా నవ్వాడు చక్రపాణి. "ఆయనది వెఱ్ఱి అభిమానం. మీ మాటలు విని స్వయంగా వచ్చేయగలరు, నన్ను తీసుకు వెళ్ళడానికి. పెద్దవారిని శ్రమపెట్ట వద్దు. ఇప్పటికే మీ పనులన్నీ మానుకొని నా గురించి తిరుగుతున్నారు. అన్నిటినీ మించి సరోజినిగారు - అయినింటి కోడలు ఈవిధంగా ఇక్కడుండడం చూస్తే నాకే తల కొట్టేసినట్లుంది" అన్నాడు మందస్వరాన.

"ఫర్వాలేదు. వాటికేం కాని, ఎలాగూ నాన్నగారికి తెలియపరచనిదే నే నేమీ చెయ్యలేను. ఆయన ఎంత దయాపరులో అంత చండశాసనులు కూడా; వుండండి, వెళ్ళి ఫోన్ చేసి వస్తాను" అంటూ పాణి అభ్యర్థన వినకుండా వెళ్ళిపోయి పది నిముషాలలో తిరిగివచ్చాడు.

"సరే. మీరు చెప్పినవన్నీ చెప్పాక నాన్నగారూ అంగీకరించారు. మీ ఇంటికే వెళ్దాం. అమ్మగార్నీ వార్నీ అలా తీస్కు రావటానికి మా కారు ఇంటికిపంపేశాను. మనం డాక్టర్‌గారి కారులో వెళ్దాం."

పాణి చిరుదరహాసం చేసి వూరుకున్నాడు కాని లోలోన ఆశ్చర్యపోయాడు, 'ఎంతపలుకుబడి!' అనుకొని.

## 13

"ఏడు గంటలకా వచ్చారు. నాలు గింటికి పోయి ? ఇంత వఱకు వాడి సేవేనా ?" తీవ్రంగా ప్రశ్నించింది ఆదిలక్ష్మి కూతుర్నీ, కొడుకునీ.

ఎవరూ మాట్లాడలేదు.

"నీకైనా బుద్ధిలేదూ ? నువ్వేమైనా కోడలి ననుకున్నావా, ఇంటి అధికారిణి ననుకుంటున్నావా, యిష్టం వచ్చినట్టు తిరగడానికి ? ఎవడిదగ్గరో వగ లంతా వుండొచ్చిందట. ఏం, ఆస్పత్రంతా గొడ్డు పోయిందా నర్సులకు ?" వాదేం అన్నా తమ్ముడా నీకు ? ఆదిలక్ష్మి దూకుడు కోడలిపైకి పోయిం దీసారి. అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. సమాధానం రాకపోయేసరికి ఆదిలక్ష్మి మరింత కోపంతో వుడికిపోయింది.

"ఇంట్లో మంచినీళ్ళైనా చేతితో ముంచుకు త్రాగనివాళ్ళు ఎవడికో వూడిగం చేస్తున్నారట. ఏం, అదు గడుగునా నౌకర్లచేత చేయించి పెట్టూంటే అనుభవించ లేకపోతున్నారా ?"

ఇక ఊరుకోలేకపోయాడు కేశవరావు. "చూడమ్మా. నీమాటే నీదా. 'ఇదంతా ఏమిటి' అనే ఆలోచ నేపైనా వుందా ?" అని, "సరోజినీ ! నువ్వు వెళ్ళు. స్నానం చెయ్యి. మాధవీ! నాన్నగారు క్రింద గదిలో వున్నారు. ఒకసారి నేను రమ్మన్నానని చెప్పు"

అంటూ చెల్లెల్నీ, భార్యనూ అక్కడ నుండి పంపేశాడు

ఆ మాటలను ఆదిలక్ష్మి మరోవిధంగా అర్థం జేసుకుంది "ఏం? రానీ, ఆయన వస్తే తలకొట్టి మొలవేస్తారా యేం? అస లిదేమిటో ఇవ్వాళ తేల్చి వేసుకో దలచుకున్నాను నేను"

'ఉస్స్'రంటూ కుర్చీలో కూలబడ్డాడు కేశవరావు

"నీకు ప్రతీదీ అవ్వకూడని విధంగానే కాని బాగా మాత్రం అర్థం కాదు నీ సందేహాలు తీర్చటానికే నేను నాన్న గార్ని రమ్మన్నాను," అంటూండగానే అనంతయ్య వచ్చాడు సోఫాలో కూర్చుంటూ 'ఏమి' టన్నట్లు చూచాడు కొడుకును

'విశేష మేమీ లేదు కాని అమ్మకు చాలా కోపంగా వుంది ఆవిడ సందేహాలు తీర్చడం సబబు ఎంత కాలమీ దాపరికం?" అన్నాడు కేశవరావు తండ్రితో

"నేనూ అందుకే చూస్తున్నాను కానీ ఏదీ, సమయం చిక్కలేదు ఇలా కూర్చో లక్ష్మి" అంటూ కుర్చీ చూపించాడు

"అక్కర్లేదు నిల్చోగలను ఆ అద్భుత రహస్య మేమిటో త్వరగా వినాలనుంది"

"అదే నీలో వచ్చిన గుణం ఆ అసహనమే కూడదు కూర్చుని తాపీగా వింటే బాగుంటుంది నేను చాలా ముఖ్య విషయం చెప్తున్నాను"

ఆదిలక్ష్మి మాట్లాడకుండా కూర్చుంది అనంతయ్యకు దగ్గరలో కేశవరావు లేచి గది తలుపు గడియ వేసివస్తూ "శ్యామ సుందర్ ఎక్కడ?" అనడిగాడు

"లేదు సినిమాకు పోయాడు" అంది

"చూడు లక్ష్మి" చుట్ట వెలిగించి తాపీగా మొదలెట్టాడు అనంతయ్య

"నేను చెప్పబోయేది బహుశః నీకు వినగానే ఆమోదయోగ్యంగా వుండక పోవచ్చు కోపం తెచ్చుకోకు కాస్త నిదానంగా ఆలోచించి ఒక నిర్ణయానికి రా ఇష్టాయిష్టాలను బట్టి తర్వాత ఏ నిర్ణయానికైనా రావచ్చు కాని మరెవ్వరికీ ఈ విషయం మాత్రం తెలియకూడదు ఇంతవరకూ నాకూ, కేశవ్‌కూ తప్ప మరెవ్వరికీ ఈ సంగతి తెలియదు ఇప్పుడు నీకు చెప్తున్నాను మన ముగ్గురి మధ్యనే వుండాలీ విషయం"

ఆదిలక్ష్మి మాట్లాడలేదు విసుగ్గా చూచింది

తిరిగి మొదలుపెట్టాడు అనంతయ్య, "ఇంతవరకు ఇలాటి విషయం నీకు తెలియనివ్వ నందుకు నువ్వు ఆశ్చర్య పోవచ్చు ఇవ్వాల్టి వరకూ అస లింకా నేనే మనస్సులో ఎటూ నిర్ధారించుకోలేదు ఆ మాత్రందానికి అందరకూ చెప్పడం

దేని కని ఉపేక్షించాను. ఆక యిప్పుడు నేను, కేశవ్ ఒక విధంగానే నిశ్చయించుకున్నాము. నీ అంగీకారంకూడా అయితే సంతోషిస్తాను.''

ఒక్క క్షణం ఆగాడు. "మనం క్రిందటి సంవత్సరం అమ్మాయివివాహం చెయ్యటానికి కొన్ని ప్రయత్నాలు చేశాం, కొన్ని సంబంధాలు చూచాం.''

"ఇప్పుడా సంగతులు దేనికి ?" మధ్యలోనే అడ్డు వచ్చింది ఆదిలక్ష్మి. "ఇంట్లోనే పెళ్ళికొడుకు నుంచుకొని మీరు చాద స్తంగా చేశా రా ప్రయత్నాలన్నీని. అన్నివిధాల మన కోరికలు తీర్చేవాడు — శ్యాంకు ఇవ్వాలని నిశ్చయించుకొంటిమిగా ?"

నవ్వాడు అనంతయ్య. ''ఎవరు నిశ్చయించుకున్నారు ? నీకే వుంది ఆ కోరిక. కాని నువ్వా సంగతి ఎప్పుడెత్తినా నేను నా అనంగీకారం సూచిస్తూనే వున్నాను."

"అయితే ఏమంటా రిప్పుడు ?''



క్రోధం, ఉక్రోషం, పెనవేసుకురాగా తీక్ష్ణంగా అడిగింది.

కేశవ్ కలుగజేసుకున్నాడు. "శాంతం వహించమ్మా. ఇది యింటి విషయం. కుటుంబ సభ్యు లందరికీ సంబంధించినది. ఆడపిల్ల వివాహ మంటే దాని ఒక్క జీవిత సమస్యేకాదు; అది సుఖంగా, ఫలవంతంగా వుండేనే వెనుక నున్న మనందరికీకూడా తృప్తి, ఆనందమూను. ఓర్పుగా విని నిదానంగా ఆలోచించమ్మా."

"సరే. ఏమి టది?'' కొంత అసహనం తోనే ప్రశ్నించింది ఆదిలక్ష్మి.



అనంతయ్య మెల్లగా అన్నాడు. "తమ్ముడని నీకు అభిమాన ముండవచ్చు. వుండవలసిందే కూడ. శ్యాంసుందర్‌పై నాకూ అభిమానమే. కాని బిందు మన బిడ్డ. దాని విషయం అతిముఖ్యం. దాని సుఖం, సంతోషం, మనస్సులో కోరికలు అన్నీ ఆలోచించి తీర్చవలసిన తలిదండ్రులం మనం.

"ఏమిటంటారు దాని కోరికలు? తల్లినినాకంటె మీకెక్కువ తెలుసా?"

"నేనన్నానా అలాగ?" నవ్వేశాడు అనంతయ్య.

"ఎందుకీ డొంక తిరుగుళ్ళన్నీ? నా తమ్ముడు మీ కూతురుకి తగ డంటారు, అంతేనా?" తీవ్రంగా వున్నాయి ఆదిలక్ష్మి మాటలు.

"ఔను" స్పష్టంగా అన్నాడు. "బంగారపు బొమ్మ. బి. ఎ. చదువుతూంది. దానిని బొత్తిగా అంత కారు నలుపు, స్కూల్ ఫైనల్ చదువైనా లేనివాడి ప్రక్క ఒక్కసారి ఊహించు లక్ష్మీ. నీ తమ్ముడి కున్న ఆస్తంతా పైకి పోదనీ, తమ్ముడే గనుక చెప్పినట్టు వింటా దనీ నీ అభిప్రాయం. ఒక్కసారి డబ్బుపిచ్చి దూరంగా నెట్టి స్త్రీ హృదయంతో ఆడపిల్ల మనస్సు లోతుల సర్థం చేసుకొని ఒక్కసారి యోచించు లక్ష్మీ. నీ మనస్సుకు తృప్తిగా వుందా? ఆ జోడు సరైనదే నంటావా?"

"భగవంతుడిచ్చిన తెలుపు నలుపు రంగుకు మన మేం చేస్తాం? లక్షలుచేసే ఈ ఆస్తిపాస్తు లన్నీ చూచుకొనే తీరికే లేకుంటే మనకు చదువులు, ఉద్యోగాలు దేనికి? మన కేశవ్ మాత్రం పెద్ద చదువులు చదువుకున్నాడా? వెనుక బాధ్యత లేదుగనుక చిన్నబ్బాయిని చదివిస్తున్నాం. ఆడపిల్ల — పనీపాటా లేదు. మీరు సరదాపడి చదివిస్తున్నారుగనుక బిందు చదువుతూంది. దానికిమాత్రం చదు వెందుకు."

"అవును, పనీపాటా లేక తీరికగా కూర్చోకూడ దనే నేను దాన్ని చదివిస్తూంట, తగిన వరుడు దొరికేవఱకు."

ఆశ్చర్యావమానాలతో తలెత్తింది ఆదిలక్ష్మి. "ఎంత లోతుగుండె మీది! మీలో యిన్ని ఆలోచన లున్నా యని గ్రహించలేకపోయానే!"

"గ్రహించి తట్టుకోగల నేర్పు వుంటే నేనే చెప్పేవాడిని యేనాడో! నీలో వున్న ఆ లోపమే మన యిద్దరిమధ్యా ఇంత అగాధాలను సృష్టిస్తోంది. దానికేం గాని శ్యాంసుదర్‌కి నే నేలోటూ రానివ్వను. అతడికైనా మనమే తల్లీ తండ్రీని. కాని అమ్మాయి జీవితాన్ని అతడితో ముడిపెట్టవద్దు. అతడికి మంచి సంబంధం వెతకి చేసే పూచీ నాది."

"ఎందుకీ ఉపన్యాసా లన్నీ?" తీవ్ర స్వరంతో బిగ్గఱగా అడిగింది. "ఆ బడి

పంతులుమీదకిపోయిందాయేమి టింతకూ దృష్టి ?"

అనంతయ్య ముఖంకూడ బలవం తంగా కోప మాపుకుంటున్న ట్లుంది.

"అవును. సరిగా ఊహించావు. ఏడాదిక్రిందట నేను ప్రయత్నించిన సంబంధాలలో ఇదొకటి. నేనెవరో మధ్యవర్తిద్వారా రాయబారం చేస్తే అతడు ఇల్లరికాని కొప్పుకోలేదు. అంతలో వదిలేశాను. కాని ఫలానా అని వివరంగా నాకూ తెలియదు; అతడికీ తెలిసివుండదు. వెతుకుతున్న తీగ కాలికి తగిలినట్టు ఇప్పు డతడినీ ఇక్కడికే రప్పించాడు దేవుడు.''

"సరే, యింకేం ! మీ రందుకు వల పన్నుతున్నా రన్నమాట ? పుట్టిననాటి నుండీ పూలపాన్పులపైనే నడిపించారే మీ గారాలకూతుర్ని! అంత సామాన్యుడి కెలా చేస్తారు మరిప్పుడు ? తన తిండి తను తినడంకూడా చేతకాదే మీ గారాల కూతురికి ?''

''ఎంత వెఱ్ఱిదానవు లక్ష్మీ ! అనంతయ్య అల్లుడు సామాన్యు డెలా గౌతాడు ? నా జీవితంలో ఈ ఆనందం, ఈ ఐశ్వర్యం, సుఖం అన్నీ అమ్మాయి పుట్టిననాటినుండే వచ్చాయి. అందుకే నా కదంటే అంత పంచప్రాణాలు, నీకూ తెల్సు. అదే నా లక్ష్మి, నాజ్యోతి. ఈ ఆస్తిలో సగం దానికిస్తాను, సగం మిగిలినదే అబ్బాయి లిద్దరికీ !"

"మీ కేమీ దయ్యంగానీ పట్టలేదుకద!" చికాకుపడ్తూ కూర్చున్న చోటునుండి లేచిపోయింది ఆదిలక్ష్మి. "ఎవడో బికార్ని తీసుకొచ్చి పెద్దవాడిని చేస్తారా ? వంశం నిలబెట్టే కొడుకు లిద్దరూ తక్కువై పోయినా మీ కక్కర్లేదూ ?'' అంటూ కొడుకువైపు తిరిగి "ఏరా కేశవ్? వాజమ్మలా ఆయనకు వంతపాడ్తున్నావా? నీ కేం ఆస్తివిలువ తెలిసినట్టు లేదు'' అంది.

తేలికగా నవ్వేశాడు కేశవరావు.

"నీ అమాయకపుటాలోచనలకు ఎలా సమాధానం చెప్పాలో నాకు తెలియడం లేదమ్మా. ఇవి పూర్వంరోజులు కావు– మగవాడు వంశోద్ధారకుడని అందల మెక్కించటానికీ, ఆడది పరాయి యింటికి పోయేదని తేలికగా చూడడాని కీని. ఒకే తలిదండ్రుల కడుపునపుట్టి ఒకే యింట్లో పెరిగిన పిల్లలందరూ ఆడ మగ వివక్షత లేకుండా సమానాధికారాలతో ఆస్తిని పంచుకునే హక్కునిచ్చి ఉద్ధరించా రిప్పుడు మనగవర్నమెంటువారు. కొడుకు కులదీపకుడైతే కూతురు వంశ పరువు ప్రతిష్ఠలు నిలబెడుతుంది. అదీ కాక ఆస్తికి ముఖం చూచుకుంటామా, ఇవ్వ గలిగుండీ ? చెల్లాయి సుఖపడా లనే కోరిక నాకుమాత్రం వుండదూ ?''

"అయితే ఆస్తిలో సగం పరాయి వాడికి ధారపోసేస్తా రన్నమాట ! శ్యామ్

కైతే చిల్లిగవ్వ ఇవ్వ నక్కరలేదే!'' ఆఖరి అస్త్రం ప్రయోగించింది ఆదిలక్ష్మి.

"అందుకని? అమ్మాయి సుఖం నాశనం చేయమంటావా? అవసరమైతే సగంకాదు, పూర్తిగానైనా యిచ్చేస్తాం. సరోజిని పరాయి యింటినుంచి మనింటికి రారేదూ డెబ్బై వేలతో? అప్పు డేమైంది ఈ పట్టంతా? కోడలు బరువుగా రావాలి; కూతురు తేలికగా వదలిపోవాలి. ఏం కోరికలమ్మా?''

''ఇంతకూ నా తమ్ము డంటే ఇష్టం లేదు. అది స్పష్టంగా చెప్పరాదూ? తండ్రీ కొడుకు లొకటైతే ఎందుకీ నాటకం?''

''ఇష్టంవుంది, అవసరమైనంతవరకు. అంతేకాని ఇంటి అల్లుడిని చేసుకొనే అభీష్టంమాత్రం లేదు; వుండబోదు. మగవాడు తనకంటె తక్కువదాన్ని కోరుకుంటాడు. స్త్రీ అన్నివిధాలా తన కంటె అధికుడిని కోరుకుంటుంది; అది ప్రకృతిసహజం. ఈ విషయం మఱచి నువ్వెంత వితండవాదం చేసినా ప్రయోజనం లేదు'' అని లేచాడు కేశవరావు.

అనంతయ్య కూడ కూర్చున్న చోటు నుండి లేచాడు సంభాషణకు ముగింపు సూచిస్తూ. "సరే చెప్పవలసిన దంతా చెప్పాను. తీరికగా ఆలోచించు. కాని జాగ్రత్త; ఎవ్వరికీ తెలియకూడదు. అమ్మాయి కసలు తెలియ కూడదు ఇప్పట్లో. ఇంతకూ ఇదంతా నా ప్రయత్నమే. అసలు కదిల్తే ఎలావుంటుందో!"

ఆవేం విన్పించుకోనట్టు నటించింది ఆదిలక్ష్మి. "అలాగే అలాగే. అదేమిటో నేనూ చూస్తాను;'' అంటూ విసురుగా వెళ్ళిపోయింది.

## 14

ధనుర్మాసం ప్రవేశించ బోతోంది. చలి గడ గడ లాడించుతూంది.

ఉదయం కాఫీ తీసుకుని తీరికగా పరిస్థితులను సింహావలోకనం చేసుకుంటూ పడుకున్నాడు చక్రపాణి. ఒక ప్రక్క విద్యార్థులతో గొడవలకు, తన స్థితికి విచారించాలో – మరొకప్రక్క అంతటి ఉన్నత కుటుంబీకుల నిష్కల్మష ప్రేమాదరాలకు సంతోషించాలో తెలియటం లేదు. తలచుకొన్న కొలదీ విపరీతమైన నవ్వొస్తోంది. ఆరోజు క్లాసులో ఎవరినైతే మందలించాడో అతడికి కోపం రాలేదు. నిష్కారణంగా మరొక వ్యక్తికి కోపం వచ్చింది. ఒక విద్యార్థిలో అమిత పరివర్తన తీసుకొచ్చిన హితబోధలే మరొక విద్యార్థి అహంకారాన్ని రెచ్చగొట్టాయి! విధినిర్వహణలో తన కున్న పట్టుదలే తన ఉద్యోగానికి అగ్ని పరీక్ష ఐంది! ఎవరి కారణంగా తన ఉద్యోగం పోగల దనుకున్నాడో అతడే తల వంచుకు వెళ్ళిపోవాల్సి వచ్చింది. విద్యార్థు లెవరి ద్వారానైతే తనపై కక్ష

సాధించ దలచుకున్నారో వారివల్లనే తన గౌరవం కాపాడబడి అయాచిత సత్కారాలు లభిస్తున్నాయి. ఎంత చిత్ర మైంది ఈ లోకం! అదృష్ట దురదృష్ట యోగాలెంత ప్రక్క ప్రక్కల వుంటాయి!

"అన్నయ్యా, డాక్టర్‌గారొచ్చారు." ఇందిర మాటలతో చక్రపాణి ఆలోచనల కంతరాయం కలిగింది.

టెంపరేచర్ చూచి, కట్టుమార్చి ఇంజక్షన్ చేసి వెళ్ళిపోయాడు డాక్టరు. ఆ తర్వాత కొద్దిసేపటికి అనంతయ్య గారి కారుహారన్ విన్పడింది వీధిలో.

"అన్నయ్యా! అనంతయ్యగారు!" వార్త చెవిని వేసి పారిపోతూన్న ఇందిరను వెనక్కు పిలిచి కాఫీ తయ్యారు చెయ్య మన్నాడు పాణి. "తెల్సు." అంటూ ఇందిర వీధిలోకి ఎదురేగి



అనంతయ్యను తోడి తెచ్చింది పాణి గదిలోకి. పాణి నమస్కరించి, లేచి కూర్చో బోతూంటే అనంతయ్య వద్దని వారించాడు. కుర్చీలో కూర్చుంటూ "ఎలాగుంది ?" అనడిగాడు.

"దెబ్బల బాధ కొంచెం తగ్గిందండి. టెంపరేచర్ మాత్రం అలానే వుంది. నూరు దిగలేదు. భోజనం వద్దన్నాడు డాక్టర్ గారు."

"ప్చ్" విచారం ప్రదర్శించాడు అనంతయ్య. "అయినా ఎంత నర్థం తప్పింది ? అందుకే నేను సంతోషిస్తున్నాను కొంచం. మీరు మరీ అలా ఎవర్నిపడితే వార్ని నమ్మకూడదు" అంటూ కారు డ్రైవర్ని చూచి సంభాషణ ఆపేశాడు. రెండు ప్లాస్టిక్ సెజ్జలతో బత్తాయి, ద్రాక్ష పండ్లు అక్కడుంచి వెళ్ళిపోయాడు డ్రైవరు.

"నా గురించి మీరు అన్నివిధాలా శ్రమపడుతున్నారు. మీ హృదయంలో నాపై దైవం అంత అభిమానం కల్గించాడు" అన్నాడు పాణి.

గంభీరంగా నవ్వి ఊరుకున్నాడు అనంతయ్య. ఇందిర కాఫీ తెచ్చి ఇచ్చింది, అనంతయ్యకు. ఆ వెనుకనే జానకమ్మకూడా వచ్చి నిల్చుంది గుమ్మం ప్రక్క కన్పించీ కన్పించకుండా.

"ఏమమ్మా, మీ ఋంగారు కాస్త తగ్గిందా ?" అన్నాడు అనంతయ్య నవ్వుతూ.

"తగ్గింది బాబూ. దేవుడులా మీ రుండబట్టి" అని సమాధానమిచ్చింది జానకమ్మ.

"దానికేం గానీ రెండు రోజులు జాగ్రత్తగా వుంటే అదే తగ్గిపోతుంది. మీ కెందుకైనా అవసరమేమో ? మా నౌకర్ని విడిచివెళ్తున్నాను" అంటూ లేచాడు అనంతయ్య.

"నే నింకా మీతో మాట్లాడుదామనుకొంటున్నాను. అప్పుడే లేస్తారా ?" అన్నాడు నిరుత్సాహంగా పాణి.

"ఏమిటది ?" అనంతయ్య కూర్చున్నాడు.

"ప్రిన్స్‌పాల్‌కు ట్రాన్స్‌ఫర్ చేయించారట ! నా గురించి మీరు అందరితో నిష్ఠురపడుతున్నారా ?"

"నా కేం ఫర్వాలేదు." చిరు నవ్వుతో అన్నాడు అనంతయ్య.

"మరొకసంగతి. మీ కస లేవిధంగా చెప్పుకోవాలో తెలియడం లేదు."

"ఫర్వాలేదు. చెప్పండి."

"కరుణాకరం విషయమండి. నిన్న జాబుద్వారా మీకు తెలియపరచాలనుకున్నాను కాని, స్వయంగా మీతో మాట్లాడ్తేనే బావుంటుందని......"

"అవును అబ్బాయి చెప్పాడు. మీ రతడిని అనుమానించటం లేదంటే నాకు నవ్వొస్తోంది. మరీ అంతమంచితనమా ?"

"అనుమాన మున్నా అతడికి అప


LIFEBUOY
SOAP
LIFEBUOY SOAP
ఎక్కడ
లైఫ్‌బాయ్ ఉన్నదో
అక్కడ ఆరోగ్యము ఉన్నది
లైఫ్ బాయ్ సబ్బు మురికిని మురికిలోగల క్రిములను కడిగివేయును, లైఫ్ బాయ్ వల్ల - కుటుంబములో అందరి జీవితం ఆరోగ్యవంతం !
హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి
L. 40-77 TL

కారం చెయ్యటమంటే మన సంగీక రించడం లేదండీ."

"అయితే మాట్లాడ కూరుకో మంటారు? ఇది అలుసుగా తీసుకొని వాడు రేపు మరో లెక్చరర్ ఎవరికైనా యిదే మర్యాద చేస్తే?"

"క్షమించండి. మీకు కోపం వచ్చిం దనుకుంటాను. నా ఉద్దేశ్యం శిక్షలవల్ల అతడి దురుసుతనం మరింత పేట్రేగి పోతుం దని. మంచితనం వల్లనే మను ష్యుల మనసులు మార్చాలి. అదీ కాక తెలివితక్కువ కొలదీ అత దేదో చేశా డనుకోండి. అంత మాత్రాన మనం అతడి చదువే పాడుచేస్తే అతడి గతేమా తుందంటారు? చదువు జీవితానికి ముఖ్యంకదా? అదే లేకపోతే అతడు జీవనోపాధికి మరిన్ని చెడుపనులలోకి దిగుతాడు. అతడు, అతడిని నమ్ముకున్న వారూ కూడ అధోగతి పాలైపోతా రని భయంగా వుంది."

అనంతయ్య తదేకంగా పాణి నేత్రాల లోకి చూడటం మినహా ఏమీ మాట్లాడ లేదు. అతడి చూపులలో భావ మేమిటో పాణి కవగతం కాలేదు.

"చూడండి. అనంతయ్యగారూ!" చక్రపాణి తిరిగి అన్నాడు. "నాకు దైవంపై గట్టినమ్మక ముంది. ఏం జరి గినా మన మేలుకే అని తృప్తి పడు తూంటాను. పరిస్థితు లన్నీ తాత్కాలి కంగా బాధాకరమే అనిపించినా - ఇలా తటస్థపడ్డాయి గనుకనే అతి సామాన్యుడ నయిన నాకు మీ ప్రేమాభిమానాలు లభిం చాయి. ఇది దైవలీల కాదంటారా?''

మనస్ఫూర్తిగానవ్వాడు అనంతయ్య. "సరే. మీ యిష్టప్రకారమే కానిస్తాను. కరుణాకరం విషయంలో నే నేమీ జోక్యం కలుగజేసుకోను; స్వస్థత చిక్క గానే కాలేజీకి వెళ్ళరుగాని. నేను వస్తాను మరి. ఎవరో ఒకరం వచ్చి చూస్తూంటాం లెండి తగ్గేవరకు.''

"చిత్తం. నమస్కారం.''

''నమస్కారం, మా నౌఖర్ని ఇక్కడే వుంచి వెళ్తాను, అవసరమైన పనులు చేయించుకోండి."

"చిత్తం."

అనంతయ్య వెళ్ళిపోయాక జానకమ్మ ప్రవేశించింది గదిలో,

"చూశావామ్మా. ఆయన కెంత వెట్టి ప్రేమో నే నంటే? అంతటి వ్యక్తి నన్నుచూడ్డానికి మనింటికి రావడ మేమిటి? ఇంతశ్రద్ధ చూపడ మేమిటి?"

''అదేబాబూ, నాకూ అర్థంకావడం లేదు. బొత్తిగా దిక్కులేనివాళ్ళ మని దేవుడీయనను చూపెట్టాడు మనకు. మొన్న నిన్న ఎంత ఖంగారుపడిపోయా మని?'' దుఃఖ మాగలేదు జానకమ్మకు.

"ఫర్వాలేదమ్మా. ఇక తగ్గిపోతుంది నాకు," కన్నీళ్ళు తుడిచాడు పాణి.

''కాని ఆయన కెందు కంత ఇష్ట మంటా వన్నయ్యా మనపైన? కేశవరావు

గారికి కూడా మనమంటే చాలా అభిమానం" అంది ఇందిర.

"నీకెందుకు? నీవు స్కూలుకు వెళ్ళు. నిన్న వెళ్ళలేదుకదూ?" గదమాయింపుగా అన్నాడు.

"వెళ్తాన్లే, నీకు తగ్గనీ" అంటూ అన్నకు దగ్గరగా కూర్చొని ద్రాక్షపండ్లు తినిపించసాగింది.

"పద్మ ఏదీ?" అన్నాడు పాణి.

"ఎటో వెళ్ళింది."

"హుం," నీరసంగా మూలిగాడు పాణి. పెద్దచెల్లెలి విషయంలో ఎందుకో ఈ మధ్య పాణికి విచారం అధికం కాసాగింది. అది కనిపెట్టిన ఇందిర అతడి మనస్సును మరోవైపుకు త్రిప్పాలని "వాళ్ళబిందు కూడా మన అక్కయ్య వంటిదే కదన్నయ్యా? నాకెందుకో అలా గన్పించింది చూడగానే." అంది నవ్వుతూ.

ఆశ్చర్యంగా చూచాడు చక్రపాణి. 'సరిగ్గా తానూ అదేవిధంగా వూహించాడు, బరువు బాధ్యత లెరుగని ఆ పిల్లలిద్దర్నీ. ఇందిర కెలాతెలిసిందో తన మనస్సులోమాట! వయస్సుకు చిన్నదైనా ఆలోచనపెద్దది!'

ఏదో ఆలోచిస్తూన్న జానకమ్మ అంది. "అబ్బాయ్! బాగా అనాచారం కొంపరా? ఓ మడీ, దడీ ఏమీలేవు."

నవ్వి ఊరుకున్నాడు పాణి. ఓపిక వుంటే ఓ చిన్న లెక్చ రిచ్చివుండేవాడే!

"ఆ తండ్రీ కొడుకులకేకాని ఆ ఆదిలక్ష్మమ్మ కేమంత ఇష్ట మున్నట్టు లేదు మనమీద. ఉన్నంతసేపూ ముఖం చిట చిట లాడ్తూనేవుంది" అంది తిరిగి. సమాధానంగా పాణి యేదో అనబోయేలోగానే ఇందిర విసుక్కుంది తల్లిని.

"అలాగే వుంటారు రకరకాలు! నువ్వనడంలేదూ మడీ, దడీ అని? అలాగే ఆవిడ కేంలోపం కన్పించిందో మనలో! నిన్నరోజంతా ఇంట్లో పెట్టుకుని ఇంతంత మర్యాదలు జరపడమే గొప్పసలు. ఇంకా లోపాలెన్నడం కూడానా?"

"సరే లే వే. అది నేను మాత్రం కాదన్నానా? ఏ తండ్రో, అన్నగారో చెల్లెల్నీ పిల్లల్నీ కడుపులోపెట్టుకు కాపాడినట్టు కాపాడాడు మహానుభావుడు." అంటూలేచి వంటగదిలోకి వెళ్ళిపోయింది జానకమ్మ.

"అయితే అమ్మాయి, ఇలారా మాట;" అంటూ చెల్లెల్ని దగ్గరగా రహస్యంగా పిలచాడు పాణి. "అయితే అవి దేమైనా విసుక్కున్నారా మిమ్మల్ని?"

ఏదో చెప్పబోయి "అబ్బే లేదన్నయ్యా" అంది ఇందిర.

"ఏదో దాస్తున్నావ్!"

"ఏమీ లేదు." అంటూ నవ్వి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

'ఇందిర ఏమైనా తనంత తాను చెప్పాలేకాని బలవంతంగా చెప్పించలేం. లోతుగుండె' అనుకున్నాడు పాణి.



కిటికీ నుండి ప్రసరించిన సూర్యకాంతి నునువెచ్చని గిలిగింతలతో పలుకరిస్తోంది మేనిని. బయట పుష్పాలన్నీ వికసిత వదనాలతో భాస్కరుని తిలకిస్తున్నట్టు కన్పించాయి. సూర్యుని గతి అనతి కాలంలోనే మారబోతుంది; ఉత్తరాయణంలో ప్రవేశించబోతూన్నట్లు వాతావరణం స్పష్టంగా చెప్తోంది. అప్పుడే బంతిచామంతులు వికసించ నారంభించాయి. ఉసిరికలు పిందెతొడిగాయి. కొండమల్లె, నందివర్ధనాలు కొల్లలుగా పూస్తున్నాయి. సూర్యోదయకాంతులతో నవలావణ్యంతో లాస్యం చేస్తూన్న ఆ పూబాలల ముగ్ధ సౌందర్యం, నవోదయ కాంతులతో సద్యోవికసితమైన అరుణ పద్మంవలె భాసించే బిందుమాధవి వదనబింబాన్ని ఎదలో దోబూచులాడించింది. (సశేషం)

Printed and Published by Sri A. Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI",

కండల నొప్పులు
పోగొట్టుకోండి
ఇదిగో

# అమృతాంజనము



అమృతాంజన్‌లో శమనాన్ని కలిగించే 10 రకాల ఔషధాలు ఉన్నాయి. త్వరగా-నమ్మకంగా నివారణ కలిగిస్తుంది. అతి కొంచెము వాడవలసి ఉండటంచేత ఒకే సీసా నెలల పాటు వస్తుంది. 70 ఏళ్ళ పేరు గడించిన అమృతాంజన్ బెణుకులకు, తలనొప్పికి, గుండె జలుబుకు, ఇతర బాధలు, జలుబులు మరియు నొప్పులకు అమోఘమైనది.

గాలిమార్పు, నిత్యజీవితంలో తాపత్రయాలు నొప్పులను, జలుబులను ఇతర బాధలను కలిగిస్తాయి. ఇంట్లో ఒక అమృతాంజన్ సీసా ఉంచుకోండి.

అమృతాంజన్ 10 రకాల
ఔషధాలు చేరిన మందు




అమృతాంజన్ క్రొత్తగా అట్టపెట్టెలో వస్తుంది. సీసా 'అల్యూ'క్యాప్‌తో సీలు చేయబడి ఉంటుంది.

**అమృతాంజన్ లిమిటెడ్**

మద్రాసు . బొంబాయి . కలకత్తా - ఢిల్లీ

JWT-AM-2332

